శ్రీ

# రామానుజ

# రామాయణము

## ఆరణ్య కాండము

వామలూరు జన్మ వాగమృత మిమ్మది
తేనె తొలుకు తేట తెలుగులోన

తెలుగు సేత :

శ్రీ మచ్ఛ్రీరంగం నల్లాన్ చక్రవర్తి
రామానుజాచార్యుల అయ్యవార్లగారు

SRI RAMANUJA RAMAYANAMU

Aranya Kandamu

by S.N.C. Ramanujacharya



First Edition : August, 1992



Price : Rs. 50/-



For Copies :

**Chakravarthy Prachuranalu,**
26, Tirumala Enclave,
Tirumalagiri,
Secunderabad-500 015.

This book is Published with the financial assistance of SRI TIRUMALA - TIRUPATHI DEVASTHANAMS, under their scheme 'Aid to Publish Religious Books.'

Printed at :

**Padmavathi Art Printers**
1-1-517/B/1, New Bakaram,
Gandhinagar,
Hyderabad-500 380.
Phone : 611413

# వి న్నా రా?

నిజానికి కవికీ, పాఠకుడికీ మధ్య ఒక ఉపోద్ఘాత కర్త అనవసరం.

తెలుగు సాహిత్యాన్ని గురించి మొట్టమొదటి సారిగా నిష్ఠుర మైన కొన్ని నిజాలు చెప్పిన అక్కిరాజు ఉమాకాన్త పండితుడు ఆధునిక కవుల ఉపోద్ఘాతాల పిచ్చిని దుయ్యబడుతూ ఇలా అంటాడు:

"ఆశ్రయించి పొగిడించుకొన్న పీఠికలూ, పీఠికలు వ్రాయడమనే గొప్ప పదవి దొరికింది యింతే చాలు నని పీఠికా కర్తలు వ్రాసే పొగడ్తలూ విచారించ దగ్గవి కావు."*

అందుకే కృతికర్త ఈ కావ్యానికి 'ముందు మాట' వ్రాయమని నన్ను కోరినపుడు "నేను వ్రాయను. ఈ పీఠిక వ్రాయడంవల్ల వచ్చే గౌరవం నాకు అక్కరలేదు" అని కచ్చితంగా చెప్పాను. కాని అతడు వినలేదు. "మీరు ప్రశంసించ నక్కరలేదు. మీరు ఏది వ్రాసి ఇస్తే అదే అచ్చు వేసుకుంటాను" అని భీష్మించుకు కూర్చున్నాడు.

విన్నారా? అదీ సంగతి! అందుకే ఈ నాలుగు ముక్కలూ వ్రాయక తప్పలేదు.

'శ్రీ రామానుజ రామాయణం'లో ఇది అరణ్య కాండం. బాల, అయోధ్యా కాండలు ఇదివరకే అచ్చయి వాటి వాటి పాఠకులను అవి సంపాదించుకున్నాయి. నిజానికి ఏ కావ్యం అయినా అందరినీ అలరించలేదు. ఏ కావ్యం పాఠకులు ఆ కావ్యానికి ఉంటారు. అయితే వేర్వేరు కావ్యాలకు ఉండే పాఠకుల సంఖ్యలలోనూ ఆ పాఠకుల స్థాయులలోనూ తేడాలు ఉంటాయి - అంతే!

'బాలకాండ'లోని తన 'మనవి' లో కవి ఇలా అన్నాడు: "లలితమైన పదాలతో రమణీయమైన అర్థంతో ఆపాత మధురం

---

* వాఙ్మయ పరిశిష్ట భాష్యం - నేటి కాలపు కవిత్వం, ఉపోద్ఘాతాధి కరణం - పుట 256,

గానూ, ఆలోచనామృతంగానూ ఉన్న వాల్మీకి రామాయణం తెలుగు వారికి లభించలే దని నా తపన." ఆ తపనతోనే వాల్మీకాన్ని యథా తథంగా తెలుగువారికి అందజేయాలని కవి ఈ 'శ్రీ రామానుజ రామాయణ' రచనకు పూనుకున్నాడు.

అయితే ఉత్తమ కవిత్వంలో వాగర్థాలు విడదీయడానికి వీలు లేనంతగా సంపృక్తము లైపోయి ఉంటాయి. ఒకే కవి ఒకే భాషలో ఒకసారి వ్రాసిన కావ్యాన్ని తిప్పి వ్రాస్తే అది మరో కావ్యం అవుతుందే గాని ఆ మొదటి కావ్యం కాబోదు. తెలుగు మహా భారతాన్ని, భాగవతాన్ని కవిత్రయోపజ్ఞం అనీ, పోతనోపజ్ఞం అనీ అంటామే తప్ప వ్యాసుడి రచనలుగా మనం గ్రహించము. అందుచేత యథాతథానువాదం అనేది గగన కుసుమం వంటిదే! అనువాదంలో స్థూలంగా మూల వస్తు ప్రతిబింబం కనిపిస్తుందే తప్ప దానిలోని రస, భావాదులన్నీ అనువాదకుని ప్రజ్ఞను అనుసరించే ఉంటాయి.

ఈ 'శ్రీ రామానుజ రామాయణం' లో స్వతంత్ర పద్యాలని పిస్తూ సాఫీగా సాగిన పద్యాలు ఎన్నో ఉన్నాయి. అయితే పునరుక్తులతోనూ, క్లిష్టాన్వయాలతోనూ పాద పూరణకోసం వాడిన వ్యర్థ పదాలతోనూ పాఠకుణ్ణి తికమక పెట్టే పద్యాలు కూడా కొన్ని లేక పోలేదు.

ఇంతకూ - నేను ముందరే చెప్పాను. కవిత్వానికి ఎవరి సర్టిఫికెట్టూ అక్కరలేదని! కవిత్వం తనంత తానే తన పాఠకులను ఆకర్షించుకోగలదని!!

అందుచేత ఇంక నే నేమి మాట్లాడినా అధిక ప్రసంగమే అవుతుంది.

విన్నారా? అదీ సంగతి!

1-8-1992. యథార్థవాది

1-9-34/5/1 బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

రామ్‌నగర్, హైదరాబాదు

# మనవి

వాల్మీకి ముని ప్రణీత పరమార్థం తెలుగువారికి తెల్లం కాలేదు. ఎర్రా ప్రెగడ యెంతవరకు తెల్లం చేశాడో మనకి తెలిసే అవకాశం లేకుండా పోయింది. శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు ఆ ప్రయత్నం చేశారు.

శూర్పణఖ పంచవటి పర్ణశాలకి వచ్చి రాముణ్ణి చూసినప్పుడు వాల్మీకి -

"రామ మిందీవరశ్యామం కందర్ప సదృశ ప్రభం
బభూ వేంద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా" (17-9)

అన్నాడు. రాముడు తన్ను గురించి చెప్పి 'నువ్వెవరవు?' అని శూర్పణఖని అడిగేటప్పుడు, రాముడి చేత -

"న హి తావన్మనోజ్ఞాంగి రాక్షసీ ప్రతిభాసి మే
ఇహ వా కిం నిమిత్తం త్వ మాగతా బ్రూహి తత్త్వతః" (17-20)

అనిపించి, తరువాతి శ్లోకంలో "సాఽబ్రవీ ద్వచనం శ్రుత్వా రాక్షసీ మద నార్దితా" అన్నాడు. పై శ్లోకంలో రాము డన్న మాటలు విన్న శూర్పణఖ (అంతకు ముందు కామమోహిత అయినది) మదనార్దిత అయింది. గోవింద రాజీయ వ్యాఖ్య "యద్వా రాక్షస సేవిత ఇతి తద్వచనాత్ రాక్షసీ త్వమి త్యాశంక్య పరిహరతి (మనోజ్ఞాంగి త్వం రాక్షసీతి న ప్రతిభా సీతి)"అని కూడా వివరణ ఇచ్చింది.

ఇన్ని చిక్కులు తెచ్చిపెట్టటానికి కారణమైంది ఈ మాట. రాముడు ఉద్దేశించక పోయినా, రాముడు తనని 'మనోజ్ఞాంగి' అంటున్నా డని శూర్పణఖకి అర్థమైంది. తానొకటి మాట్లాడితే శూర్పణఖ మరొకటి అర్థం చేసుకుందని రాముడికి అర్థమైంది. అందువల్లనే తరువాతి పరిహాస ప్రసంగం నడిచింది. తాను చెప్పినదానికి వ్యతిరేకమైన అర్థం శూర్పణఖ గ్రహించటమే రాముణ్ణి పరిహాసానికి ప్రోత్సహించింది. దానితో ఒకదాని వెంట ఒకటి తక్కిన చిక్కు లన్నీ వచ్చిపడ్డాయి.

ఈ శ్లోకానికి ఈ రామాయణంలో అనువాదం:

"అంతగా మనోహరాంగివి కావు దా
నవ వనిత వటంచు నాకు దోచు
నిటకు వచ్చియుంటి వెందులకో నీవు
తెలియ బలుకు మీవు కల తెరంగు" (576)

"అంతగా మనోహరాంగివి కావు, దానవ వనిత వటంచు నాకు దోచు" అని రాము డంటే, "అంతగా మనోహరాంగివి, కావు దానవ వనిత వటంచు నాకు దోచు" అని శూర్పణఖకి అర్థమైంది. "ఆలకించి పలుకు లవి మదనార్తయైన రాక్షసి యిటు లని వచించె" అని కూడా తరువాతి పద్యంలో ఉంది.

ఆంధ్ర వాల్మీకి రామాయణంలో శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు ఈ సంభాషణని ఈ విధంగా తెలుగు చేశారు:

"నీదు నమనోజ్ఞ వేషంబు నెరిఁ గనంగ
రక్కసివి గాఁగఁ దోచెదు నిక్కమనుమ
ఇచ్చటికి నీవు రాఁ గతంబేమి? యనిన
సత్యము వచింతునో రామచంద్ర! వినుము."

చాలా సందర్భాలలో గోవింద రాజీయ వ్యాఖ్య ననుసరించినవారు ఇక్కడ దాన్ని విడిచి పెట్టారు. ఇంక గోపీనాథ రామాయణంలో పద్యం ఇది:

"నిను జూడ రాక్షసాంగన
వని తోచుచునున్న దిచటి కరుదెంచుట కే
పని గలదు నీదు కుల వ
ర్తనములు నీ పేరు మాకుఁ దడయక చెపుమా!"

తక్కిన రామాయణాలలో ఇంత మాత్రం శ్రద్ధ కూడా లేదు-వాల్మీకిముని ప్రణీత పరమార్థంమీద. శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో ఈ సంగతే యెత్త లేదు. శూర్పణఖ దంచి మాట్లాడుకుంటూ పోతుంది.

వాల్మీకి చూపిన ఈ మార్గాన్ననుసరించే వరూధినీ ప్రవరుల సంభాషణ శుక్తిమతీ కోలాహలుల సంభాషణ తీర్చిదిద్దారు - పెద్దన, రామరాజ భూషణుడున్నూ.

యుద్ధానికి బయర్దేరేటప్పుడు ఖరుడు చెప్పిన మాటల్లో అమంగళం స్పష్టంగా స్ఫురింపజేశాడు వాల్మీకి.

"అగ్రే నిర్యాతు మిచ్ఛామి పౌలస్త్యానాం మహాత్మనాం
వధార్థం దుర్వినీతస్య రామస్య రణకోవిదః" (22-12)

దీనికి ఆంధ్ర వాల్మీకి రామాయణంలో-

"మద్రథంబును గొని రమ్ము మహిత తేజ!
చనుదు మున్నుగఁ బౌలస్త్య సంతతులకుఁ
జావు గూడఁగ శ్రీరామచంద్రునకును
జయము వెలయఁగఁ బేర్కొందు జగములందు"

అని వాల్మీకి ఉద్దేశించిన అమంగళాన్ని స్ఫురింపజేస్తూ ఉంది. గోపీనాథ రామాయణం అమంగళం ప్రసక్తి లేకుండానే వచనంలో నడిచింది:

"........రాక్షస కంటకుడైన రాముని వధించుటకు మహాత్ములగు పౌలస్త్యులలోన నేను ప్రథమ శూరుండనై తల మిగిలి సంగ్రామంబునకుం జనియెదనని పలికినన్........"

వాల్మీకి ముని ప్రణీత పరమార్థం అంతగా పట్టించుకోలేదు.

ఇంక ఈ రామాయణంలో పద్యం :

"దుర్వినీతుడు రఘుసూతి దురమునందు
మన్నిగొనగ పౌలస్త్యుల మహితమతుల
ముందుకడ నే బయల్దేరిపోవుట కయి
కోరుకొనువాడ సంగ్రామ కోవిదుండ!" (655)

రాముడు అడవిలో సీతను వెదుకుతూ ఒక కొండని చూసి—

"కచ్చిత్ క్షితిభృతాం నాథ! దృష్టా సర్వాంగ సుందరీ
రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా"

అని అడుగుతాడు. ఆ మాటల ప్రతిధ్వనియే సమాధానంగా వినిపించిందని అంటారు. ఈ శ్లోకాన్ని కాళిదాసు విక్రమోర్వశీయంలో వినియోగించుకొని, తన ప్రశ్న ప్రతిశబ్దమే సమాధానంగా వినవచ్చిందని పురూరవుడిచేత చెప్పించాడు.
దీనికి ఆంధ్ర వాల్మీకి రామాయణంలో అనువాదం :

"అబల సర్వాంగ సుందరి యవనిభృ ద్వ
రా! మనోహరమగు వనరాజిఁ జూడఁ
బడియెనా సీత నీచేత విడువఁబడుట
నొంటి నాచేత నడయాడుచుండ నిచట."

గోపీనాథ రామాయణంలో ప్రతిధ్వని ప్రసక్తి లేనేలేదు. ఈ రామా యణంలో అనువాదం:

"భూమి భృద్వరేణ్య! పొడసూపె నాక్కొ స
ర్వాంగ సుందరి యగు రామ యిచట
నాకు బాసియుండి నీకు నీ కాననో
ద్దేశమందు రమ్యదేశమందు" (1975)

తక్కిన రామాయణాల్లో మహర్షి ప్రణీత పరమార్థచింత లేనేలేదు.

బాల, అయోధ్యా కాండల లాగే, ఈ అరణ్యకాండం కూడా శ్రీమాన్ కోయిల్ కందాడై వెంకటాచార్యులుగారికీ, కీ.శే. ఉషశ్రీకీ, ప్రొ॥ కోవెల సుప్రసన్నాచార్యులుగారికీ వినిపించి, వారి తోడ్పాటుతో సవరణలు చేస కున్నాను. శ్రీమాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు నామీద ఆదరంతో ముద్రణ పర్యవేక్షించటానికి అంగీకరించటంవల్ల ఈ కాండం ఈ రూః దిద్దుకొని, మరికొన్ని లోపాలు తొలగించుకొని వెలువడింది. కృతజ్ఞతల ప్రకటించి తీర్చుకొనే ఋణాలు కావివి.

ప్రచురణకి ఆర్థిక సహాయం అందించిన తి. తి. దేవస్థానంవారి! సుందరంగా ముద్రించటమే కాకుండా, వ్యయభారం తగ్గించటానికి సహాయ చేసిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధిపతి శ్రీ పి. శ్రీనివాస గౌడ గా కృతజ్ఞతలు.

సికిందరాబాదు,
1-8-1992

శ్రీ. న. చ. రామానుజాచార్య

# కథా సూచి

శ్రీ

# రామానుజ

# రామాయణము

## ఆరణ్య కాండము

కారడవిని దండకారణ్యమున జొచ్చి
యప్రధృష్య తేజు డాత్మవంతు
డెదుట గాంచె రఘుకులేశుడు రాముండు
తాపసాశ్రమ సముదాయ మచట 1

ఆరవేసియున్న నారచీర లెసంగ
బ్రాహ్మ్యలక్ష్మితోడ పరిఢవిలుచు
వింట వేడి మీరు వెలుగుల గనరాని
సూర్య మండలమ్ముచొప్పు దాని 2

సర్వ భూతములకు శరణమౌ దానిని
చక్కఁ దుడిచిన మునుజక్కిఁ గల్గి
పలు మృగముల గముల బలసిన దానిని
పులుఁగు గము లలమగ బొలుచు దాని
నిచ్చ లచ్చర గమి వచ్చి పూజలు నాట్య
మావరించుచుండు నట్టిదాని 3

విపులమైన యగ్ని వేశ్మములను స్రుక్స్రు
వాది పాత్రముల కుశాజినముల
సమిధలన్ జల కలశమ్ముల ఫల మూల
ములను బొలిచి శోభ వెలయుదాని
కడు నిడుపుగలట్టి యడవిచెట్టుల చవు
లూరు పండ్లచెట్ల నొప్పు దాని 4

పరగుచుండి పుణ్య బలిహోమ పూజల
బ్రహ్మఘోషరవము ప్రబలు దాని
నడవి పూవు లలమ నరవింద సహితమౌ
పద్మిను లలమంగ వరలు దాని 5

పరమ దాంతులైన ఫల మూల భోజనుల్
చీర కృష్ణచర్మ ధారులైన
వృద్ధమునులు సూర్యపీతిహోత్రోపము
లైనవారల కడు నలరు దాని 6

అతి పవిత్రులు నియతాహారులౌ ముని
వరులతోడ శోభ బరగు దాని
బ్రహ్మభవన సన్నిభము బ్రహ్మఘోష ని
నాదితమ్ము బ్రహ్మవేదులైన
యలఘు భాగధేయులౌ మహీసురులతో
శోభమీర నొప్పుచుండు దాని 7

*రాముడు ఋష్యాశ్రమములకు పోవుట*

తాపసాశ్రమ తతి దానిని గన్గొని
శ్రీయుతుండు రఘుకులేశ్వరుండు
నలఘుతేజు డాత డరిగెను చేరంగ
చక్కపెద్దవింటి నెక్కుడించి 8

కాంచి రాము దివ్య జ్ఞాన కలితులైన
పరమ తాపసవర్యులు వారలెల్ల
రెదురుగా బోయి రట్లుగా నెలమిమీర
నా యశస్విని వైదేహి నరసి చూచి 9

ధర్మచారు లైన తాపసుల్ గనుగొని
పొడుచుచున్న సోము బోలువాని
లక్ష్మణుం గనుగొని రమణిని వైదేహి
నా యశస్విని గనులార గాంచి
సర్వ మంగళముల చక్కన నెరపుచు
వారి గొనుచు జనిరి వ్రత నియతులు 10

వన నివాసులైన వారలు విస్మితా
కారు లగుచు కనుల గాంచి రపుడు
రాము నొడలియొప్పు లక్ష్మియు నాతని
సౌకుమార్యము సొగసరి తనమ్ము 11

జనకరాజ పుత్రి సౌమిత్రి రాము న
చ్చెరువు గొలుపునట్టి చెలువువారి
రెప్ప వెట్టకుండ నొప్పరికించిన
ట్లరసి రెల్లరు వనచరులు వారు 12

అచట నతిధి నతని నఖిలభూత హితమ్ము
నెరపు సక్తి గలిగి నిలుచువాని
రాము పర్ణశాల నా మహాభాగులు
నొప్పమీర గూరుచుండ బెట్టి 13

పిదప రామునకును విధియుక్తముగ నగ్ని
తుల్యు లట్లు సత్కృతు లొనరించి
యాహరించి తెచ్చి రా మహాభాగులు
సలిలములను ధర్మచారు లపుడు 14

వన్యమూల పుష్ప ఫలముల నాశ్రమ
కుటియు నా మహాత్మకునకుగా ని
వేదనమ్ము ధర్మవేత్తలు కావించి
యంత నిట్టు లనిరి ప్రాంజలు లయి: 15

"శరణమగుదు వీవె జనులకు వీరికి
ధర్మపాలకుడవు తత యశుడవు
పూజనీయుడవు నృపుడవు మాన్యుండవు
గురుడ వీవె దండధరుడ వౌదు 16

ప్రజల రక్షసేయువా డింద్రు నాల్గవ
యంశతోడ రాఘవాన్వవాయ
ప్రభువు దాన లోకవందితుడై భోగ
వితతి శ్రేష్ఠ మనుభవించువాడు 17

ఇట్టి వారము భవదీయ విషయ వాసు
లైన మేము నీవు రక్షసేయ
దగుదు మడవి నున్న నగరమ్ములో నున్న
నీవె మా పతివి జనేశ్వరుడవు 18

రాజ! న్యస్త దండులము జితక్రోధుల
మేము నెల్లరు విజితేంద్రియులము
కన్నబిడ్డలట్టి ఘన తపోధనులము
నీకు నెపుడు రక్షణీయు లేము" 19

పల్కి యిట్లు వన్య ఫల మూల పుష్ప సం
తతుల తోడ తక్క పెక్కు మెసవ
దగిన వానితోడ తగ పూజసేసిరి
లక్ష్మణాన్వితుడగు రాఘవునకు 20

అట్లె యగ్నికల్పులౌ సిద్ధ తాపసుల్
న్యాయవర్తను లగు నన్యులెల్ల
న్యాయసరణి మీర నర్చన సల్పిరి
ప్రభు వరేణ్యునకును రామునకును 21

## (2 వ సర్గ)

అట్లు రాము డంది యాతిథ్యముల నెల్ల
నర్కు డుదయమందునట్టి వేళ
వారి మునుల నెల్లవారిని వీడ్కొని
యేగి చొచ్చె యడవినే యతండు 22

పలు తెరంగు జంతువుల గుంపు లలమగా
పులులు నక్కలు కడు బలసి యుండ
తరులు లతలు గుల్మతతులు పొదరి యుండ
చెరు వటన్న దెచట నరయరాక 23

కికు రనకయుండ పెక్కు పులుంగులు
నీలపురుగు కూత లెసగుచుండ
కారు నట్టడవిని గాంచె రాముడు తన
వెంట లక్ష్మణుండు నంటిరాగ 24

*రామునకు విరాధు డెదురుపడుట*

కాంచె సీతతోడ కాకుత్స్థు డచ్చోట
క్రూర మృగ వితతులు కూడినెడల
పర్వతేంద్ర శృంగ పరిమాణ దేహుని
మహిత నిస్వను నొక మానవాదు 25

లోతు కనులవాని వెడంద వాతివాని
కుండబొజ్జతో కడు రోత గొల్పువాని
వెలుపు నిడుపును హెచ్చు తగ్గులుగలాని
భీకరాకారు నత్యంత వికృతరూపు 26

మాంస సహిత మార్ద్రమై రక్త సిక్తమౌ
వ్యాఘ్రచర్మ మూనినట్టి వాని
వ్యాదితాస్యుడౌ యుగాంతకు నట్టులు
ప్రాణికోటిని భయపరచు వాని 27

మూడు సింహములను పులులను నాల్గింటి
నక్కదోయి దుప్పు లొక్క పదిటి
మహిత గజశిరమ్ము మాంస సంసిక్తము
దంత యుగ్మయుక్తి దనరువాని
నినుపకోల గ్రుచ్చి యెత్తి యమర్చియు
నెలుగు చెలగ బొబ్బ లిడెడు వాని 28

రాము లక్ష్మణు మిథిలాత్మజాతను సీత
వాడు రాక్షసుండు పారజూచి
యలుక ముప్పిరిగొన నభిధావనము సేసె
జనుల నంతకుండు జముడువోలె 29

వా డొనర్చె ప్రబల భైరవ నాదమ్ము
నదరగొట్టునట్టు లవనియెల్ల
తనదు చంక నెత్తుకొని జనకాత్మజ
తొలగ నేగి యిట్లు పలికె నంత: 30

"మీరు జడలు నారచీరలు దాలిచి
యాలిగూడి బ్రదుకు తూలిపోవ
బాణ చాప ఖడ్గ పాణులై దండకా
వనిని జొచ్చియున్నవార లిట్లు 31

ప్రమదతోడ గూడి వాసమ్ము సేయుట
యిదియు మీరు తపసు లెట్టులొక్కొ?
పాపు లత్యధర్మవర్తు లెవ్వరు మీరు
మునుల నారడివడ బుచ్చువారు? 32

నే విరాధు డనగ నెగడు రాక్షసుడను
దీన దుర్గమంపు కానలోన
కైదు వూనియె తిరుగాడుదు నెప్పుడు
ముని జనముల మాంసములను తినుచు 33

అన్నుమిన్న యీ వరారోహ నాకును
భార్య కాగల దిక పాపకర్ము
లైన మీదు రక్త మాహవమున నేను
త్రావువాడ నిపుడు తనివిదీర" 34

అంచునున్న ధృష్టు నా దురాత్మ విరాధు
దర్పమొప్ప పల్కు తాను వింట
జనకతనయ సీత సంభ్రాంత వణకొందె
నడవి హోరుగాలి నరటివోలె 35

జానకిన్ విరాధు చంక నున్నట్టి శు
భాస్పద యగుదాని పారజూచి
మోము వాడుబారిపోయిన రాముండు
పలికె లక్ష్మణు గని పలుకులిట్లు: 36

"కనుగొను మదె సౌమ్య! జనక నరేంద్రుని
యాత్మ సంభవ యగునట్టి దాని
నీ విరాధు చంక నిరియబట్టిన దాని
నా సతి శుభవర్ణ యగుదాని
కడు సుఖమ్ము మీరగా పెరిగిన దాని
నృపతనూజ కీర్తి నెసగుదాని 37

కైక మన యెడలను కాంక్షించినది యామె
కోరినదియు వరము గోరుకొనుట
ప్రియము గూర్చినదియు వేగమే లక్ష్మణా!
ఫలసమాప్తి నొందగలదు నేడు 38

తుష్టి నందకుండె దూరదర్శిని యామె
కొడుకునకును రాజ్య మడిగికొనుట
దాన సర్వభూత తతికి హితుని నన్ను
బయలుదేర దీసె వనమునకును
నేడు నింక కోర్కె యీడేర గాంచును
నాదు తల్లులందు నడిమి యామె 39

జనకతనయ నొరులు సంస్పృశించుట కన్న
మిక్కుటంపు దుఃఖ మెదియు లేదు
నాకు తండ్రి నెడపినందుల కన్నను
స్వీయరాజ్య మపహరించు కన్న" 40

ఈ కరణి వచింప కాకుత్థ్సు డలమట
మంది బాష్పపూర మగ్ను డగుచు
పలికె లక్ష్మణుండు నలుకగొన్నాతండు
బుస లిడుచును రుద్ధ భుజగ మట్లు: 41

"వాసవోపముడవు ప్రాణుల కెల్లను
నాథుడైన నీ వనాథు నట్లు
నాకు భృత్యునకును కాకుత్థ్స! మొరవెట్టి
యేటి కిట్లు పరితపించుచుంటి? 42

అలుక గొన్న నాదు నమ్ము తాకున గూలి
ప్రాణములను గోలుపడిన వాని
రాక్షసాధముని విరాధుని రక్తమ్ము
త్రావగలదు చూడు ధరణి నేడు 43

అవనిరాజ్య కాముడౌ భరతుని యెడ
కనలు నాకు మున్ను కలిగినయది
దాని పోవిడుతును నేను విరాధుపై
పర్వతమున వజ్రి వజ్రమట్లు 44

మద్భుజా బల వేగిత మహిత శరము
వాని పేరురమున నాట బరచు గాక
యొడలినుండి జీవమ్ము తా నెడపు గాక
వాడు తిరుగుడువడి నేలబడును గాక" 45

## (3 వ సర్గ)

అంత మరల నిట్టు లనియె విరాధుడు
దద్దరిల్లునట్లు తద్వనమ్ము:
"అడుగుచుండ మిమ్ము నాడుడు బదులు నా
కెవరు మీర? లెచటి కేగువారు?" 46

అంత జ్వలిత వదనుడైన వానికి రాక్ష
సునకు నతని కడుగుచున్నతనికి
ననియె నిట్లు రాము డతి మహత్తేజు 'డి
క్ష్వాకు కులములోని వార' మంచు 47

"క్షత్రియులము వృత్తసంపన్నులము వన
గోచరులుగ నెరిగికొనుము మమ్ము
నిన్నెరుంగ గోరి యున్నవార మెవండ
వీవు దండకాటవిని దిరుగుదు?" 48

సత్య విక్రమాభిజాతుడౌ రామున
కిట్టు లని విరాధు డెరుగ జెప్పె:
"హంత! చెప్పువాడ నాలింపుమో రాజ!
యెరిగికొనుము రఘుకులేశ! నన్ను 49

కొడుకు నేను జయునకును శతహ్రద యను
నామె నాకు తల్లి యగును గాదె
నను విరాధ నామమున బిల్చుచుందు రీ
యవని సర్వ రాక్షసాళి గూడ 50

తపము సల్పి నే విధాతృని చేతను
పడసియున్నవాడ వరముగాగ
జగతి శస్త్రముననను చావకుంటయు పరెల్
కాక యుంట నరక రాక యుంట 51

విడిచిపెట్టివైచి పడతుక సీమెను
త్రుంచి యాస లరుగుదెంచినట్టె
పారిపొండు మీరు త్వరిత యానమ్మున
తీయకుందు నేను మీ యుసురులు" 52

*విరాధ వధ*

పలికె నిట్టు లంచు బదు లంత వానికి
రాక్షసేంద్రునకు విరాధునకును
పాపమతికి వికృతవపునకు కోపసం
రక్తలోచనుండు రాఘవుండు: 53

"నీచజనుడ! థూథు! నీవు హీనార్థమై
నెమకుచుంటి చావు నిక్కవముగ
పడయు దీవు నాహవమున నిల్చుండురా
జీవ మూని కడపలేవు నన్ను" 54

పిదప నారి దొడిగి వింట రాముడు కడు
వాడిమీరు తీవ్ర బాణములను
వేగమార నెక్కువెట్టి ప్రయోగించె
రాక్షసేంద్రుపై విరాధుపైన 55

అల్లెత్రాటితోడ నలరారు పెను వింట
పారవిడిచె నేడు బాణము లపు
డతుల వేగయుతము లపరంజి రెక్కల
పనిల గరుడ తుల్య యానములవి 56

వ్రచ్చివైచి బర్హి వాససములు విరా
ధుని శరీర యష్టి తోడుతోడ
నించుకంత రక్త మెనసినవై పావ
కోపమమ్ము లవియు నుర్వి బడియె 57

దెబ్బ తిన్నవాడు దిగబెట్టి వైదేహి
రక్కసుండు శూల మెక్కువెట్టి
మిక్కుటంపు టలుక నెక్కొన రామ ల
క్ష్మణుల దిశకు నురికె చట్టు నపుడు 58

పెల్లు నాద మెసగ బిట్టు బొబ్బిడి యాత
డింద్రకేత నోపమేయ మైన
శూల మెత్తిపట్టి శోభిల్లె నప్పుడు
వ్యాత్త వక్త్రుడైన యముని వోలె 59

అంత వార లిర్వు రన్నదమ్ములు పండు
టంపవాన కురిసి రతని మీద
రాక్షసేంద్రుపై విరాధునిపైన కా
లాంతక యమకల్పు నతనిపైన 60

వాడు రాక్షసుండు ప్రహసించి పెనుకోప
మెరియ నిలిచి యొడలు విరుచుకొనియె
విరుచుకొనెడి వాని పెన్మేని నుండి శ
రమ్ము లాశుగములు రాలి పడియె 61

ప్రాణ వాయువులను బంధించి వర దాన
శక్తివలన రాక్షసాధముండు
శూల మెత్తిపట్టి కేల విరాధుండు
నురికె జేర రఘుకులోద్భవులను 62

వజ్ర తుల్యమైన వాని యా శూలమ్ము
నగ్ని సన్నిభమ్ము నాకసమున
రెండు శరము లేసి ఖండించె రాముండు
శస్త్ర భృతులలో ప్రశస్తు డతడు 63

అట్లు రామ బాణ హతి పరిచ్ఛిన్నమౌ
శూల మదియు నతని కేలినుండి
జారిపడియె వజ్ర సంఛిన్నమౌ మేరు
గిరి శిలా ఫలకము కరణి నేల 64

క్షిప్ర మెత్తిపట్టి కృష్ణసర్పోపమా
త్యంత శుభకరమ్ములైన కత్తు
లిర్వు రొక్కమొగిన యెగసిరి వానిపై
మోది రంత బలము నూది వాని 65

మిక్కుటముగ నట్లు జక్కాడుచుండగా
బాహువులను పొదివిపట్టి వారి
నప్రకంప్యులైన యా నరవ్యాఘ్రుల
కదలిపోవ నెంచె కనలినతడు 66

ఎరిగికొనుట వాని యెడ నభిప్రాయమ్ము
రాము డిట్టు లనియె లక్ష్మణునకు
"మోచి కొనుచు వీడు పోవుగా కంతియ
చాలు బాటపై నిశాచరుండు 67

ఇచ్చవచ్చినట్టు లీ రాక్షసుడు సుమి
త్రా తనూజ! మోయు గాత యింక
నా నిశాచరుండు నరుగువా డే దారి
నదియె మనకు దారి యగును గాదె" 68

వాడు రాక్షసుండు స్వబల వీర్యమ్మున
పైకి లేవనెత్తి వా రిరువుర
నతి బలిష్ఠుల నత డంతట తన మూపు
పై నమర్చుకొనియె బాలురట్లు 69

రాఘవులను వారి రజనీచరుడు మూపు
పైన నెత్తుకొన్నవాడు నంత
బొబ్బవెట్టి ఘోరముగ నా విరాధుండు
కాననమున కభిముఖముగ నేగె 70

పలు తెరంగుల పెన్మ్రాకు లలమియుండ
పెక్కు తెరగు పులుంగులు వింతగొల్ప
క్రూర మృగములు నక్కలు కొల్లలున్న
వని మహామేఘ నిభమున వాడు జొచ్చె 71

## (4 వ సర్గ)

వాడు కొంచుబోవు వారి నా రామ ల
క్ష్మణుల నా విదేహజాత కాంచి
యేడ్చె నామె బిగ్గ నెలుగెత్తి సుభుజ బి
గ్గన భుజమ్ముల గదియంగబట్టి 72

"రాము డితడె దాశరథి సత్యవంతుండు
శీలవంతుడు శుచి చెచ్చెర గొని
రౌద్ర రూపుడైన రాక్షసుం డేగెడు
వీనినిన్ సుమిత్ర సూనుతోడ 73

ఇంక నన్నుబట్టి వృకములు భక్షించు
వ్యాఘ్రములును ద్వీపులైన గాని
"యొడిచికొనుము నన్ను విడిచి కాకుత్థ్సుల
రాక్షసోత్తమ! యిదె ప్రణతి నీకు" 74

రామ లక్ష్మణు లపు డామె యా వైదేహి
యాడు పల్కు లవియు నాలకించి
వేగ పూనుకొనిరి వీరులు వారలు
తద్దురాత్మకుని వధమ్ము సేయ 75

సవ్యబాహు వంత సౌమిత్రి త్రుంచె నా
రౌద్ర రూపుడైన రాక్షసునకు
వాని దక్షిణంపు బాహువు రాముండు
భగ్నమాచరించె బలిమి మీర 76

భగ్న బాహుడైన వాడు సంవిగ్నుడై
పడియె రాక్షసుండు కడు రయమున
పుడమి మీద మబ్బుబోలిన యాతండు
కులిశ భిన్నమైన కుధర మట్లు 77

పిడికిళులను కాళ్ళముడుగుల తోడను
బాదుచున్నవారు పైకి నెత్తి
యెత్తి వాని రాక్షసేంద్రుని ధరణీ త
లమ్ముమీద వైచి క్రుమ్మి రపుడు 78

పెక్కు బాణములను జక్కాడినను కర
వాలములను నరకివైవ నైన
పృధ్వీమీదవైచి పెక్కుగా క్రుమ్మిన
తాను చావలేదు దానవుండు 79

వాని నద్రిమాద్రివానిని జంపంగ
రానివాని జక్క రాము డరసి
యన్ని భయములందు నభయ మిచ్చెడివాడు
శ్రీయుతుం డతండు చెప్పె నిట్లు: 80

"దానవుం డితండు తపము కల్మిని గెల్వ
రాకయుండు యుద్ధరంగమందు
శస్త్రనిహతి పురుష శార్దూల! రాక్షసున్
పూడ్చిపెట్టుద మిక పుడమిలోన" 81

ప్రశ్రితమ్ములైన పలుకులు రాఘవు
డాడ రాక్షసుండు నాలకించి
యా విరాధు డిట్టు లని చెప్పె కాకుత్థ్సు
నకును పురుష వృషభునకు నతనికి 82

"వాసవోపమాన బలశాలిచే పురు
షాగ్రగణ్య! పడితినయ్య నేను
నిన్ను పురుషవర్య నేను మోహమ్మున
మున్నెరుంగ లేకపోతి గాదె 83

కోసలాత్మజాత కూర్మిపట్టివి రామ!
నిన్నెరింగి యుంటి నేను తండ్రి
మహితభాగధేయ మైథిలిన్ లక్ష్మణు
నిద్ధయశుని సైత మెరిగియుంటి 84

పాడు శాపముునను పడసితి ఘోరమౌ
దానవీయమైన తనువు నేను
పేరు తుంబురు డన వెలయు గంధర్వుడ
నైలబిలుని శాప మందియుంటి 85

నేను వేడుకొనగ వాని మహాయశు
డతడు నాకు నిట్టు లని వచించె:
'రణమునందు దాశరథి రాము డెప్పుడు
కూలనేయువాడొ నేల నిన్ను
నపుడు స్వీయరూప మందిన వాడవై
చనెడువాడ వీవు స్వర్గమునకు' 86

అంచు బల్కె నప్పు డనఘ వైశ్రవణుడు
రాజు మిగుల గనలి రంభ వలన
తగులు గల్గియుంట తన్ గొల్వరాకున్న
వాని నన్ను బిల్వబంచి తొల్లి 87

విడుపు గల్గె నాదు కడు దారుణమ్మైన
శాపమునకు నీ ప్రసాదమునను
స్వీయభువనమునకు నేను పరంతపా!
చనెడు వాడ నీకు స్వస్తి యగుత 88

ఉండు నిచ్చటి కథ్యర్థయోజనమున
శౌర్యశాలి ధర్మాత్ముడు సూర్యనిభుడు
తండ్రి! శరభంగు డను మహత్తాపసుండు
వేగ మాతని జేరంగ నేగు మీవు
వాడు శ్రేయమ్ము సమకూర్చువాడు నీకు 89

బొందలోన బెట్టి పూడిచి పెట్టి న
న్నీవు కుశలి వగుచు నేగు రామ!
ప్రాణములను గోలుపడిన రాక్షసులకు
నిదియె సూవె ధర్మ మెల్లపుడును
బొందబెట్టువారి పుణ్యలోకమ్ములు
తమకు నెపుడు శాశ్వతమ్ము సుమ్ము" 90

అని వచించి యప్పు డైక్ష్వాకునకు విరా
ధుండు బాణపీడితుండు మహిత
బలుడు విడిచి పుచ్చివైచి దేహమ్మును
స్వర్గలోకమునకు సాగిపోయె 91

ఆలకించి పల్కులవి రాఘవుం డిట్టు
లంచు లక్ష్మణునకు నానతిచ్చె
"క్రోధయు క్తమైన కుంజరమున కట్లు
లక్ష్మణా! యితనికి రాక్షసునకు
క్రూర కర్మునకును గొప్పదౌ శ్వభ్రమ్ము
నివ్వనమ్ములోన త్రవ్వు మీవు" 92

లక్ష్మణునకు నిట్లు రాముడు వచియించి
ప్రదర మీవు త్రవ్వవలయు నంచు
పీకమీద కాలువెట్టి నిల్చి విరాధు
నలమి వీర్యవంతు డాత డుండె 93

గడ్డపార యంత గైకొని లక్ష్మణు
డుత్తమంపు గొయ్యి నొక్కదాని
త్రవ్వె నతనికి మహితాత్మునకు విరాధ
దానవునకు పార్శ్వతలమునందు 94

పీకపట్టు విడిచి పెట్టి మహాస్వను
శంకుకర్ణు గ్రుమ్మి శ్వ్రభమందు
పారవైచి భైరవ స్వనమ్ము చెలంగ
నరచుచున్న వాని నా విరాధు 95

రామ లక్ష్మణు లాశు విక్రము లుభయులు
కలన జంకక ముదమొంది గెలుపుగొన్న
వారు రాక్షసు కడు భయావహుని బొబ్బ
లిడు నతని నెత్తి గోతిలో పడనడచిరి 96

అరసి యా మహాసురు నవధ్యత నిశాత
శస్త్రమున నప్పుడా నరర్షభు లిరువురు
మిగుల నేర్పరుల్ చంపగా నగు విరాధు
గోతిలో వైచి యని పూనుకొనిరి వారు 97

స్వయముగా విరాధుడు రామువలన తనదు
చావు బలవంతముగ గోరి చంపు టెట్లొ
స్వయముగా జెప్పె కానన చారి యతడు
శస్త్రమున గాక యుండు నా చావటంచు 98

ఆ వచనమునె రాముండు నాలకించి
వాని గోతిని బడద్రోయ నూనె బుద్ధి
రాముడున్ ద్రోయ బల్మి బిలమ్ములోన
రాక్షసుని యార్పు నిండె నరణ్యమందు 99

పుడమి గోతిలోన విరాధు నడచి పుచ్చి
రామ లక్ష్మణుల్ హృష్టాత్ము లైనయట్లు
పడసిరి ముదమ్ము వనమున భయముడింగి
రాక్షసుని గప్పివెట్టిరి రాళ్ళతోడ 100

స్వర్ణమయ చిత్ర కార్ముక పాణు లట్టు
లసురు వధియించి కొని మిథిలాత్మజాత
వారు విహరించి రానంద మార నడవి
నాకసమ్మున నున్న చంద్రార్కు లట్లు 101

## (5 వ సర్గ)

వనములోన భీమబలుని విరాధు ర
క్కసుని వాని బట్టి కసిమసంగి
యంత వీర్యవంతు డతడు సీతను కూర్మి
మీర కౌగిలించి యూరడించి
రాము డిట్టులనియె భ్రాత లక్ష్మణునకు
దివ్యభాసమాన తేజసునకు : 102

"నడువరాకయున్న బెడిదంపు వన మిది
మనము వనములోన మసల వలదు
చేరబోదు మయ్య శీఘ్రమ్ముగా శర
భంగు తపము పేర్మి బరగువాని" 103

### * శరభంగ దర్శనము *

చేరనరిగె రఘుకుమారుడు దేవ ప్ర
భావ కలితు డగుచు బరగి పరమ
తపమువలన భావితాత్ముడౌ శరభంగ
మౌనివర్యు నాశ్రమ పదమునకు 104

కాంచె నాత డంత కడు వింత శరభంగ
తాపసోత్తముని సమీపమందు
తనువు దాల్చియుండి తనరారు వానిని
భాను వహ్ని తుల్య భాసమాను 105

స్యందనమ్మునుండి యవరోహణము చేసి
విబుధ గణములు వెనువెంట రాగ
ధరణితలము లెస్స తాకకు న్నాతని
నచట గాంచె ననిమిషాధినాథు 106

వెలుగులీను సొమ్ము లలవరించిన దేవు
మైల లేని చేల మై ధరించి
యట్టి తీరు గల మహాత్ముల పెక్కుర
పూజ లందుకొనుచు పొలుచు వాని 107

బాలభాను సన్నిభమ్మైన దానిని
వాని కనతిదూర వర్తియైన
హరిహయాభియుక్తమై యంతరిక్ష గ
తమ్ము నైన స్యందనమ్ము గాంచె 108

పాండురాభ్ర పటల పరమ కాంతి యుతమ్ము
చంద్రమః ఖగోళ సన్నిభమ్ము
చిత్రమాల్య యుక్తి చెలువమ్ములం జిమ్ము
స్వచ్ఛ నిర్మలాతపత్ర మరసె 109

స్వర్ణదండ యుక్త చామర వ్యజనముల్
మిగుల వెలగలట్టి మేలివాని
వర మహిళలు చేతబట్టి యాతని తల
పైన వీచుచున్న వాని గాంచె 110

విబుధవరులు సిద్ధవితతి గంధర్వులు
పరమ మౌనివరులు పలువు రప్పు
డంతరిక్ష సంగ తాంగుడౌ దేవుని
ప్రస్తుతించి రర్గ్యవాక్కులెసగ 111

వాసవుండును శరభంగునితో గూడి
యట్టు లచట మాటలాడుచుండ
తాను గాంచి యా శతక్రతు నంతట
రాము డిట్టు లనియె లక్ష్మణునకు
స్యందనోత్తమమ్ము చక్కి నిరూపించి
గుర్తుచెప్పి చూపుకొనుచు నదియు 112

"అద్భుతమ్ము శ్రీ సమభిజుష్ట ముద్దామ
తేజసాన్వితమ్ము తే రదెయదె
అంతరిక్ష గతము నరయుము లక్ష్మణా!
సూర్యునట్లు వెల్గుచున్నదాని 113

మున్ను మనము విన్న పురుహూతు హయములు
శక్రు తేరి బూని చనెడునట్టి
వంతరిక్ష గతములౌ దివ్య తురగమ్ము
లివియు తప్పకుండ నవియె సుమ్ము 114

వీరు నిలిచి యున్నవారు రథము చుట్టు
ముట్టి యెల్ల కడల పురుషవరులు
వందలాది ఖడ్గపాణులు యువకులు
కుండలము లమర్చుకొన్నవారు 115

బహు విశాల విపుల వక్షులు పరిఘా స
మాన దీర్ఘ బాహు మహిమ వారు
శోణకాంతి వస్త్రశోభితు లెల్లరు
నలవి గానివారు పులులయట్లు 116

జ్వలన సన్నిభముగ వెలుగొందు హారము
లెల్లవారి యెదల నుల్లసిల్ల
నిర్వదియును నైదు యేడుల రూపు సౌ
మిత్రి! తాల్చియుండి మెలగువారు 117

ఇదియె కాదె సురల కెల్లరకును గూడ
వయసు శాశ్వతముగ బరగుచుండు
కానుపించువారు కనులకు నింపుగా
నట్లు పురుష సింహు లందువలన 118

ఉండు మిచటనే ముహూర్తమ్ము లక్ష్మణా!
నిలిచి సీతతోడ నీవు గూడ
తేర వచ్చియున్న తేజస్వి యెవ్వడో
స్పష్టముగ నెరింగి వచ్చు వరకు 119

నిలిచి యుండు మిచటనే" యని సౌమిత్రి
తోడ నిట్టులంచు నాడి తాను
కడచి చనియె నపుడు కాకుత్థ్సు డా శర
భంగు నాశ్రమమ్మువలను గాగ 120

అంత చెంత జేర నరుదెంచు వానిని
రాము నరసి యా పురందరుండు
చెంగటికి జని శరభంగమహర్షితో
నేకతమ్ముగాగ నిట్టు లనియె: 121

"ఇటకు వచ్చు నాత డీతడె రాముండు
నన్ను గూడి పలుకనంతదాక
ప్రతిన నెరపుచుండువా డగుం గావుత
పదపడి నను గాంచవచ్చు నితడు 122

గెలుపు గొన్నవాని కృతకృత్యుడౌ వీని
గాంచువాడ నచిర కాలముననె
నెరపవలయును మహనీయ కార్య మితండు
కడమవారు నెరప గాని దాని
కార్య మదియు నెల్ల కడముట్టగా జేసి
యంతట నను గాంచనగు నితండు" 123

అంచు వజ్రి వాని నామంత్రణము సేసి
మన్ననల నొనర్చి మౌనివరున
కశ్వయుక్తమైన యరదమ్ము పై నరిం
దముడు త్రిదివమునకు తరలిపోయె 124

అరిగినంతనే సహస్రాక్షుడున్ పరి
వార సహితు డగుచు చేర నరిగె
రాఘవాన్వయుండు రాముండు హుతవహు
పజ్జ జేరిన శరభంగ మునిని 125

సంగ్రహించి యతని చరణముల్ రాముండు
సీతయున్ సుమిత్ర సూతియు నట
పడసి సత్కృతులును వాసములును కూరు
చుండి రనుమతిగొని యొద్దికగను 126

అంత శక్రు డచటి కరుదెంచుటను గూర్చి
యడిగె నతని రాఘవాన్వయుండు
వివరముగను తాను వినిపించె శరభంగు
డదియు నెల్ల రాఘవాన్వయునకు 127

"వరదు డితడు నన్ను బ్రహ్మలోకము జేర
గొంచు నేగ రామ! కోరువాడు
ఉగ్రతపమున గెలుపొందిన దకృతాత్మ
లైనవారు పడయ గాని దదియు 128

ఏ నెరింగియుంట నో నరవ్యాఘ్ర! యీ
చెంగట నిచటనె మెలంగువాని
నిను ప్రియాతిథి గనుగొనకుండనే నేను
బ్రహ్మలోక మేగువాడ గాను 129

నిను మహాత్ము ధార్మికుని పురుష వ్యాఘ్ర!
నేను కలసికొనుట యైన పిదప
దేవతాగణాభిషేవిత మైన త్రి
దివమునకును బయలుదేరువాడ 130

అక్షయమ్ములైన యత్యంత శుభలోక
ములను గెలుచుకొంటి పురుషవర్య!
బ్రాహ్మ్య లోకములును స్వర్గ పృష్ఠ్యమ్ములు
నేను గెలిచినయవి స్వీకరింపు" 131

అట్లు లనగ నా మహర్షి వరేణ్యుండు
నాలకించి రాఘవాన్వయుండు
నఖిలశాస్త్ర కుశలుడౌ నరవ్యాఘ్రుండు
పలికె నిట్లు లంచు వానితోడ: 132

"సర్వ లోకములను సంయమి మూర్ధన్య!
సంగ్రహింతు నేనె స్వయముగాగ
నిచట కానలోన నేర్పరచుకొన నా
వాస మిచ్ఛగించువాడ నేను" 133

వాసవోపమాన బలశాలి రాఘవు
డాడ నిట్లు లంచు నంత మరల
పలికె నిట్లు లంచు పల్కు మహాప్రాజ్ఞు
డాతడు శరభంగు డతనితోడ: 134

"ఈ వనమున నెలవు కావించుకొని సుతీ
క్ష్ణుం డనియెడి పేర నుండు నొకడు
ధర్మవర్తనుండు ధర్మాత్ము డాతండు
నెగడజేయువాడు నీకు మేలు 135

తాపసున్ సుతీక్ష్ణు దరియంగ జను మీవు
కడు పవిత్రమైన యెడ నతం డ
రణ్యసీమలోన రమణీయమౌ నెడ
వాస మేరుపరచువాడు నీకు 136

అనుసరించి యరుగుమా రామ! మందాకి
నీ ప్రవాహమునకు నీ వెదురుగ
పూల తెప్ప లొప్ప పొలుపారు నది యది
దరియనేగు దచటు దాన నీవు 137

మార్గ మిదియె తండ్రి! మానవ శార్దూల!
యొక ముహూర్త మరయుచుండు నన్ను
నుజ్జగించుచుండ నాడలిని జీర్ణ ని
ర్మోక ముజ్జగించు భుజగమట్లు" 138

అంత లెస్సగా హుతాశను భూషించి
యాజ్యమునను హోమ మాచరించి
మంత్రవేత్త యైన మహిత తేజుడు శర
భంగు డపుడు జొచ్చె వహ్ని లోన 139

ఆ మహాత్ముని జుట్టును రోమములును
జీర్ణచర్మమ్ము నట్లె యస్థికలు రక్త
సహిత మాంసమ్ము దహియించె జ్వాలను డప్పు
డాత్మవంతుడు రాముండు నచ్చెరువడె
భ్రాతతోడను తా తన భార్యతోడ 140

పావ కోపమాన భాసమా నాకారు
డౌ కుమారు డయ్యె నాత డప్పు
డగ్నిహోత్ర శిఖల యందుండి లేచి వె
లుంగు లొలయుచు శరభంగు డుండె 141

అతడు దాటి యాహితాగ్నుల లోకముల్
మహితచిత్తులైన మౌనివరుల
లోకములును దేవలోకముల్ చని యెగ
బ్రాకె నపుడు బ్రహ్మలోకమునకు 142

పుణ్యకర్ము డా భూసుర పుంగవుండు
భవనమున సానుచరుడైన బ్రహ్మ గాంచె
నా మహీసురు గాంచి పితామహుండు
నెనసి మోదమ్ము స్వాగత మని వచించె 143

## (6 వ సర్గ)

చనినయంత దివికి శరభంగుడున్ జను
దెంచియున్న మౌని సంచయములు
కదియ జనియె నపుడు కాకుత్స్థ కుల జాతు
జ్వలిత తేజుడైన వాని రాము 144

### * ఋషులు రాముని శరణు వేడుట *

పరమ మునులు వైఖానస వాలఖిల్యు
లాది యైన సంప్రక్షాళు లట్టులే మ
రీచి పాశ్మకుట్టులును ధార్మికులు పర్ణ
బోజనులు పెక్కుమందియు మునిజనములు 145

అలఘు మునులు దంతోలూఖలులును గూడ
మరియు తక్కినవార లున్మజ్జకులును
గాత్రశయ్యు లశయ్యులు ఘన తపస్వు
లట్లె యభ్రావకాశకు లైనవారు 146

సలిల మాత్ర భోజనులు మునుల్ వాయు మా
త్రాశనులును నట్లె తక్కువారు
నాకసమ్మున నెల వమరుచుకొన్న వా
రట్లె నేల బండునట్టివారు 147

పరమ దాంతులైన వారలును వ్రతోప
వాసు లార్ద్రవస్త్రవాససులును
జప మొనర్చువారు సతతపో నిత్యులు
పంచ తాప యుక్తి వరలువారు 148

బ్రాహ్మ్య లక్ష్మి యుతులు పరమ యోగులు సుస
మాహితాత్ములైన యా తపస్వు
లెల్లవారు చేర నేగిరి శరభంగు
నాశ్రమమ్ములోన నపుడు రాము 149

చేరనరిగి యిట్లు చెప్పిరి ధర్మభృ
ద్వరునితోడ పరమ ధర్మవేత్త
యైన రాముతోడ నా ధర్మవిదులు స
మాహితాత్ములౌ మహర్షి వరులు: 150

"ఈ వసుధకు దీని కిక్ష్వాకుల కులమ్మ
నకు ప్రధానుడవును నాథుడవును
అగుదు వీవ యో మహారథాగ్రేసరా!
స్వర్గవాసులకును శక్రునట్లు 151

మూడు లోకములను గూడ ప్రసిద్ధుడ
వీవు కీర్తికల్మి విక్రమమున
తండ్రి మీదిభక్తి ధర్మమ్ము సత్యమ్మ
నెగడు పుష్కలముగ నీ యెడలను 152

ధర్మవత్సలుండు ధర్మజ్ఞుడున్ మహా
త్ముండు నైన నిన్ను బొందియుండి
యాడుచుంటిమి పతి! యర్థిత్వమున మమ్మ
నందులకు క్షమింపనగును నీవు 153

చూరగొనుచునుండి సుంక మారవ వంతు
పుత్రునట్లు కాచి ప్రోవకున్న
మానవేశ్వరుండు మహనీయమౌ నధ
ర్మమ్ము నొందువాడు సుమ్ము తండ్రి! 154

ప్రజల నెల్లవారి స్వప్రాణములవోలె
పూన్కి-మెయిని ప్రాణములకు మించి
కూర్చునట్టి కన్న కొడుకుల యట్లుగా
శ్రద్ధమీర నెపుడు సల్పి రక్ష 155

పడయువాడు రామ! బహు కాలముల దాక
తనరుచుండు శాశ్వతంపు కీర్తి
బ్రహ్మలోక మంత పడసి యచ్చోట వా
డందువాడు పూజ లతిశయముగ 156

పరమ ధర్మ మెద్ది నెరపుచుండునొ మూల
ఫలములన్ భుజించు వాడు మౌని
యందులోన నాలుగవ పాలు రాజున
కగును ప్రజల ధర్మ మరసి కావ 157

అట్టి బ్రాహ్మణ భూయిష్ఠ మైన యట్టి
కడు వెలుచని వానప్రస్థ గణ మిదియును
నాథు డీవైన రామ! యనాధరీతి
బాధ లందెడు దైత్యులవలన మిగుల 158

పద కనుంగొనగదె భావితాత్మకులైన
మునుల ఘోరదైత్యజనుల చేత
పలు తెరగుల పడిన వారల పల్వుర
దేహములను విపిన దేశమందు 159

పంప యొడ్డు వెంట నసియించు వారి మం
దాకినీ తటమున దనరు వారి
చిత్రకూట గిరిని చెలువారు వారిని
బట్టి బిట్టు బాధ పెట్టువారు 160

ఓర్చుకొనుచు నిట్టు లుండంగలేము త
పస్విజనుల బట్టి పరవుచున్న
ఘోరమైన విప్రకారమ్ము రక్కసుల్
భయదకర్ము లైనవార లడవి 161

దాన నిను శరణ్యు దరియంగ వచ్చి యు
న్నార మిప్పుడు శరణమ్ము గోరి
కాచి ప్రోవు మమ్ము కాకుత్థ్సరామ! య
సురులచేత జచ్చుచున్నవారి 162

దిక్కు మాకు నీవు దక్క వేరొక్కడు
దొరకకున్నవాడు ధరణి వీర!
మమ్ము నెల్లవారి మనువుము రక్షించి
రాక్షసాళినుండి రాజపుత్ర!" 163

ఇదియు నెల్ల నాలకించి కాకుత్థ్సుండు
తాపసుల్ తపస్వు లీ పగిదిని
మొఱవెట్ట ధర్మమూర్తి వచించె ని
ట్లంచు నా తపస్వు లందరకును: 164

"తగదు నన్నిట్లు పల్కగా తాపసులకు
నాజ్ఞవెట్టంగనగు నన్ను నడవి కేను
రావలసె కేవ లాత్మకార్యమును గూర్చి
రక్కసుల కీడు మీకు తొలంగజేయ 165

తండ్రి పనుపు నెరప దలకొన్నవాడనై
యేను జొచ్చియుంటి నీ వనమ్ము
దైవగతిని బట్టి తమ యర్థసిద్ధికై
యేగుదెంచియుంటి నిటకు నేను
కనుక నట్టి నాదు వనవాస మిది సమ
కూర్పగల్గు నింక గొప్ప ఫలము 166

తాపసోత్తములకు దాయల నసురుల
కలన నుక్కడంప జెలగు నిచ్చ
కనుగొనం గలారు మునులు తపోధనుల్
భ్రాతృ సహితు నాదు పౌరుషమ్ము" 167

అట్టు లా తపోధనులకు నభయ మిచ్చి
బుద్ధి ధర్మమ్మునన్ నిల్పి పూజ్య చరితు
డరిగెను సుతీక్ష్ణు జేర వీరాగ్రసరుడు
సత్తపోధన లక్ష్మణ సహితు డగుచు 168

## (7 వ సర్గ)

అరిగె నా సుతీక్ష్ణు నాశ్రమవాటికి
నంత రాముడున్ పరంతపుండు
భ్రాత వెంట రాగ సీతతో గెడగూడి
ద్విజ వరేణ్యులు తమవెంట రాగ 169

ఆత డేగి దూరమౌ దారి వెంబడి
యుదకపూర్ణము లగు నదుల దాటి
కాంచె విపులమైన ఘన శైలమును మహా
మేఘ మట్టు లుబ్బుమీరు దాని 170

ఏగి చొచ్చి రంత నిక్ష్వాకువర్యు లా
రాఘవులును సీత రాగ వెంట
వివిధ పాదప సమభివ్యాప్తమై వెలు
గారుచున్న ఘోర కాననమున 171

ఘోర వనమున బహు కుసుమ ఫల ద్రుమ
సంకులమున జొచ్చి చనెడు వాడు
కనుల నాశ్రమమ్ము గాంచె వల్కల జాల
మెసగ పొలుచుదాని నేకతమున 172

### * సుతీక్ష్ణాశ్రమ గమనము *

అచట గూరుచున్న యతని మకిలి యంట
దట్టుకొన్న జడలు దాల్చినతని
విపుల తపము పేర్మి వృద్ధున్ సుతీక్ష్ణు నీ
క్షించి రాము డిట్లు చెప్పె భక్తి: 173

"స్వామి! యవధరింపు రాముడ నే నరు
దెంచినాడ తమ్ము గాంచ గోరి
ఈరు నన్ను పల్కరింపుడీ ధర్మజ్ఞ!
సత్యవిక్రమాఢ్య! సంయమీంద్ర!" 174

రాము ధర్మభృద్వరాగ్రేసరున్ వీరు
నాత డంత కన్నులార గాంచి
బాహు యుగ్మకమున పరిరంభణము సేసి
పలికె నిట్టులంచు వానితోడ: 175

"స్వాగతమ్ము నీకు నగుగాదె వీరుడా!
రామ! ధర్మభృద్వరాగ్రగణ్య!
ఈవు వచ్చియుంట నీ యాశ్రమ మ్మిది
క్రాలెడిన్ సనాథ కరణి నిపుడు 176

ఎదురు చూచుచుండి యే మహాయశునకై
నీకునై యనిమిష లోకమునకు
నెనసిపోక యుంటి నిటనుండి వీరుడా!
మేదినీ తలమున మేను విడిచి 177

చిత్రకూటమునకు చేరుట రాజ్య వి
భ్రష్టు డౌట విన్నవాడ నెల్ల
నేగుదెంచి యుండె నిచటికి కాకుత్థ్స!
వాసవుండు దేవ వల్లభుండు 178

చేరవచ్చి నన్ను చెప్పె మహాదేవు
డమరలోకనాథు డమరవర్యు
డెల్ల లోకముల జయించినాడను నాదు
పరమపుణ్య కర్మ వలన నంచు 179

తపము పేర్మి నేను దక్కించుకొన్న ది
వ్యర్షి జుష్టమైన యా జగముల
భార్యతో సుమిత్రపట్టితో మత్ప్రసా
దమ్మున విహరింపు రమ్ము నీవు" 180

ఉగ్రతపము పేర్మి నొప్పారు నా సత్య
వాదియౌ మహర్షి వర్యుతోడ
బదులు పల్కె నాత్మవంతుండు రాము డి
ట్లభవుతోడ కాశ్యపర్షి యట్లు: 181

"సర్వలోకములును సంయమి మూర్ధన్య!
సంగ్రహింతు నేనె స్వయముగాగ
నిచట కానలోన నేర్పరచుకొన నా
వాస మిచ్ఛగించువాడ నేను 182

నీవు నెల్ల యెడల నేర్పరి వనియును
సర్వ భూత హిత నిషక్తుడ వని
యెరుగ జెప్పినాడు శరభంగ ముని మహా
త్ముండు గౌతమాన్వయుండు మున్ను" 183

ఈ విధమ్ముగా వచింపగా రాముండు
వృద్ధమౌని లోక విశ్రుతుండు
పల్కె మధురమైన వాక్యమ్ము లిట్లని
యలఘు హర్ష సంప్లుతాత్ము డగుచు; 184

"అలఘు గుణ సమేత మాశ్రమ మిద్దియే
సంయమీంద్ర సంఘ సంచరితము
మధుర మూల ఫల సమన్వితమున్ సదా
ఇచట హాయిగా వసింపు రామ! 185

విపుల కీర్తి మృగచయముల్ వెరపెరుగక
వచ్చి యీ యాశ్రమమ్మున పర్యటించి
మరలి చను లోభ మొదవించి యెరుగు దోష
ముండ దొండిట మృగదోష మొండె దక్క" 186

ఆ మహర్షివచన మయ్యది యాలించి
నంతలోన లక్ష్మణాగ్రజుండు
శరముతోడి ధనువు సారించి ధీరు డి
ట్లంచు పల్కె నా మృగౌఘములను
హతమొనర్తును సుమహాభాగ! మెరుగుల
జిమ్ము వాడి వాతి యమ్ముతోడ 187

దాన నవమతిగను తలపంగనగు నీవు
నంతకన్న కష్ట మగు నికేది?
ఏను పెద్దకాల మీ యాశ్రమమ్మున
నునికి పొసగకుండు నని తలంతు" 188

పల్కె యిట్టు లంచు వరదుని కతనికి
సంజె గొల్వ వెడలి చనియె రాము
డంజలించి యాత డపరసంధ్యకు నంత
వాస మచట నేరుపరచుకొనియె
నా సుతీక్ష్ణు రమ్యమౌ నాశ్రమమ్మున
సీతతో సుమిత్రసూతి తోడ 189

అంతట సుతీక్ష్ణుడు మహాత్ము డరుగ సంజె
యరసి రేయి తాపసభోజ్యమై శుభమ్మ
నైన యన్నము స్వయము నరర్షభుండు
మిగుల సత్కృతు లొనరించి మెసవ నొసగె 190

(8 వ సర్గ)

అట్లు పూజలంది యా సుతీక్ష్ణుని చేత
లక్ష్మణాన్వితుండు రాఘవుండు
నచట గడపివుచ్చి యా రేయి పదపడి
తెల్లవారు వేళ తెలివి నొందె 191

జనక తనయతోడ సహితము రాముండు
వేళ గడవకుండ మేలుకాంచి
స్నాన మాచరించె చల్లనై కలువల
వలపుల వెదజల్లు జలములందు 192

పిదప నగ్నిహోత్రు విబుధుల రామ ల
క్ష్మణులు సీతతోడ కాల్యముననె
శాస్త్ర దృష్టసరణి సంపూజన మొనర్చి
మౌని జన నివాస కాననమున 193

ప్రభవ మొందుచున్న భాస్కరు గనుగొని
విగతకల్మష లయి వెలయువారు
చేరజని సుతీక్ష్ణు చెంతకు మధురమౌ
పలుకు లిట్టు లంచు పలికి రపుడు: 194

"స్వామి! సుఖముమీర వసియించి యుంటిమి
పూజ్యుడైన నీదు పూజలంది
ఏము సెలవు గొందు మిక పోయి వత్తుము
ఋషులు మమ్ము తొందరించువారు 195

వేగిరం పడెదము వీక్షింపగా మేము
పుణ్యశీలురైన మునులు దండ
కా విపిన నివాసులౌ వార లుండెడు
నాశ్రమ సముదాయ మదియు నెల్ల 196

వేడువారము నిను వీడ్కొన మము ముని
వరులు వీర లెల్లవారి ధర్మ
నిత్యులైన వారి నిశ్శిఖాగ్నుల యట్లు
తపము పేర్మి దాంతి దనరు వారి 197

పెడ తెరవున వచ్చి పడిన సిరు ల్గొన్న
వంశవర్జితు డగు వాని వోలె
నెండ సైపరాకయుండునట్టులు రవి
పైకి పెచ్చుపెరిగి రాకమున్నె 198

ఏము చనగ నిచ్చగింతు" మంచని పల్కి
సంయమీంద్ర చంద్రు చరణములకు
వందనమ్ము రాఘవాన్వయు డొనరించె
సీతతో సుమిత్ర సూతి తోడ 199

చరణయుగ్మకమ్ము సంస్పృశించెడివారి
వా రిరువుర లేవబట్టి మౌని
పుంగవుండు గాటముగ నొత్తి కౌగిట
చెల్మి యుట్టిపడగ చెప్పె నిట్లు: 200

"మంగళాస్పద మగు మార్గమ్మునన్ సుమి
త్రాత్మజాతు తోడ నరుగు రామ!
నీడ వోలె నిన్ను వీడక వెనుకొని
యేగుదెంచు సీత యీమె తోడ 201

కాంచు మీవు దండకారణ్య వాసులై
తపము పేర్మి భావితాత్ములైన
యీ తపస్వివర్యు లెల్లరు వసియించు
మహిత రమ్య మాశ్రమపద మదియు 202

ప్రాజ్యమైన యట్టి ఫల మూల నిచయముల్
విరగ బూచి యున్న విపినములును
మేలిజాతి వైన మృగయూథ సంతతుల్
శాంత వివిధ విహగ జాతములును 203

సంప్రపుల్ల పంకజాత షండములతో
సుప్రసన్న సలిల సురుచిర మయి
క్రమ్ముకొనగ మిగుల కారండవమ్ములు
పొలుచు సరసుల చెరువులను గూడ 204

చూచువాడ వీవు చూడ చక్కని గిరి
ప్రస్రవణము లవియు రమ్యమౌ న
రణ్యములు మయూర రావ యుక్తమ్ములు
నరుగు వత్స! నీవు నరుగుమా సు
మిత్రసూతి! తండ్రి! మీరు నా యాశ్రమ
వాటి కరుగుదేర వలయు మరల" 205

ఇట్టు లనగ నాలకించి కాకుత్థ్సుడు
'నట్లె' యంచు లక్షణాన్వితు డయి
తాపసాగ్రణికి ప్రదక్షిణ మొనరించి
బయలు దేరగా నుపక్రమించె 206

అంత జనకతనయ యాయత లోచన
యమ్ము పొదులు కార్ముకమ్ములు శుభ
తరములైన వన్నదమ్ముల కిచ్చెను
విమల ఖడ్గములను పిదప నిచ్చె 207

కడు శుభమ్ములైన కవ దొనల్ కట్టుక
చాపములను బూని సస్వనముల
నాశ్రమమ్ము వీడి యా రామ లక్ష్మణు
లిర్వు రపుడు వెడలి రేగుట కయి 208

శ్రీయుతులు రూప సంపద జెలగు వారు
స్వీయ తేజమ్ముచే కడు వెల్గు వారు
విండ్లు పూనిన రాఘవ వీరవరులు
బయలు వెడలిరి సీత వెంబడిని రాగ 209

## (9 వ సర్గ)

అట్లుగా సుతీక్ష్ణు ననుమతి గొని బయ
ల్వెడలి నాతని రఘువీరు గాంచి
ఇట్టు లని వచించె హృద్యమ్ము స్నిగ్ధమౌ
పల్కు లెసగ సీత భర్తతోడ: 210

### * రాక్షస సంహార దీక్షకు సీత యసమ్మతి *

"ఇట్టి ధర్మము మహనీయమైనది కడు
సూక్ష్మమైనవిధిని చొప్పడెడును
సాధ్య మిదియు కామజ మ్మైన వ్యసనమ్ము
నుండి పాయ దొలగి యున్నతనికి 211

ఇచట కామజ వ్యసనము లివియు మూడె
కల్ల పల్కుట యది మేలు కడమ రెండు
నంతకున్ మిన్నలు పరదా రాభిగమన
మలుక గొనుటయు వైర మన్నదియె లేక 212

ఈవు కల్ల పల్కుటే లేదు రాఘవా!
ఇంకమీద నుండ దెన్నడైన
పాడి రూపరంగ పరుల పడంతుల
నభిలషించుచుండు టన్నదేడ? 213

అదియు నీకు లేదు గద మానవేంద్ర! యె
ప్పుడును గాని లేదు మునుపు గూడ
నెడదనైన నట్టు లెయ్యెడలను రామ!
యిదియు నుండ కుండనే గదయ్య 214

స్వీయదార నిరతుడై యుండు నృప సుతా!
ఈవు నైన గాని యెల్లపుడును
సత్యసంధుడవును సద్ధర్మ నిష్ఠుడ
వీవు పితృ నియోగ మెపు డొనర్తు? 215

భాగ్యశాలి! మహిత భాగధేయా! సత్య
సంధ! లక్ష్మణాగ్రజాత! రామ!
నిలిచె సత్య మదియు నీ యెడ ధర్మమ్ము
నిలిచియుండు నెల్ల నీ యెడలను 216

అవియు నెల్లయవి మహాబాహు! విజితేంద్రి
యులకు దాల్చియుండ నలవి యగును
నే నెరింగియున్న దాన నీ వశ్యేంద్రి
యత్వము శుభదర్శనా! యదియును 217

ఇదియె నూవె మూడవది యగు రౌద్రమ్ము
పగయె లేక పరుల ప్రాణములను
హింస సేయు టన్న దిదియె మోహమ్మున
మీద వచ్చి పడియె గాదె నీకు 218

ప్రతిన సేసి యున్న వాడవు దండకా
వన నివాసులైన మునుల కీవు
వారి రక్ష కొరకు వధియింపగా రణ
రంగమందు దుష్టరాక్షసులను 219

ఇదియె కారణముగ నీవును దండకా
వన మనంగ పేరు వడిన యెడకు
బయలు దేరినావు భ్రాతతో గూడను
వీర! బాణ చాప ధారి వగుచు 220

అట్లు బయలుదేరి నాతని నిను గాంచి
కలగె నా మనమ్ము నలమటమున
నీ నడత తలంచుకోనయి నిశ్శ్రేయ
మౌ హితమ్ము జరుగనౌ నటంచు 221

చపి గొలుపదు నాకు చనుట యో వీరుడా!
దండకా వనమున నుండుట కయి
కారణము వివరముగా పల్కు దండుకు
నే వచించుచుండ నీవు వినుము 222

బాణ చాప పాణివై నీవు తమ్ముని
గూడి యడవిని తిరుగాడుచుండ
వన నివాసు లెల్లవారల గాంచి వె
చ్చింప వలయు నొక్కొ యంప గముల 223

క్షత్రియాన్వయులకు కార్ముక మట్టులే
హవ్యవహున కింధనాళి యైన
చెంత నున్న యెడల నంతకు నంత తే
జో బలమ్ము పెంపు చొప్పడియెడు 224

రత మృగ ద్విజమగు రమ్య పుణ్యారణ్య
భూమి నొక్క యెడల మున్నొకండు
సత్య వచనుడు శుచి సంయమీంద్రుడు మహా
బాహు! తపము నూని ప్రబలియుండె 225

వా డొనర్చు తపము పాడుసేయగ శచీ
పతి పురందరుండు వాసవుండు
వాలు కేల దాల్చి భటుని రూపము దాల్చి
యతని యాశ్రమమున కరుగుదెంచె 226

పుణ్యమైన తపము పూని యా యాశ్రమ
వాటి నిల్చియున్న వాని కిచ్చె
న్యాసవిధి విధమ్మునన్ నిశాతమ్మును
కడు మహోత్తమమ్ము ఖడ్గ మదియు 227

అతడు శస్త్ర మదియు నందు కొన్నంతట
న్యాస రక్షణమున ధ్యాస నూని
దాని తిప్పుచుండె తన వెంట పని తన
మీది నమ్మకమ్ము నాదుకొనుచు 228

ఎచటికైన గాని యేగిన దుంపలు
పండ్లు గొంచు వచ్చు పనికి వాడు
చనడు ఖడ్గ మదియు తన వెంట లేకుండ
న్యాస రక్షణమున ధ్యాస నూని 229

సంతతమ్ము నట్లు శస్త్రమ్ము పూని కా
పాడుచుండి తాపసాగ్రణియును
క్రమముగా స్వబుద్ధి కనలున నూల్కొల్పె
విడిచి పుచ్చి తపము నెడల తగులు 230

అంత వాడు రౌద్రమం దభిరతి నూని
కడు మదించి ధర్మకర్శితు డయి
సంతతమ్ము శస్త్ర సహవాస మది పూని
యరిగె మునివరుండు నరకమునకు 231

ఇట్టు లిది మున్ను నడచిన దెనయ శస్త్ర
మగ్ని సంయోగ మట్టులే యగును హేతు
వాయుధము తోడి సంయోగ మైన నంద్రు
చెల్మియును నీదు మెప్పును కల్మి గురుతు
చేయుదానను బోధనసేయ నేను 232

ఈవు విల్లు పూని యెట్లైన దండకా
రణ్య వాసులైన రాక్షసులను
పగయె లేకయుండ వధము సేయుటకునై
తలపు నూనియుండ దగదు సుమ్ము
లోకములను తప్పు లేకుండగనె వీర!
ఈవు చంప నిచ్చగింప నేను 233

కాననమున నియతమైన చిత్తమ్మున
నున్న క్షత్రియాన్వయులకు వీర
వరుల కార్తులైనవారి రక్ష యొనర్చు
వరకె వింటితోడ పని వడు గద 234

ఆయుధ మ్మదేడ? అడవి యయ్యది యేడ?
క్షాత్ర మేడ? తపము సల్పు టేడ?
యొండొకటికి పొసగకుండును పూజింప
దగును మనకు దేశధర్మ మదియె 235

కాన నార్యపుత్ర! కలుషితమౌ బుద్ధి
శస్త్రసేవ వలన సంభవించు
మరలి చనిన పిదప పురికి నయోధ్యకు
క్షత్రధర్మ మూని సలుపవచ్చు 236

మాసిపోని ప్రీతి మా యత్త మామల
కెడదలందు సంభవించును గద
పుడమి రాజ్య మదియు విడనాడి నిరతిమై
మౌనివృత్తి నుందువేని నీవు 237

ధర్మమున నొదవు నర్థము
ధర్మమ్మున ప్రభవమొందు తత సౌఖ్యమ్మున్
ధర్మమున దొరయు సర్వము
ధర్మమె సారమ్ముగాదె ధరణికి నెల్లన్ 238

వ్రత నియమము లూని వాన వానను తన్ను
కార్శ్య మొందునట్లు కడగి చేసి
యందు వారు నిపుణులౌ వారు ధర్మమ్ము
సుఖము బడయగాదు సుఖము వలన 239

సౌమ్య! శుచిమతి వయి సంతతమును తపో
వనమునందు ధర్మమును నెరపుము
సర్వ మెరుగు నీవు చక్క నిక్కమ్ముగా
మూడు లోకములను గూడనైన 240

స్త్రీ చపల బుద్ధి నిది నేను చెప్పియుంటి
నీకు ధర్మమ్ము వచియింపనేర్చు నెవ్వ?
డెనసి యనుజన్మ మతి విచారించి నీకు
చవిగొలుపు నట్లొనర్పుము సత్వరమ్మ" 241

## (10 వ సర్గ)

భర్తృభక్తయైన వైదేహపుత్రి యీ
యాడినట్టి పల్కు లాలకించి
ధర్మ సంస్థితుండు దాశరథియు నంత
మరలి బదులు పల్కె మైథిలికిని: 242

### * రాముడు తన ప్రతిన విడువనని చెప్పుట *

"హితము పల్కియుంటి వీవు దేవీ! తగి
నట్టి పల్కు చెల్మి యుట్టిపడగ
నచ్చుపడగ నీదు నాభిజాత్యమ్మను
జనకతనయ! విదిత సర్వధర్మ! 243

కాని చెప్పుచుంటి నేను నో దేవి! నీ
కీవె పల్కియున్న వీ పలుకులు
చాప మూనువారు క్షత్రియ కులజాతు
లార్తరవము కలుగనట్టు లంచు 244

నన్ను శరణు జొచ్చినారు సీతా! శర
ణార్థు లెల్ల తామె యరుగుదెంచి
ఆర్తులైన దండకారణ్య వాసులు
తాపసులును సంశిత వ్రతులును 245

నిలిచియుండి ధర్మ నిరతులై వనమున
పండ్లు దుంపలు తినువార లగుచు
పడయరైరి సుఖము భయమంది కడు క్రూర
కర్ములైన దైత్యఖలుల వలన 246

వివిధ నియమ నిరతి విపినభూముల నివ
సించుచున్న నరుల నెల్ల వేళ
భక్షణ మ్మొనర్చువారు భయంకరుల్
మనుజ మాంసభుజులు దనుజ జనులు 247

అట్లు మునుల దండకారణ్య వాసుల
బ్రాహ్మణోత్తములను భక్షణమ్మ
సేయ వారు 'మమ్ము చేకొని కరుణతో
బ్రోవు' మంచు నాకు మొర్ర యిడిరి 248

పలుకు వారి నోట వెలువడినది యిట్టు
లంచు దాని నేను నాలకించి
వారి కాచరించి పాదాభివందన
మిట్టులంచు నే వచించినాడ: 249

'దయ గనుంగొనంగ దగు నన్ను మీరలు
సిగ్గుపడుచు నుంటి నగ్గలముగ
చేరనరుగదగినవా రిట్టి విప్రులు
నన్ను జేరవచ్చి యున్న కతన 250

ఏమి చేయువాడ నే'నని పల్కితి
తద్ద్విజాత సన్నిధాన మందు
వార లప్పు డెల్లవారును గెడగూడి
పల్కి రిట్టులంచు పల్కు లెసగ 251

'కామరూపు లైన కడు పెక్కు రసురులు
దండకావనమున నుండు మమ్ము
కస్తిబెట్టు వారు కడు నీవె శ్రీరామ!
రక్ష యగుదు మా కరణ్యమందు 252

అనఘ! దాపురించి హవన కాలమ్ముల
పర్వ కాలములను వారు మాంస
భుక్కు లైనవారు రక్కసు లెదురరా
నట్టివారు భంగపెట్టువారు 253

దైత్యజనులచేత ధర్షితులైన తా
పస వతంసులకు తపస్వులకును
దిక్కు వెదకికొనుచు తిరుగాడువారికి
మాకు నీవె పరమమైన దిక్కు 254

చక్కు రాక్షసులను జక్కాడగ తపః ప్ర
భావ గరిమ జాలువార మేము
చిర సమార్జితమ్ము స్వీయతపమ్మును
త్రుంచివైవ నిచ్చగించ మేము 255

తపము దుశ్చరమ్మె యెపుడును బహు విఘ్న
వంత మదియు రాఘవాన్వవాయ!
అందువలన శాప మన్నదే యొసగము
తినుచునున్న గాని దనుజులు మము 256

అందువలన దండకారణ్య వాసులౌ
క్రూరు లసురు లిడుమ గుడుపుచున్న
మమ్ము ట్రోవు మీవు తమ్మునితో గూడి
స్వామి వీవె మాకు వనములోన' 257

ఈ వచనము లాలకించి యేనును పరి
పాలనమ్ము సేయ వారి నెల్ల
తాపసోత్తములను దండకా వనమున
జనకతనయ! ప్రతిన సల్పినాడ 258

ప్రతిన సల్పి నేను బ్రదికి యుండంగనే
తప్పి పుచ్చుటకును తాపసుల కొ
సంగి యున్న ప్రతిన చాలకుండును నాకు
సత్య మిష్టము గద సంతతమ్ము 259

జీవితమ్ము నైన నే విడనాడుదు
సీత! నిను సుమిత్ర సూతితోడ
నుడివియున్న ప్రతిన విడువ విశేషించి
బ్రాహ్మణుల కొసగిన ప్రతిన యైన 260

చెప్పకున్ననైన తప్పక యప్పని
నేను జనకతనయ! నెరప నగును
పరమ మునివరేణ్య పరిపాలన మ్మది
మాట యిచ్చియుంట మరి యికేమి? 261

నాకు స్నేహ ముంట నీకును సౌహార్ద
ముంట నీవు నిట్టు లంటి వనఘ!
జనకతనయ! నేను సంతుష్టుడైతిని
కాని వాని కెవరు గరపరు గద 262

అగును గాదె సదృశ మనురూప మియ్యది
నీ కులమ్ము నకును నీకు గూడ
సతము నీవు నాకు సహధర్మ చరి వౌదు
ప్రాణములకు మిన్న వౌదు వీవు" 263

అంచు నిట్టులు పల్కు మహాత్ము డాడి
ప్రియకు సీతకు మైధిల విభుని సుతకు
అక్ష్మణునితోడ కోదండరాము డంత
చనియె రమణీయమౌ తపోవనముల బడి 264

## (11 వ సర్గ)

అగ్రభాగమందు నరిగెను రాముండు
మధ్య సీత యా సుమధ్యమయును
వెనుక తట్టుగాగ విలు కేల దాలిచి
చనియె లక్ష్మణుండు ననుసరించి 265

అరసికొనుచు వార లిరువురు వివిధాద్రి
సానువులును నిబిడ కాననములు
రమ్యమైన పలు తెరంగు వాహినులును
చనిరి సీత వెంట జనుచు నుండ 266

చక్రవాకములును సారసములు నదీ
పులిన చారులైన పులుగు గములు
సరసి జాన్వితములు సరసులు జలజాత
విహగ జాల సమభివేష్టితములు 267

గుంపు కట్టియున్న కొమరారు లేళ్ళను
క్రొవ్వుమీరియున్న కొమ్ములున్న
యడవి దున్నపోతు లడవి పందులును దం
తావళములు చెట్ట దాయ లవియు 268

అరిగి వారు దూరమౌ దారి వెంబడి
ప్రొద్దు మింట వాలిపోవుచుండ
గాంచి రపుడు కూడి కడు రమ్యమౌ తటా
కమ్ము యోజనాయతమ్ము నచట 269

పద్మ పుష్కర నిబిడమై పరగు దాని
మత్త గజయూథ భూషిత మైనదాని
జలచరములైన కాదంబ సారస కల
హంసముల తోడ సంకుల మైనదాని 270

స్వచ్ఛ రమ్య సలిల సంపూర్ణయై కడు
వెలయుచున్న కొలన వినగ వచ్చె
వారి కపుడు గీతవాదిత్ర నిర్ఘోష
కాని యెవరు గాని కానరారు 271

అతిశయింప కుతుక మంతట రాముండు
లక్ష్మణుడు మహాబలాన్వితుడును
ధర్మభృతు డనంగ దనరారు వానిని
మునివరేణ్యు నడుగ మొదలుకొనిరి: 272

"ఆలకించి దీని నత్యద్భుతమ్మైన
దాని మాకు నెల్ల తాపసేంద్ర!
మహిత కౌతుకమ్ము మది నుద్భవ మ్మొందె
నిదియు నేమొ చక్క నెరుగ జెప్పు
మిదియు చెప్పదగిన దేని విప్రా! ప్రభో!
కడు రహస్య మిదియు కాదయేని" 273

## * మాండకర్ణి కథ *

రాఘవుండు నిట్టు లని పల్క నప్పుడు
ధర్మచిత్తు డైన తాపసుండు
సరసు సంభవమ్ము సంపూర్ణముగ నెల్ల
మొదటినుండి చెప్ప మొదలుపెట్టె: 274

"పరగు నీ సరస్సు 'పంచాప్సర' మ్మను
పేర శాశ్వతముగ వెలయుచుండు
తపము పేర్మి నిర్మిత మ్మొనర్చెను రామ!
'మాండకర్ణి' యనెడు మౌనివరుడు 275

అతడు తప మొనర్చె నత్యంత తీవ్రమ్ము
మహిత మునివరుండు మాండకర్ణి
వాయుభక్షకుండు వార్నిలయుండు నై
పదియు వేల యేండ్ల పాటు గాగ 276

అంత మిక్కుటంపు టలజడి నొందుచు
నగ్ని మొదలుగాగ నమరులెల్ల
పల్కి రిట్టులంచు పల్కులు వారెల్ల
రొండొరువుల గూడియున్నవారు 277

'మునివరుం డితండు మనలోన నెవరిదో
పదవి నొంద గోరి ప్రార్థనమ్ము
సల్పువా' డటంచు సంవిగ్నమానసు
లయ్యె రెల్లరు త్రిదివౌకసులును 278

అచట వాని తపము నారడిబుచ్చంగ
బంచి రపుడు త్రిదశ వర్యు లెల్ల
మెరుపు లట్లు మెలగు మేని కాంతుల వారి
నప్సరః ప్రధాన లైదుగురను 279

అంత వార లెల్ల రా యచ్చరల్ ముందు
వెనుక లరసియున్న మునివరేణ్యు
మరుని బారి బడగ మలపిరి మెలపున
నమరకార్య సిద్ధి నందుకొరకు 280

అప్సరసలు వార లైదుగురును గూడ
నా మునీంద్రు పత్ను లై నిలిచిరి
వారికొరకు గృహము వార్ని గూఢమ్ముగా
సరసులోన దీన విరచితమయె 281

అట్లు సుఖము మీర నచ్చర లేవురు
నచట వాసమున్న యట్టివారు
తపము బలిమి వలన తారుణ్య మొందిన
మునిని గూడి కేళి మున్గువారు 282

అట్లు కేళిసల్పు నవ్వారి వాదిత్ర
నాద మియ్యదియె వినంగవచ్చు
లలిత భూషణాభిరవ సమున్మిశ్రమై
కడు మనోహరమ్ము గాన రవము" 283

'అబ్బుర' మ్మటంచు నా భావితాత్ముడు
పల్కుచున్న యట్టి పల్కు లవియు
వీనులార రాఘవేశ్వరు డాలించె
ప్రథిత కీర్తిశాలి భ్రాత తోడ 284

*** ఋష్యాశ్రమ మండల వాసము ***

పల్కుచుండ నిట్లు పరికించె నాశ్రమ
మండలమ్ము నొప్పుచుండుదాని
నార చీర సమితి యారవేయగ బ్రాహ్మ్య
లక్ష్మి నలుగడల వెలార్చు దాని 285

జనక తనయతోడ సౌమిత్రితో ప్రవే
శించి రాఘవుండు నిద్దయశుడు
నతడు వాసముండె నఖిల మహర్షి వ
ర్యాభిపూజ్యమాను డగుచు నచట 286

అట్లు శ్రీయుత మగు నాశ్రమ మండల
మందు దాన సౌఖ్యమారగా మ
హర్షి పూజ్యమాను డగుచు నా కాకుత్థ్స
వంశ సంభవుండు వాస ముండి 287

ఆ తపస్వి వరుల యాశ్రమముల కెల్ల
నా మహాస్త్రవేత్త యరిగె మరల
మున్ను తాను వాస మున్నట్టి యెడలకే
మరల నింక నొక్కమారు చనియె 288

నిలిచి యొక్కెడ పది నెలలు సుమారు ని
కొక్క యెడల నుండె నొక్క యేడు
నెలలు నాలు గొక్క నెలవున నైదారు
నెలలు నింక తక్కు నెలవులందు 289

మరియు నొక్క యెడల మాసమ్ము పైబడి
యొక్క మాస మర్ధ మొక్క యెడల
నెలలు మూడు నొకట నెల లెన్మిది యొకంట
నుండె వసతి రాఘవుడు సుఖముగ 290

అట్లు మౌనివరుల యాశ్రమముల యందు
పరమ సుఖముమై నివాస మున్న
యతని కానుకూల్య మార కేళిని దేలు
వాని కరిగెను పది వత్సరములు 291

దశరథాత్మజుండు ధర్మజ్ఞు డాతండు
సీతతోడ మరల చేర వచ్చె
నా సుతీక్ష్ణ మౌని యాశ్రమమునకు శ్రీ
యుతుడు చుట్టి వచ్చి యున్నవాడు 292

ఆత డాశ్రమమ్ము నద్దాని జేరంగ
నరిగి మౌని జనుల యర్చ లంది
యచట కొంత కాల మా యరిందముడు రా
ముండు తాను వాస ముండె నపుడు 293

అంత నాశ్రమస్థు డతడు సుతీక్ష్ణుని
ముని వరేణ్యు నతని వినయ మార
గదిసి కూరుచుండి కాకుత్స్థు డొక్కప్పు
డతని తోడ నిట్టు లని వచించె: 294

"వనములోన దీన భగవానుడౌ నగ
స్త్యుండు మహిత తాపసోత్తముండు
నెలవుకొనె ననంగ నిత్యమ్ము వినుచుంటి
పలుకు లాడుచుండ వారు వీరు 295

ఎరుగకున్న వాడ నెచటనో అయ్యెడ
విపులమైన దగుట విపిన మిదియు
బుద్ధిశాలి యైన ముని వరేణ్యుని పవి
త్రాశ్రమ మ్మిది యెట నమరి యుండు? 296

* రాము డగస్త్యాశ్రమమునకు పోగోరుట *

తమ ప్రసాదముననుం తమ్మునితో గూడి
జనక ధరణినాథ తనయ తోడ
నే నగస్త్యు జేర నేగెడు వాడను
ముని వరేణ్యునకును మ్రొక్కు లిడగ 297

స్వయము గాగ నేను సంయమీంద్రునకును
సేవ లాచరింప చేకురునొకొ?
ఇ మ్మహా మనోరథమ్ము సంతతమును
హృదయమందు నాకు మెదలుచుండు" 298

అంచు ధర్మచిత్తు డా రాముడు వచింప
నా మునీంద్రు డదియు నాలకించి
దశర థాత్మజునకు దద్దయు ప్రీతి సు
తీక్ష్ణు డిట్లు బదులు తెలియ బలికె: 299

"ఏను గూడ నియ్యదే చెప్ప నుంటిని
'ఈ వగస్త్యు జేర నేగుమయ్య
జనక తనయ తోడ సౌమిత్రితో గూడి'
యంచు నీకు రాఘవాత్మజాత! 300

భాగ్య వశత నిపుడు స్వయముగ నాతోడ
పలికి తీవె యిట్టి పని గురించి
గాఢ తాపసుం డగస్త్యు డెచ్చోటనో
వత్స! నీకు తెలియ బలుకువాడ 301

ఆశ్రమమ్ము దీని కట్లుగా నొక నాలు
గామడలకు పైన నరిగినంత
దక్షిణమున శ్రీయుత మ్మగస్త్య భ్రాత
యాశ్రమమ్ము మహితమై చెలంగు 302

మిట్టమీది యడవి పట్టున పిప్పలీ
వన సుశోభిత మయి వరలు నెడల
పలు తెరంగు పూల పండ్లను పొలుపారి
వివిధ విహగ రవము వెలయు నెడల 303

పలు విధమ్ములైన పద్మాకరము లట
శుభ్ర జల యుతములు శుభ కరములు
హంస సారస నిచ యాకీర్ణములు చక్ర
వాక శోభ మీర వరలు నవియు 304

రామ! యచట నొక్క రాత్రి వాస మ్మొండి
తెల్లవారి బయలుదేర వలయు
వన సమూహములకు పార్శ్వ భాగమ్మున
చక్క దక్షిణంపు దిక్కునకును
నేగ యోజనమ్ము నెడ గల్గగా నగ
స్త్య మునిచంద్రు నాశ్రమము నచటనె 305

బహుళ వృక్ష జాల పరివృతమై రమ్య
మౌ నరణ్య సీమ నచట కేళి
దేలుచుందు రా విదేహాత్మజయు లక్ష్మ
ణుండు గూడ బెరసియుండి నిన్ను 306

అయ్యది రమణీయమౌ వనోద్దేశమ్ము
బహుళ వృక్షజాల పరివృతమ్ము
నీవు మనమునందు నిశ్చయించితి వేని
కనుగొనంగ నా యగస్త్య మౌని
నేడె నీ మనమ్ము నీవు మహాయశా!
చవిగొనంగ జేయు చనగ నటకు" 307

అని వచింప మౌని యాలించి రాముండు
భ్రాతతోడ గూడి ప్రణతి సల్పి
కదలి చనియె నా యగస్త్యుని గూరిచి
తమ్ము గూడి జనకతనయ తోడ 308

కాంచుచున్ వనములు కడు రమ్యమైనవి
వారిదోపమములు పర్వతములు
చెరువు లురవడించు సెలయేళ్ళు దారిలో
తెన్ను బట్టి యరుగుచున్న వారు 309

మును సుతీక్ష్ణుడు గరపిన యట్టి యా దారి
వెంట సుఖము మీర వెడలి పోయి
పలుకు లిట్టు లంచు పరమ సంహృష్టుడై
పలికె నా సుమిత్ర పట్టితోడ: 310

"ఇదియె ఆశ్రమ పద మియ్యదియే నిక్క
మరసి చూడ నా మహాత్మకునిది
పుణ్య కర్ము డైన ముని యగస్త్య భ్రాత
యున్న దంచు తోచుచుండె నాకు 311

ఫల భరమున పుష్ప భారమ్మునన్ కడు
వంగిపోయి యున్న పాదపమ్మ
లీ వనమ్ములోని వివియె వేనకు వేలు
తెరువు వెంట గుర్తు తెలిసె నాకు 312

పండియున్న రావి పండ్ల వాసన యిదె
వగరు మీరినయది బుగులు కొనుచు
గాలి యెగయ జిమ్మగా జేర వీతెంచు
జుమ్ము మనుచు నీ వనమ్మునుండి 313

అచట నచట చూడు మగుపించుచున్నవి
ప్రోవు లిడిన కట్టెపుల్ల లెల్ల
దారి త్రుంచియున్న దర్భలు వైడూర్య
వర్చసములు కానబడెడి నవియె 314

ఇదియె లెస్స కానుపించుచు నున్నది
నల్ల మబ్బు టంచు నుల్లసమ్ము
లాడు నాశ్రమస్థ మైన హుతవహ ధూ
మాగ్ర మడవి నడుమ నదియె చూడు 315

మనుజు లెవరు లేని యనువైన రేవుల
తీర్థమాడి నట్టి ద్విజులు స్వయము
కొంచు వచ్చియున్న కుసుమమ్ములన్ పుష్ప
బలి యొనర్చుచున్న వార లదిగో! 316

ఆ సుతీక్ష్ణు వచన మయ్యది యో సౌమ్య!
యేను మున్ను విన్నదాని బట్టి
యా యగస్త్యు భ్రాత యాశ్రమ వాటిక
యగును చూవె నిశ్చయముగ నిదియె 317

* అగస్త్య మహర్షి మాహాత్మ్యము *

లోకములకు హితము లో నెంచి మృత్యువు
నిగ్రహించి బల్మి నెల వొనర్చి
కొనియె దిశను దీన తనకు నీతని భ్రాత
పుణ్యకర్ము డైన మునివరుండు 318

ఇట నొకప్పు డుండి రట క్రూరులైన వా
తాపి యిల్వలు డన దనరు వార
లన్న దమ్ము లిర్వు రైకమత్యమ్మున
బ్రాహ్మణఘ్ను లసుర వరులు వారు 319

తాల్చి యిల్వలుండు ధరణీసురాకృతి
పలుకు నంస్కృతముగ బరగుచుండ
పిలుచుచుండు వాడు విప్రులన్ శ్రాద్ధమ్ము
నెరపు పనికి గాను నిర్ఘృణుండు 320

తగరు రూపు గొన్న తన యన్న నంతట
పాక శుద్ధి దనర వండిపెట్టి
మెసవ బెట్టుచుండె మేదినీ సురులకు
శ్రాద్ధ దృష్ట కర్మ సరణి మీర 321

అట్లు మెసవినంత నా విప్ర సత్తము
లిట్టు లనుచునుండె నిల్వలుండు
'బయలు వెడలి రమ్ము వాతాపి!' యంచు పే
రెలుగు చెలగునట్లు పలుకు లెసగ 322

అంత నతని పల్కు లాలించి తన యన్న
బిలుకుమారి యుంట తెలిపెడునవి
తాకు దెంచ దొడగె తాపస సత్తము
నలుక పిచ్చలింప నసురవరుడు 329

వాడు మునివరేణ్యు వద్దకు నురికెను
జ్వలిత తేజుడైన సంయమీంద్రు
ననల కల్పమైన యక్షి వీక్షణమున
మండి మాడిపోయి మడిసె నతడు 330

* రాముడు అగస్త్యభ్రాత ఆశ్రమము చేరుట *

అవనిసురుల యెడల ననుకంప నిట్టి దు
ష్కరము కార్య మూని నెరపియున్న
యతని భ్రాత యున్న యాశ్రమ మియ్యది
కొలకులన్ వనముల పొలిచెడు నది" 331

రాము డాత డిట్టు లని చెప్పుచుండ సౌ
మిత్రితోడ నస్తమించె రవియు
బరగె సంజె వేళ పశ్చిమ సంధ్య కు
పాసన మ్మొనర్చి భ్రాతతోడ
విధి విధానముగ బ్రవేశించె నాశ్రమ
పదము ముని కొనర్చె వందనమ్ము 332

వానిచే మహర్షి వర్యునిచే లెస్స
ప్రతిగృహీతు డైన రాఘవుండు
తాను వాస ముండె నా నిశ యొక్కండు
నచట మూల ఫలము లారగించి 333

చనిన యంత గడచి శర్వరి యయ్యది
నిర్మలముగ రవియు నెగడినంత
నా యగస్త్య భ్రాత యాతని వీడ్కోలు
వడసె నపుడు రాఘ వాన్వయుండు 334

"వందన మ్మొనర్చు వాడ నీ కో స్వామి!
కడు సుఖముగ రాత్రి గడపినాడ
నిన్ను వీడుకొందు నీ యగ్ర జన్ముని
గురుని జూచుకొరకు నరుగువాడ" 335

అతడు 'పోయి ర'మ్మటంచు పల్కిన యంత
ముందు కేగెను రఘునందనుండు
మున్ను చెప్పియున్న తెన్ను ననుసరించి
యరసి చూచుకొనుచు నడవి యదియు 336

పనస తాల నివార బిల్వ చిరిబిల్వ
తిందుక మధూక వంజుళ తిమిశ ధవము
లాదియౌ వాని కానన పాదపముల
కుసుమిత లతానువేష్టిత కుసుమితముల
కాంచె రాముండు వందలు గాగ నచట 337

దంతి హస్త విమృదితము లైన తరువుల
కోతు లధివసింప కొమరు మీరి
సమద శకుని సంఘ సంకులమై పలు
తెరగు రొదలతోడ వరలు వాని 338

రాము డంబుజాత రమ్య లోచను డంత
చెప్పె నిట్టు లంచు చెంత నున్న
వీరునకును పిరుద వెనుకొని వానికి
లక్ష్మి వర్ధనునకు లక్ష్మణునకు : 339

* అగస్త్యాశ్రమ దర్శనము *

"చెట్టు లొప్పుచుంట స్నిగ్ధ పత్రమ్ముల
జంతు పక్షి గణము శాంత మగుట
భావితాత్ము డైన పరమర్షి యాశ్రమ
మనతి దూర మందె యమరి యుండు 340

పేరు లోకమందు పెర పెక్కినాత డ
గస్త్యు డనగ స్వీయ కర్మ వలన
అల్ల కానవచ్చు నదె పరిశ్రాంత శ్ర
మాపహమ్ము వాని యాశ్రమమ్ము 341

ప్రాజ్య ధూమాకుల మ్మైన వన మెసంగ
చీర మాలా పరిష్కృతి చెలువు మీరి
శాంత మృగ యూథమై బహు శకుని రవ స
మాకులమ్ముగ చెలగు నా యాశ్రమమ్ము 342

ఎవని మహిమ వలన నెల్లరు దైత్యు లీ
దక్షిణంపు దిశను త్రాసము మెయి
గాంచుచుండు వారొ కదిసి భుజింపక
వాని యాశ్రమ పద మౌ నిదియును 343

పుణ్యకర్మ డేది మొదలుగా నీ దిశ
నాక్రమించి యుండి యలరుచుండె
నదియు మొదలుగాగ నణగి యుండిరి నిశా
చరులు పగ యదెల్ల మరచి పోయి 344

స్వామి నామమునను బరగుచు నియ్యది
దక్షిణంపు దిక్కు తనరు చుండు
మూడు లోకములను గూడ ప్రఖ్యాతమై
క్రూరకర్మ లెదురుకొనగ రాక 345

పర్వతాగ్రసరుడు భాస్కరు మార్గమ్ము
నడ్డుకొనగ బూనినట్టి వాడు
పెరుగకుండ నుండె వింధ్య గిరీంద్రు డె
వ్వాని యాజ్ఞ నెరప బూనుకొనుచు 346

అతని దా యగస్త్యు నాశ్రమ మియ్యది
శ్రీయుతము వినీత సేవితమ్ము
జగతి సుప్రసిద్ధ సత్కర్మకరునిది
దీర్ఘజీవి యైన దివ్య మునిది 347

జగతి పూజగొన్న సాధు డీతడు నిత్య
రతుడు సజ్జనాళి హితమునందు
చేరవచ్చి యున్నవారల మనలను
శ్రేయమొందునట్లు చేయువాడు 348

ఆచరింతు నిచట నారాధనము నేను
నా యగస్త్యునకు మహర్షివరున
కేను ప్రభువరేణ్య! కానన వాస శే
షమ్ము నిలుచువాడ సౌమ్య! యిచట 349

ఇచట నమర గణము లెనసి గంధర్వుల
పరమ మునుల సిద్ధవరుల గూడి
ముని నగస్త్యు నియత భోజను పర్యుపా
సన మొనర్చువారు సంతతమ్ము 350

కాదు బ్రదుక నిచట కల్లరి కైనను
కఠిన చిత్తునకును శఠున కైన
ఘాతుకునకు నైన కామవృత్తున కైన
మౌని యీత డిట్టి మహిమవాడు 351

విబుధ వరులు యక్ష వితతియు నాగులు
గరుడ జాతి వారు గలసి యిచట
నిలిచి యుండువారు నియత భోజనులుగా
ధర్మ మొండె కొలుచు తలపు తోడ 352

సిద్ధులైన మహితచిత్తులు పరమర్షి
వర్యు లిచట తనువు పాయవిడిచి
పూని దివ్య తనువు భాను నిభ విమాన
ములను స్వర్గమునకు బోవువారు 353

అమర పదము నైన యక్షత్వ మైనను
రాజ్యములును పలు తెరగుల యవి
ఇచ్చివైచు వార లిచ్చట దేవతల్
పూని కొలువ సాధు భూత కోటి 354

ఆశ్రమ పదమునకు నరుదెంచితిమి సుమి
త్రాత్మజాత! చొచ్చి యరుగు ముందు
ఎరుగ జెప్పు మిపుడు ఋషికి నే నిట సీత
తోడ జేర వచ్చినాడ నంచు" 355

## (12 వ సర్గ)

ఆత డాశ్రమ పదమందు ప్రవేశించి
రాఘవానుజుండు లక్ష్మణుండు
చేర జని యగస్త్య శిష్యు నాతని తోడ
పల్కె నిట్టు లంచు పల్కు లపుడు : 356

### * అగస్త్యాశ్రమ ప్రవేశము *

"దశరథుం డనంగ ధరణినాథాగ్రణి
వాని జ్యేష్ఠసుతుడు బలియు డైన
రాము డరుగుదెంచె నీ మహర్షిని గాంచ
నతని భార్య సీత యనుగమింప 357

లక్ష్మణు డను వాడ భ్రాత నవరజుండ
వాని కేను గూర్చువాడ నెపుడు
నతని కేను భక్తు డనుకూలు డై యుందు
నీకు నిదియు చెవుల దాకె నొక్కొ? 358

అట్టివార మేము నత్యుగ్రవని జొచ్చి
నాము తండ్రి శాసనమ్ము బట్టి
స్వామి దర్శనమ్ము సలుప గోరెద మెల్ల
వార మంచు నెరుకపరుప నౌను." 359

నుడువ నిట్లు లక్ష్మణుడు పల్కు లవి యాల
కించి తాపసియును క్షిప్రముగను
'అట్లె' యంచు బల్కి యగ్న్యగారమ్మున
జొచ్చె తెలుప వారు వచ్చి రంచు 360

అతడు చొచ్చి మునివరాగ్రేసరుని తోడ
తపము పేర్మి దుష్ప్రధర్షు తోడ
పలికె నిట్టు లంచు ప్రాంజలియై వేగ
రాము డప్పు డటకు రాక లక్ష్మ
ణుండు మున్ను తనకు నుడివినట్టులు శిష్యు
డా యగస్త్యమౌని కైనవాడు: 361

"దశరథావనీశు తనయు లిర్వురు వీరు
రాముడున్ మరియును లక్ష్మణుండు
నరుగు దెంచినార లాశ్రమ వాటికి
భార్య సీతతోడ పాటు గాగ 362

కాంచ మిమ్ము నరుగుదెంచిరి శుశ్రూష
సలుప నా యరిందము లిరువురును
పిదప చేయవలసినది యేమొ అయ్యది
యానతీయ నింక నర్హ మగును" 363

అంత శిష్యువలన నాలించి యరుదెంచె
లక్ష్మణాన్వితు డయి రాము డటకు
నరుగుదెంచె నా మహాభాగ వైదేహి
యంచు పల్కు లిట్టు లంచు బల్కె: 364

"ఎట్లొ రాము డెట్టకేలకు నేటికి
నన్ను గాంచ వచ్చియున్నవాడు
వాని రాక గూర్చి నేనును మనమున
నెదురు చూచు చుంటి నింత దనుక 365

ఏగి నీవు నాచరించి సత్కారముల్
భార్యతో సుమిత్రపట్టి తోడ
రాము నిటకు గొంచురమ్ము నా చెంతకు
నేమిటికొకొ కొంచురామి వీని?" 366

అంచు బల్క నిట్టు లా మహాత్ముండును
ధర్మవేత్త యైన తాపసుండు
వందన మ్మొనర్చి పల్కె నా శిష్యుండు
'నట్లె' యంచు యోజితాంజలి యయి 367

సంభ్రమమున వెడలి చని యంత శిష్యుండు
నుడివె నపుడు లక్ష్మణునకు నిట్టు:
"లేడ రాము డీత డేగుగాక మునీంద్రు
గాంచ జొచ్చువాడుగాక స్వయము" 368

అంత వెంట నరిగి యాశ్రమ ద్వారమ్ము
జేర లక్ష్మణుండు శిష్యతోడ
కానుపించె నచట కాకుత్థ్స సత్తము
సీత జనక తనయ సైత మపుడు 369

ప్రశ్రితమ్ము లైన పల్కుల శిష్యుండు
నాడి యా యగస్త్యు డాడిన యవి
సత్క్రియార్హు నతని సత్కృతు దోడ్కొని
యరిగె లోని కర్హమైన రీతి 370

అతని వెంట జొచ్చె నంతట రాముండు
సీతతో సుమిత్ర సూతితోడ
నట ప్రశాంత మృగ గణాకీర్ణమౌ దాని
నరసి చూచుకొంచు నాశ్రమమ్ము 371

ఆత డచట గాంచె నబ్జభవ స్థాన
మగ్ని దేవు స్థాన మట్లె విష్ణు
స్థానమున్ మహేంద్రు స్థానమును వివస్వ
దధికృతమ్మ నైన స్థాన మదియు 372

కనియె సోము స్థానమును భగుస్థానమ్ము
నా కుబేరు స్థాన మదియు గూడ
స్థానముల విధాతృ ధాత్రధిష్ఠితముల
వాయు వున్నయట్టి వలను నట్లె 373

నాగనాథుడౌ ననంతుని దా మహా
త్మనిది స్థాన మదియు కనుగొనియెను
కాంచె నట్టి రీతి గాయత్రి స్థానమ్ము
వసువు లున్నయట్టి వలను నట్లె 374

పాశహస్తు డైన వరుణుని దా మహా
త్మనిది స్థాన మదియు కనుగొనియెను
కాంచె నాత డచట కార్తికేయుని స్థాన
మట్లె ధర్మ స్థాన మదియు గాంచె 375

అంత శిష్య గణ సమావృతుడౌ ముని
వరుడు లేచి యెదురువచ్చె వాని
కతని దీప్త తేజులౌ మునీంద్రుల ముందు
కడను రాఘవుండు గాంచె నపుడు 376

అనియె నిట్టు లంచు నాతడు వీరుండు
లక్ష్మి వర్ధనునకు లక్ష్మణునకు
"నితడె లక్ష్మణా! మునీంద్రు డగస్త్యుడు
స్వామి యరుగుదెంచు వాడు వెడలి
విరియ జిమ్ముకొంచు వెలుగుల నెరుగు దీ
తండు కాణయాచి తపములకును" 377

పల్కి యిట్లు మహితబాహు డగస్త్యుని
గూర్చి భానుతేజు గూర్చి యతని
పాద యుగము గొనియె పరమ సంప్రీతుడై
రాఘవాన్వయుడు పరంతపుండు 378

దశరథాత్మజుండు ధర్మాత్ము డత డభి
వాదన మ్మొనర్చి ప్రాంజలి యయి
యుండె రాము డప్పు డంత వైదేహియౌ
సీతతో సుమిత్ర సూతి తోడ 379

## * అగస్త్య మహర్షి ఆతిథ్యము *

అర్చన మ్మొనర్చి యాసనోదకముల
నా కకుత్థ్సవంశ్యు నాదరించి
కుశ్స్తరించి వాని కుశలమ్ము నడుగుచు
కూరుచుండు మనుచు గూడ పల్కె 380

ఆచరించి హోమ మగ్ని నర్ఘ్య మొసంగి
యర్చన మ్మొనర్చి యతిథులకును
వారలకు నతండు వనవాసి ధర్మ మా
ర్గమ్ము మెయిని భోజన మ్మొసంగె 381

ధర్మవేత్త యైన తాపస పుంగవుం
డంత కూరుచుండి యచట మొదట
కూరుచున్న ధర్మ కోవిదున్ రాముని
ప్రాంజలిన్ గనుగొని పల్కె నిట్లు : 382

“ఆచరించి హోమ మగ్ని నర్ఘ్య మొసంగి
యర్చ సేయ వలయు నతిథులకును
నెరపి యింక నొక్క తెరగున కాకుత్స్థ!
అతిథు లెడల తపస్వియైన వాడు
తినగ వలయు తాను తన మాంసమే కూట
సాక్షి వోలె నితర జగతి తాను 383

సర్వ లోకమునకు సార్వభౌముడవు మ
హారథుడవు ధర్మచారి వీవు
పూజనీయుడవును మునిమాన్యుడవు ప్రియా
తిథి విచటకు నరుగుదెంచి తీవు” 384

పలికి యిట్టు లంచు ఫల మూల పుష్ప సం
తతుల నితరములను దాశరథికి
నెరపి పూజ కోర్కె నెరవేరు నట్లుగా
నంత మరల నిట్టు లంచు పల్కె: 385

“ఇదియె దివ్యమౌ మహేష్వాసము సువర్ణ
రత్న నిచయ సమభిరంజితమ్ము
వైష్ణవమ్ము మానవ వ్యాఘ్ర! రాఘవా!
నిర్మితమ్ము విశ్వకర్మ చేత 386

తిరుగు లేని యట్టి దివ్య సూర్యాభమౌ
బాణ సత్తమమ్ము బ్రహ్మదత్త
మక్షయ శర పూర్ణమైన తూణీరము
లివి మహేంద్రుడు మును పిచ్చె నాకు 387

పావకోపమముగ ప్రజ్వలించు నిశాత
శరము లొప్పు నిండు శరధు లివ్వి
యొర సువర్ణ మయము కరవాల మియ్యది
బంగరు పిడితోడ వరలు నదియు 388

కార్ముకమ్ము దీని గైకొని రామ! మ
హాసురులను జంపి యాహవమున
వెలుగు లీనుచుండు వేల్పుల సిరులను
మున్ను విష్ణువు గయికొన్న వాడు 389

ఆ ధనుస్సు నవియె అమ్ముల పొదులును
బాణ ఖడ్గములును మానదా! జ
యమ్ము గైకొనంగ నవి స్వీకరింపుము
వజ్ర మొందినట్లు వజ్రధరుడు" 390

అని వచించి యా మహా తేజు డా మేలి
యాయుధోత్కరమ్ము లవియు నెల్ల
రామునకు నొసంగి స్వామి యగస్త్యుండు
పలికె నిట్లు మరల వానితోడ: 391

## (13 వ సర్గ)

"రామ! ప్రీతుండ నైతి భద్రమ్ము నీకు
పరమ పరితుష్టి లక్ష్మణా! పడసినాడ
వచ్చి యుండుట సీతతో పాటు గాగ
నాకు మీ రిట్టు లభివాదన మ్మొనర్ప 392

బాధ పెట్టు దారి బడలిక నైన ఖే
దమ్ము తెల్లముగను మి మ్మిరువుర
గోరు నీమె సేద దేరగా మైథిలి
జనక రాజ పుత్రి యనియు దోచు 393

ఈయమ సుకుమారి యెపుడు దుఃఖమ్ముల
నభిభవమ్ము పడిన యదియు గాదు
ప్రాజ్య దోషమైన వనము పా లయ్యెను
భర్తమీది చెలిమి బలిమి కలిమి 394

ఎట్టు లీమె సీత యిచ్చట నాడుచు
పాడుచుండు నట్లు బరపు మీవు
దుష్కరమ్ము సేయ దొరకొనె నీమె ని
న్ననుగమించి వనికి నరుగుదెంచి 395

ఇదియె నైజ మౌను గద రఘునందనా!
సృష్టి మొదలుకొనియు స్త్రీల కెల్ల
చక్క నున్నవాని మక్కువ గందురు
చిక్కు వడినచో త్యజించువారు 396

మించులందు గల్గు చంచలత్వమ్మును
వాలునందు గల్గు వాడిమియును
గరుడ వాయువులకు గలయట్టి యురవడి
ననుసరించి నడతు రతివ లెల్ల 397

ఈమె నీదు భార్యయో మరి యిటువంటి
దోషములకు మిగులు దూర మౌను
మెప్పు లొందు నామె చెప్పకోదగు నామె
దేవి యా యరుంధతీ సతి వలె 398

దేశ మిది యలంకృతి యుతమౌ నెట సుమి
త్రా తనూజు తోడ రామ! నీవు
వాస మాచరించు వాడవో యరి విమ
ర్దన! విదేహ రాజ తనయ తోడ" 399

అని వచింప తాపసాగ్రేసరుడు రాఘ
వాన్వయుండు సంయతాంజలి యయి
పితిహోత్రు వోలె వెలుగొందు ఋషితోడ
పల్కె ప్రశ్రితమ్ము పల్కు నిట్లు: 400

"అయితి నేను ధన్యు డనుగ్రహీతుడ నైతి
వరదుడౌ మహర్షి వర్యుడు పరి
తోష మందె భ్రాతతోడను భార్యతో
గూడియున్న నాదు గుణముల యెడ 401

కాని యెరుగ జెప్పుమా నాకు దేశమ్ము
సలిల బహుళ విపిన సహితమైన
దెచట నాశ్రమ పద మేర్పరించి వసింప
నగునొ సుఖము దలర నాక లేక" 402

* రాముడు పంచవటికి పోవుట *

అంత నిట్టు లనియె నా ముని శ్రేష్ఠుండు
రాము డన్న పల్కు లాలకించి
ధీర తరము వాక్కు ధీరుండు ధర్మాత్మ
డూని యుండి ధ్యాన మొక నిముసము 403

"ఉండు నిటకు తండ్రి! రెండు యోజనముల
మూల ఫల జల పరిపూర్ణ మగుచు
మృగ బహుళము శ్రీ మహితము నౌ దేశమ్ము
'పంచవటి' యనంగ బరగెడు నది 404

అచటు చేర నరిగి యాశ్రమ పద మేరు
పరచికొని సుమిత్ర పట్టి తోడ
విహరణ మ్మొనర్తు వీవు పితరు వాక్కు
నన్న దన్న యట్టు లాచరించి 405

చాల వరకు గడచి చనియె కాల మ్మిది
ధరణినాథు డైన దశరథుండు
నీకు నియతి సేసి నిలిపిన యది రామ!
గడుపు నీకు నిడిన కాల మదియు 406

గడపి పుచ్చి ప్రతిన కాకుత్థ్స! సుఖముగా
నీవు రాజ్యమందు నిలువ గలవు
ధన్యు డతడు నీదు తండ్రి నృపాలుడు
రఘు కుమార వర్య! రామ! యతని
నీవు జ్యేష్ఠ సుతుడ విట్లు దాటించుట
అల యయాతి నృపతి యట్టి రీతి 407

విదిత మయ్యె నాకు వృత్తాంత మియ్యది
యనఘ! నిన్ను గూర్చి యంతయున్ త
పః ప్రభావముునను పదపడి దశరధ
నృప వరేణ్యు నెడల స్నేహమునను 408

నీకు డెందమందు నెలకొన్న కోరిక
నేను తపము పేర్మి నెరిగినాడ
నీ తపోవనమున నా తోడ గూడి వా
స మ్మొనర్చుటకును సమ్మతించి
దాన జేసి గాదె నేను చెప్పుచునుంటి
'పంచవటికి జను' మటంచు నీకు 409

అదియు మిగుల రమ్యమైన వనోద్దేశ
మాట లాడుకొనెడు నచట సీత
ఆ యెడ కడు శ్లాఘనీయమై రాఘవా!
యనతి దూరమందె యదియు నుండె 410

ఆట లాడుకొనెడు నచ్చట గోదావ
రీ నది దరి మైథిలేశ తనయ
ప్రాజ్య భోజ్య మూల ఫల సమన్వితమును
వివిధ విహగ జాల విలసితమ్ము
జన విరహితముగను మను నో మహాబాహు!
పుణ్య రమ్యముగను పొలుచు నచటు 411

భార్యతోడ నున్నవాడ వైనను నీవు
కాచి ప్రోవ శక్తి గలదు నీకు
వాస మిచట నుంట వలన నో రఘురామ!
ప్రోపు సేయగలవు తాపసులకు 412

ఇదియె వీర! కానుపించును మహనీయ
మౌ మధూక వనము మరల దాని
యుత్తరంపు చక్కి నున్న దారిని మ్రి
కేగు దారి బట్టి యేగ నగును 413

అంత నారుబయట నడివారమున శైల
మున కదూర దేశమున నెసంగు
'పంచవటి' యనంగ ప్రఖ్యాతమై నెడ
యెపుడు పూచి నడవి నెసగు నెడలు" 414

ఈ విధమ్ముగా వచింప నగస్త్యుండు
లక్ష్మణ సహితుండు రాము డప్పు
డర్చన మ్మొనర్చి యామంత్రణము సేసె
సత్యవాదికి ఋషి సత్తమునకు 415

అతని చేత వార లభ్యనుజ్ఞాతులై
యడుగులకును మ్రొక్కి లిడిన వారు
పంచవటిని జేర వైదేహి తోడ నా
యాశ్రమమ్ము నుండి యరిగినారు 416

పూని చాపము లమ్ముల పొదుల గట్టి
యాలమున జంకు గొనని నృపాల సుతులు
తాపసుడు చెప్పినట్టి పథమ్ము బట్టి
బయలు వెడలిరి నెమ్మది పంచవటికి 417

## (14 వ సర్గ)

అంత పంచవటికి నరిగి నంతటి లోనె
రఘుకులోద్వహుండు రాము డచట
కడు పొడుంగు మేని గ్రద్దను భీమ వి
క్రమము గల్గువాని గాంచె నెదుట 418

*** జటాయు దర్శనము ***

వాని గాంచి మఱ్ఱిపై రామ లక్ష్మణుల్
వా రిరువురు మహిత భాగధేయు
లెడద తలచి రప్పు డిదియు రాక్షస పక్షి
యనుచు 'నెవర వీ?' వటంచు ననిరి 419

మంచితనము తొలకు మధురమౌ పలుకుల
వారి కుత్తరించు పగిది నతడు
"కుర్ర! న న్నెరింగికొనుము మీ తండ్రికి
ననుగు చెలిమికాడ" నని వచించె 420

వాని పితృసఖుండుగా నెరింగిన యంత
పూజ సల్పె రాఘవుం డతండు
అడిగె నతని నంత నవ్యగ్రముగ వాని
కులము గూర్చి పేరు గూడ నడిగె 421

రాము డాడు పల్కు లాలించి నంతనే
సర్వ భూత జాల సంభవమ్ము
ద్విజ వరేణ్యు డతడు వివరించె నతనికి
తన కులమ్ము గూర్చి తన్ను గూర్చి 422

"పూర్వ కాలమందు పొలచిన యా ప్రజా
పతుల వారి నెల్లవారి నేను
తొలుతనుండి తెలియబలుక మహాబాహు!
వినుము నీవు రాఘవేంద్ర తనయ! 423

ప్రథముండౌ కర్దమాఖ్యుడు వారిలోన
నాతని యనంతరమ్ము విక్రీతు డనగ
తక్కువాడు సంశ్రయు డన దనరు వాడు
బరగు బహుపుత్రకుడు వీర్యవంతు డగుచు 424

స్థాణుడు మరీచి యత్రి నా దనరు వారు
నలఘు బలుడు క్రతుడు పుల స్త్యాంగిరసులు
నట్టులే ప్రచేతస పులహాఖ్యు లంత
దక్షుడు వివస్వంతుం డన దాశరథీ! య
రిష్టనేమియు కాశ్యపర్షియును మహిత
కాంతి మంతుండు వారిలో కడమ వాడు 425

తనయ లరువదుండ్రు దక్ష ప్రజాపతి
కిని యశస్విను లన వినగ వచ్చు
నందు స్వీకరించె నష్ట సుమధ్యల
భూరి యశుడు కాశ్యపుండు రామ! 426

అతడు పెండ్లి యాడె నదితిని దితి నట్లె
దను వనంగ బరగు దాని కాళి
కాఖ్య తామ్ర యనెడు కన్య క్రోధవశను
మను వనియెడు దాని నవల నట్లె 427

అంత ప్రీతినొంది యా కన్య లెడలను
పల్కె కాశ్యపుండు వారితోడ
'పడయుడీ త్రిలోక భర్తలౌ వారిని
పుత్రకులను నన్ను బోలు వారి' 428

మనసు నిలిపె నతని మాటపై నదితియు
దితియు మనుజవర్య! మతి యొనర్చె
నట్లె నల్పె కాళికాఖ్య మహాబాహు!
తాము మనసు పడరు తక్కువారు 429

అదితియందు జనన మందిరి సురలు ము
ప్పదియు ముప్ప రమిత్ర భంజన! మొద
లరిగణాభిభూతి యాదిత్యులున్ వసు
వులును రుద్రు లాశ్వినులు ననంగ 430

కాంచె దితియు పుత్ర గణమును నాయనా!
దైత్యు లనగ కీర్తి దలరు వారి
వసుమతి యిది తొల్లి వారలదై యుండె
సకల వన సముద్ర సహితముగను 431

దనువు తాను సుతుని గనె హయగ్రీవుని
కాళికయును నరక కాలకులను
కన్య లైదుగురిని క్రౌంచిని భాసిని
శ్యేనిని ధృతరాష్ట్రి నింక శుకిని
సర్వ జగములందు సత్కీర్తి గలవారి
గనియె తామ్ర యపుడు కాశ్యపునకు 432

కనియె గుడ్లగూబలను క్రౌంచి భాసియు
కనియె పెక్కు కోళ్ళగముల నంత
కనియె శ్యేని తాను గ్రద్దల డేగల
మిక్కుటంపు వాడి మీరు వాని 433

కనియెను ధృతరాష్ట్రి కలహంసముల హంస
ములను చక్రవాకములను నెల్ల
యెడల నీకు భద్ర మెసగును శుకియును
కనియె 'నత'ను నతకు తనయ వినత 434

క్రోధవశయు రామ! కూతుల గనె పది
మందిని మృగియు మృగమంద భద్ర
మదయు హరియు శ్వేత మాతంగి శార్దూలి
సురభి కద్రుక మరి సురస యనగ 435

సర్వ మృగ గణమ్ము సంతతియై యొప్పు
నయ్య మృగికి నరవరాగ్రగణ్య!
ఋక్ష చమరములును సృమరముల్ మృగమంద
సంతతి రఘువంశజాత! యద్లె 436

హరికి సంతతి యగు హర్యక్షములు వాన
రమ్ము లట్టులే తరస్వి గణము
కనియె భద్రమదయు తనయ నిరావతి
యనెడు పేర బరగునట్టి దాని 437

ఆమె కాత్మజాతు డైరావత మ్మను
నలఘు గజము లోకములకు ప్రభువు
మాన వాగ్రగణ్య! మాతంగములును మా
తంగి సంతతి యయి తనరుచుండు 438

వ్యాఘ్రములును గోలాంగూల వర్గములును
సంభవించెను శార్దూలి సంతతిగను
కాంచె శ్వేతయు నంత దిగ్గజ గణమ్ము
తనకు కాకుత్థ్స సంభవా! తనయులుగను 439

సుతల గాంచె రామ! సురభి యిర్వుర రోహి
ణీ సమాఖ్య తోడ నెగడు దాని
నీకు భద్ర మగును గాక గంధర్విని
విశదకీర్తి చెలగ వెలుగు దాని 440

కనియె సుతుల గోవులను రోహిణి యను గం
ధర్వి వారువముల తాను గనియె
కనియె సురస నాగ గణముల కద్రువ
గనియె రామ! పన్నగముల గముల 441

మనువు కనియె రామ! మనుజుల సుతుల య
శోఽన్వితులను ధరణి సురుల క్షత్రి
యులను వైశ్య శూద్ర యుతముగా ననలయు
సర్వ సుఫల వృక్ష చయము గనియె 442

మనుమరాలు శుకికి వినత కద్రువయును
సురస యనెడు నామె సోదరి యగు
కనియె నాగవిభుని కద్రువయు సహస్ర
ముఖుని ధరణిభరము బూను వాని 443

పుట్టి రిద్ద్వ రంత పుత్రులు వినతకు
గరుడు దరుణు డనగ బరగువార
లేను నరుణుచే జనించిన వాడ సం
పాతి నాకు నగ్రజాతు డగును
శ్యేని పుత్రకుండ నేను జటాయువు
ననుచు నీ వెరింగి కొనుము రామ! 444

ఏను నట్టివాడ ఇలుతోడుగా నుందు
నీవు కోరు దేని నీకు నింక
కాన యియ్యదియును కడు దుర్గమము మృగ
దైత్య సేవితమ్ము తండ్రి! సీత
రక్ష సేయువాడ లక్ష్మణుడును నీవు
నాశ్రమమ్ము వీడి యరిగి నపుడు." 445

ఆ జటాయువునకు పూజ యాచరించి
పొదివి ముదమున రాముడు మ్రొక్కి నాత్మ
వంతు డాలించి తన తండ్రి వలని చెల్మి
యా జటాయువు మాటికి నాడినయది 446

అత డచ్చట మైథిలిన్ సీత రక్ష
సేయ నతిబలుడౌ పక్షి చెంత నిల్పి
చనియె పంచవటికి సలక్ష్మణుడు రిపుల
గాల్పగా నగ్ని మిడతల గాల్చునట్లు 447

## (15 వ సర్గ)

అంత పంచవటికి నరిగి నానా వ్యాళ
మృగ సమన్వితమగు నెడలు గాంచి
రాము డిట్టు లనియె సౌమిత్రికిన్ భ్రాత
కతుల దీప్త తేజసాన్వితునకు: 448

"ఏగుదెంచి యుంటి మీ యెడకు మహర్షి
పల్కియున్న యట్టి పట్టునకును
ఇదియె పంచవటి యనెడు దేశ మో సౌమ్య!
పుష్పి తావనీజ భూషితమ్ము 449

### * లక్ష్మణుడు పర్ణశాల నిర్మించుట *

అడవిలోన నెల్ల కడలను నీ చూపు
నెరపుమయ్య నీవు నిపుణు డౌదు
వే ప్రదేశము మన కెల్లరకును గూర్చు
నాశ్రమమ్ము నిల్వ ననువు పడునో 450

ఎట విదేహ తనయ కెసగు నానందము
నీకు లక్ష్మణ! మరి నాకు గూడ
నరసి చూడు మయ్య యటువంటి దేశమ్ము
సన్నికృష్ట సరసిజాకరమ్ము 451

ఎచట వనము రామణీయకమై యుండు
నెచట రమ్య మగుచు నెడలు నుండు
సన్నికృష్ట మగుచు సమిధలు పుష్పముల్
దర్భ లుదకములును దనరుచుండు" 452

రాము డిట్టు లనగ లక్ష్మణు డంతట
సంయుతాంజలి పుట సహితు డగుచు
సీత సమ్ముఖమున నాతని కాకుత్థ్సు
గాంచి యిట్టు లని వచించె నపుడు: 453

"నేను వరవు డేను నీకు నో కాకుత్థ్స!
వర్ష శతము గడచు వరకు నైన
నించు నెడ రచింపు మంచును స్వయముగా
నీవె నాకు నిశ్చయించి చెప్పు" 454

ఆ మహాత్మకుండు సౌమిత్రి పల్కిన
పల్కు లాలకించి పడసి ప్రీతి
యరసి చూచి మనసు నాకొల్పు నెడ నెంచు
కొనియె నచట సర్వ గుణ యుతమ్ము 455

అతడు తనకు రుచికరమౌ నెడ నాశ్రమ
నిర్మితికి తగు నెడ నిల్చియుండి
కేల నాత డతని కేల్దోయి గీలించి
రాము డిట్టు లనియె లక్ష్మణునకు: 456

"ఇదియు నీ యెడ కడు చదునైనదియు శ్రీయు
తమ్ము పుష్పిత వన తరు వృతమ్ము
ఇచట నెరపదగుదు నీ వాశ్రమ పదమ్ము
సౌమ్య! యనువు మీర రమ్యముగను 457

అర్క సన్నిభమ్ము లైన పద్మమ్ముల
సురభి పరిమళమ్ము వరలు దాన
పద్మశోభి రమ్య పద్మాకర మ్మదె
చూడు కానుపించుచుండె నదిగో 458

భావితాత్ము డైన పరమ మునీంద్రు డ
గస్త్యు డాడియున్న కరణి గాగ
నరయు మిదియె రమ్యమైన గోదావరి
పూచియున్న తరుల పొలిచెడునది
చారు నాద హంస కారండ వాకీర్ణ
చక్రవాక విహగ సమభిశోభి 459

అంత దవ్వు కాక యంత దాపును కాక
మృగ సమూహ నిబిడముగ నెసంగి
రమ్యమై మయూర రవము చెలంగగా
నున్నతముగ గుహల నొప్పుచుండి
సౌమ్య! కానుపించు శైలమ్ము లయ్యవే
ఫుల్ల తరు నికాయ ముల్లసిల్ల 460

అలర ధాతు నిచయ మచ్చట నచ్చట
స్వర్ణ రజత తామ్ర వర్ణ కాంతి
పరమ భక్తి యుక్తి వారణేంద్రములు గ
వాక్షితమ్ము లట్లు వరలుచుండె — 461

సాల తాల నివార తమాల పనస
తిమిశ ఖర్జూర పున్నాగ తిలక చూత
చంప కాశోక కేతకీ చంద నామ్ర
పాటల స్పందన శమీ ధ వాశ్వకర్ణ
లికుచ నీప పార్ణాస కింశుకము నాది
పుష్ప గుల్మ లతా వృక్ష పూర్ణ మగుచు — 462

ఇది పవిత్రమైన దిది పుణ్యమైనది
బహు మృగ ద్విజముగ బరగెడు నిది
ఇట వసించు వాడ నేను సౌమిత్రి! యీ
పక్షివరుడు సతము బాసటగను" — 463

ఇట్టు లన్న యంతనే రాఘవుండు ల
క్ష్మణుడు శత్రు వీర ఘాతుకుండు
సుమహనీయ బలుడు సమకూర్చె నాశ్రమ
మచిర కాలముననె అన్న కొరకు — 464

అచట కడు విశాలమౌ పర్ణశాల ని
ర్మించె మంచి మట్టి మెత్తిన యది
నెరి యెసంగ గట్టి నిట్టాళ్ళు పొడుగాటి
గడలు వాసములుగ గట్టినదియు — 465

గుత్తముగను జమ్మి కొమ్మలు పరచియు
గట్టిగాగ త్రాళ్ళ గట్టిపెట్టి
దర్భ జమ్ము రెల్లు తాటి యాకుల తోడ
దట్టముగను గప్పి నట్టిదియును — 466

చదును గాగ నేల పొదపిన యది చక్క-
నొప్పెడునది చూడ వొప్పెడునది
యుత్త మోత్తమమ్ము నొనరించె లఘు విక్ర
ముండు నెలవు రాము డుండుటకయి 467

అపుడు శ్రీ సమేతు దరిగి గోదావరీ
నదికి లక్ష్మణుండు స్నాన మాడి
యంబుజాత సముదయమ్మును గైకొని
ఫల నిచయము గొంచువచ్చి యతడు 468

అంత పుష్ప బలియు నాతడు కావించి
శాంతి యాచరించి శాస్త్ర రీతి
నపు డొనర్చి యున్న యా యాశ్రమ పదమ్ము
తాను రామునకును కానుపించె 469

అతడు సీతతోడ నా యాశ్రమము సౌమ్య
మట్లు నెలకొలిపిన దరసి చూచి
పర్ణశాల యెడల పరమమౌ హర్షమ్ము
పడసె తాను రాఘ వాన్వయుండు 470

అలఘు హర్ష మొంది నాతడు లక్ష్మణు
కర యుగమ్ము సాచి కౌగిలించి
గాటముగను చెల్మి కడు నుట్టిపడు నట్లు
పలుకు లివియు గూడ పలికె నపుడు 471

"ప్రీతి నొందినాడ పెద్దది పని యిది
స్వామి! నెరపియున్న వాడ వీవు
దాని కొరకు నీకు తగు బహుమతి గాగ
నేను నిన్ను కౌగిలించు కొంటి 472

భావ మెరుగ జాలు వాడును లక్ష్మణా!
ధర్మ వేత్తయున్ కృతజ్ఞు డైన
నిన్ను బోలు తనయు డున్న ధర్మాత్ముడు
నాదు తండ్రి వీడలేదు నన్ను" 473

పల్కి యిట్టు లంచు భ్రాత సౌమిత్రితో
లక్ష్మి వర్ధనుండు రాఘవుండు
వశి యతండు నచట బహు ఫలమౌ నెడ
పరమ సుఖము మీర వాస ముండె 474

అట్లు కొంత కాల మా ధర్మ చిత్తుండు
సీతతో సుమిత్ర సూతితోడ
నచట వాసముండె సన్వాస్యమానుడై
త్రిదివ లోకమందు త్రిదశు నట్లు 475

## (16 వ సర్గ)

పరమ సుఖము మీర వసియించు నా మహా
త్మునకు రఘుకులోత్తమునకు మిగుల
నిష్టమైన ఋతువు హేమంత మరుదెంచె
శరదృతు వది గడచి చనిన పిదప 476

అత డొక్క యప్పు డా రఘుసుతుడు శా
ర్వరి చనంగ తెల్లవారు వేళ
మహిత తటిని రమ్యమైన గోదావరీ
నదికి బయలు వెడలె స్నానమునకు 477

కడు వినయము మీర కలశమ్ము గైకొని
భ్రాత వీర్య యుతుడు లక్ష్మణుండు
నతని పిరుద వెంట నరుగుచు సీతతో
నతనితోడ నిట్టు లంచు పల్కె: 478

*** లక్ష్మణుని హేమంత ఋతు ప్రస్తవము ***

"ప్రియము పల్కువాడ! ప్రియమైన దిది నీకు
నట్టి మంచి కాల మరుగుదెంచె
సొగసు లెసగి నట్లు సొంపారెడున్ దీని
వలన శుభకరమ్ము వత్సరమ్ము 479

బిరుసువారు నివము లురలుట లోకమ్ము
నేల పొలుచు పంటచేల తోడ
ననుపభోగ్య మగుచు నమరును జలములు
హవ్యవహుడు కడు సుఖావహుండు 480

అగ్రయణ పూజనముల నభ్యర్చనమ్ము
నెరపి పితృదేవతలకు నెల్లరకు గ్రొత్త
కాలమున సజ్జనులు గత కల్మషులుగ
నెగడువా రగ్రయణకము నెరపినారు 481

పల్లె పట్టు పరగు బహు కామ సంస కి
చిక్కబడును పాలు మిక్కుటముగ
నడచువారు ధరణినాథులు దండయా
త్రా సమాప్త గెలువ తలపు నూని 482

ఆశ్రయించి యుండ నంతక సేవిత
మైన దిక్కు నర్క మండలమ్ము
ద్యుతి విహీన మగుచు తోచె నుత్తర దిక్కు
బొట్టు లేని పూవుబోడి వోలె 483

సహజముగనె తుహిన బహుళమై పెంపారు
నెడయు గల సూర్యు డేగ నిపుడు
స్పష్టమైన రీతి సార్థక నామమై
హిమ సమేత మయ్యె హిమవదద్రి 484

పరమ సుఖము మీర తిరుగాడ నొప్పి మ
ధ్యాహ్న వేళ వెచ్చదన మెసంగ
చూడ నొప్పియుండు సూర్యుండు పగలింట
నీడ నున్న నీళు లాడ గాదు 485

మృదుల దినకరుండు మిక్కిలి పొగమంచు
నుద్ధృతంపు చలియు నొలయు గాలి
హిమ వినష్టమౌ విహీన కాననములై
పగటి వేళ లిపుడు పరగుచుండు 486

ఆరు బైట పడుక లవి యెల్ల ముగియంగ
పుష్యమునకు చేరబోవు చుండ
ముదిరిన చలి మిగుల ముదిసిన జాముల
గడచెడున్ త్రియామ లెడప కిపుడు 487

అర్కునకు నొసంగి యాత్మ సౌభాగ్యము
ఇవము గ్రమ్ముకొనగ నెర్రవారి
పరవ నూర్పు గ్రుడ్డి వడిన యుద్దము వోలె
వెలుగు లీనకుండె చలి వెలుంగు 488

మంచు ముసరుకొనగ మాసిన నెలరేయి
వెలుగకుండె నిండు నెలయు నైన
నెండ నల్లవారి యుండు సీతను బోలి
తోచు గాని సొగసు తొలక దయ్యె 489

చల్లనైన స్పర్శ స్వాభావికమ్ముగా
నిప్పు డందు మీద నివము గ్రమ్మ
ప్రబలి వీచుచుండు పశ్చిమ వాయు వి
బ్బడిగ చల్లనై ప్రభాత వేళ 490

మంచుబొట్లు మించి ముంచివైవ యవ గో
ధూమ యుక్త మగుచు తోచుచుండి
యడవి రాజిలు రవి యభ్యుదితుడు గాగ
క్రౌంచ సారసముల రవళి చెలగ 491

కనక కాంతి తోడ ఖర్జూర పుష్పాకృ
తులగు తలల వడ్లతోడ నిండి
ఇంచు కించు కంత వంచిన మేనులు
పరమ శోభ మీరు వరి పొలములు 492

ముసరు కొన్న మంచు పొగమంచుతో నెగ
ప్రాకుచున్న కిరణ వార మొప్ప
దూర దేశమందు తోచిన సూర్యుండు
కానబడు శశాంకు కరణి గాగ 493

ఎండ వేడి లేకయుండు ప్రొద్దుటను మ
ధ్యాహ్న మిచ్చు నొడలి దాకి సుఖము
యెఱ్రదనము గల్గి యించుక తెల్లనై
పొలుచుచుండు నెండ పుడమియందు 494

మంచు కురిసియుంట నించుక పైపైన
తడిసి యున్న యట్టి యడవిలోని
పచ్చగడ్డి బీళ్ళపై వ్రాల లేయెండ
పుడమి యెల్ల శోభ పొలుచుచుండె 495

అంటి మిగుల చల్లనైన జలమ్ముల
బడయ సుఖము వన్య వారణమ్ము
అంతు లేని దప్పి నలమటించుచు నున్న
[illegible]

ఇవియె నీట దిరుగునవి విహంగమ్ములు
కూడి చెంత జేరి కూరుచుండె
నురికి చొరక యున్న వుదకమ్ము లోనికి
దురము చొరగ లేని పిరికి వోలె 497

మున్గి మంచు నీట ముద్దలై మెదలక
కప్పగ పొగమంచు కటిక యిరులు
గాఢ నిద్ర నున్న కరణిని గన్పట్టు
విరులు లేక యున్న విపిన రాజి 498

కూత బట్టి యెరిగికొననైన బెగ్గురుల్
మంచు గ్రమ్ముకొన్న మంచి నీరు
నివమున తడిమీరు నిసుక రేవులు నొప్ప
నేరు లెసగుచుండె నీ యదనున 499

మంచు కురియు కతన మార్తాండు కడు మెత్త
దనము వలన చల్ల దనము వలన
శైల శిఖర సంస్థ సలిలమ్ము లైనను
రసము వోలె నుండె ప్రాయికముగ 500

ముదిమి వన్నె దరిగి ప్రిదిలిన కేసర
ములును కర్ణికయును పొలుపు దప్ప
తూడు మిగిలియుండ తుహిన విధ్వస్త ప
ద్మముల చెర్వు లొరపు దక్కి యుండె 501

ఇట్టి వేళ యందు పట్టణమున నర
వ్యాఘ్రు డతడు దుఃఖ భర యుతుండు
తప మొనర్చు వాడు ధర్మాత్ముడౌ భర
తుండు నిన్ను గూర్చి నిండు భక్తి 502

విడచిపుచ్చి రాజ్య ముడిగి మానము పలు
విధములైన భోగవితతి వీడి
యా తపస్వియు నియతాహారుడై యుండి
మేను వాల్చు చలిని మేదినిపయి 503

ఆతడైన నిక్క మీ తరుణముననే
స్నాన మాచరింప బూని లేచి
ప్రకృతి మండలమ్ము పరివృతమై రాగ
నరుగుచుండు నెపుడు సరయు నదికి 504

కడు సుఖమ్ము మీరగా పెరిగిన సుకు
మారు డాతడు సుఖమంద నర్హు
డపర రాత్రి వేళలం దెట్టులో కదా
సరయు తటిని మున్గు స్నానమునకు 505

పద్మపత్ర సన్నిభాక్షుడు వీరుండు
శ్యాము డుదర రహితుడౌ మహితుడు
సకల ధర్మవేత్త సత్యవాది యతండు
హ్రీ నిషేధుడు విజితేంద్రియుండు 506

ప్రియ వచోభిభాషి మృదు మధు రాభాషి
మహిత బాహు దరి విమర్దనుండు
విడచి పుచ్చివైచి వివిధ భోగమ్ముల
నార్య త్రికరణముల నాశ్రయించె 507

త్వదనుజుండును మహితాత్ముండు భరతుండు
స్వర్గము గెలువంగ జాలినాడు
విపిన భూమి తపసి వృత్తి నూనిన నైన
నిన్నె యనుసరించి యున్న కతన 508

తండ్రి చాలు గాక తల్లి చాలును బట్టి
నడచుకొనెడు వారు నరు లటంచు
నలుగు రాడుకొనెడు నానుడి నద్దాని
వమ్ము చేసినాడు భరతు డిట్లు 509

భర్త దశరథుండు భరతుండు సుతుడును
సాధుశీల వృత్తి జనెడు వారు
అదియు నెట్టులొక్కొ యా యమ్మ కైకేయి
కట్టి క్రూరవృత్తి యలవడియెను?" 510

ఇట్టు లంచు చెల్మి యుట్టిపడెడు పల్కు
పల్కుచుండ ధర్మ వత్సలుండు
లక్ష్మణుండు సైపరాక మాతృ విగర్హ
పల్క రాఘవుండు పల్కు లిట్లు : 511

"నీదు నడిమితల్లి నిందింప దగినది
కా దికెట్టులైన గాని తండ్రి!
ఈవు పల్కు మింక నిక్ష్వాకు నాథుడౌ
నట్టి భరతు గూర్చి యా కథలనె 512

పటు దృఢ వ్రతమున బరగెడు నా బుద్ధి
నిలువ నడవిలోన నిశ్చితమ్మె
యైన భరతు చెల్మి నలమట మందుట
మరల కుర్రతనము నెరపుచుండు 513

తలచుకొంచు నతని పలుకులు మనమున
మధురమైనవి ప్రియమైన యవియు
హృద్యమైనవియు నమృతకల్పమైనవి
మదికి హ్లాదనమ్ము పొదవు నవియు 514

ఏను నింక మీద నెప్పటికో కదా
కలసి మెలసి యుంద గాంతు భరతు
తోడ నా మహాత్ముతో వీరు శత్రుఘ్ను
గూడి రఘుకుమార! గూడి నిన్ను" 515

ఇట్టు లంచు ప్రవిలపించి గోదావరీ
నదిని చేర నరిగి స్నానమాచ
రించె నందు రఘు వరేణ్యుండు ననుజుని
తోడ గూడి సీత తోడ గూడి 516

దేవతలకును పితృదేవతలకు నంత
నెరపి తర్పణమ్ము నీటితోడ
స్తుతులు వా రొనర్చుచుండిరి నెమ్మది
నుదితు డైన రవికి త్రిదశ తతికి 517

రాజిలె కృతాభిషేకుడా రాఘవుండు
సీతతో నా సుమిత్రాత్మజాదు తోడ
నగ తనూజాతతో గూడి నందితో కృ
తాభిషేకుడౌ భగవాను డభవు డట్లు 518

## (17 వ సర్గ)

ఆ కరణి కృతాభిషేకుడౌ రాముడున్
సీతయున్ సుమిత్ర సూతియు తమ
యాశ్రమమున కంత నరిగి రా గోదావ
రీ నదీ మతల్లి రేవునుండి 519

అట్లు చేర నరిగి యా యాశ్రమమ్మును
లక్ష్మణాన్వితుండు రాఘవుండు
వరుస నెరపి పుచ్చి పౌర్వాహ్ణికము కర్మ
చనియె జేర పర్ణశాల నపుడు 520

* పర్ణశాలకు శూర్పణఖ రాక *

ముని జనమ్ముచేత పూజ లందెడు వాడు
కూరుచుండి సౌఖ్య మార నచట
తనదు తమ్ము లక్ష్మణుని గూడి రాముండు
వినుచు చుండె నపుడు వివిధ కథల 521

అట్లు పర్ణశాలయందు రాముండు నా
సీనుడైన వాడు సీత గూడి
పరగుచుండె మహిత బాహుడు శోభతో
చిత్ర తోడి చంద్రు చెలువు తోప 522

అట్లు రాముడున్ కథాసక్త చిత్తుడై
యుటజముసను కూరుచుండి యుండ
నరుగుదెంచె రాక్షసాంగన యొక్కతె
తత్ప్రదేశమునకు తప్పి దారి 523

శూర్పణఖ యనగ బరగుచుండు నామె
యనుజ దశకంఠునకు రాక్షసాగ్రణికిని
రాముడు వసించుచున్న యాశ్రమము జేరి
త్రిదశ సన్నిభు నాతని తేరి చూచె 524

అలఘు బాహుయుగళు హర్యక్ష వక్షుని
సరసిజాత పత్ర సన్నిభాక్షు
నా ప్రదీప్త వదను నాజానుబాహుని
కాంచు కనులకు కడు నించు వాని 525

మత్త వారణ విక్రాంత మంద గమను
చీర వసను జటా చ్ఛటా ధారి నతని
మహిత సత్త్వుని సుకుమారు మానవేశ
రమ్య లక్షణముల నలరారు వాని 526

ఇంద్ర తుల్యు రాము నిందీవర శ్యాము
మీనకేత నోపమాన తేజు
కనుల గాంచి నంత కామ మోహిత యయ్యె
రాక్షసాంగనా లలామ యపుడు 527

రాము సుముఖుని దుర్ముఖి యామె తను వ
లగ్నుని మహోదరియు విశాలాక్షు వికృత
నయనయు సుకేశు తామ్రకేశియును ప్రీతి
రూపుని విరూపయును సుస్వరుని విలోల
భైరవ స్వర తరుణుని ఘోర వృద్ధ
సరళ భాషిని వక్ర భాషా ప్రయోక్త్రి 528

న్యాయ వర్తనమున నడచు వానిని సుదు
ర్వృత్త యెల్లరకును ప్రియుని వాని
నప్రియతర దర్శనాకార మనసిజా
విష్ట యసుర చూచి వెస వచించె: 529

"జడలు తాల్చి తాపసాకారమును బూని
భార్యతోడ గూడి బాణ చాప
ధారి వగుచు నీవు దానవాన్విత మైన
యెడకు నిటకు వచ్చి తెట్టులొక్కొ?
వచ్చియున్న దేమి పని కీవు? కలరూపు
తెలియ బల్కనగును తెల్లముగను" 530

అని వచింప రాక్షసాంగన శూర్పణ
ఖయు పరంతపుండు కల తెరంగు
సరళ బుద్ధి పేర్మి సర్వమ్ము వివరింప
మొదలు కొనియె దైత్య మదవతికిని 531

అనృత వాక్య మాడు టంగీకరింపడు
గాక యెన్నడైన గాని రాము
డందులోన నాత డాశ్రమస్థుం డౌట
మెలత లంతికమున మెలగుచుంట 532

"ఉండె మున్ను దశరథుం డను పేరిట
పృథ్వీభర్త త్రిదశ విక్రముండు
అతని కేను సుతుడ నగ్రజన్ముండను
జనులు నన్ను 'రాము' డనెడు వారు
వీడు లక్ష్మణు డను వాడు నా తమ్ముండు
వ్రత మితనికి నన్ను బట్టి చనుట 533

భార్య యీమె నాకు వైదేహి యీబిడ
పేరు 'సీత' యనగ వినగవచ్చు
ధరణినాధు డైన తండ్రియు తల్లియు
నానతిచ్చి పూన్చినందు వలన 534

ధర్మమునకు గాను ధర్మాభికాంక్షినై
వని వసింప నిటకు వచ్చినాడ
ని న్నెరుంగ గోరి యున్నాడ జెప్పుమా
యెవరి దాన వీవు? యెవర వీవు? 535

## * శూర్పణఖతో పరిహాసము *

అంతగా మనోహరాంగివి కావు దా
నవ వనిత వటంచు నాకు దోచు
నిటకు వచ్చియుంటి వెందులకో నీవు
తెలియ బలుకు మీవు కల తెరంగు" 536

ఆలకించి పలుకు లవి మదనార్దిత
యైన రాక్షసి యిటు లని వచించె
"వినుము నీవు రామ! వివరించు దాన నా
పలుకు కల తెరంగు తెలిపెడునది 537

ఏను శూర్పణఖను దానవ వనితను
కామ రూప మూన గల్గుదాన
నీ యరణ్య భూమి నే నొంటి తిరుగాడు
దాన సర్వ భీతి దాత్రి నగుచు 538

రావణు డను వాడు భ్రాత నా కతడు ప్ర
వృద్ధ బలుడు రాక్షసేశ్వరుండు
విశ్రవసుని సుతుడు వీరు డెన్నం డైన
వాని పేరు విన్నవాడ వాకొ్క? 539

భ్రాతలు సతతమ్ము పరివృద్ధ నిద్రుండు
కుంభకర్ణు డనెడు గొప్ప బలియు
డట్టులే విభీష ణాఖ్యుండు ధర్మాత్ము
డసుర కృత్య దూరుడైన వాడు 540

అన్నలు ఖర దూష ణాఖ్యులౌ నిర్వురు
ఖ్యాత వీర్యశాలు రాహవమున
వారి నెల్ల రామ! మీరి వర్తిలు దాన
ప్రథమ దర్శనమున భావ మూని
భర్తగాగ నెంచి పరమ పురుష నిన్ను
నేను చేరుకొన్న దాన నిపుడు 541

పలు ప్రభావ సంపదలు గలదాన నే
నిచ్చ కొలది బల్మి నేగుదాన
నీవు భర్త వగుమ యెప్పటికిని నాకు
సీత తోడ నేమి సేయు దీవు? 542

వికృత రూపిణియును వికటాంగి యగు నీమె
నీకు తగిన జోడు కాక యుండు
నీకు తగిన దాన నేనేను నన్నీవు
భార్య యనెడు బుద్ధి బరపి చూడు 543

ఈ విరూప నసతి నీ నిర్ణతోదరి
నీ కరాళ గాత్రి నీ మనుష్య
వనిత నిపుడె నేను భక్షించు దాన నీ
భ్రాత యితని తోడ పాటు గాగ 544

అంత నరసి క్రౌంచ నచల శృంగమ్ముల
వివిధ దర్శనీయ విపినములను
స్వామి! నన్ను గూడి సంచరింతువు దండ
కా వనమ్ము నెల్ల కడల నింక" 545

అంచు నిట్లు పల్కు నాలించి కాకుత్థ్సు
డుద్దవిడిగ నవ్వి యొక్క పెట్ట
ఇట్టు లంచును మదిరేక్షణ తోడుత
వాక్య కోవిదుండు పల్క దొడగె 546

## (18 వ సర్గ)

పదపడి దృఢ కామ పాశావపాశిత
జూచి రాఘవుండు శూర్పణఖను
చెప్పె నిట్టు లంచు స్మిత పూర్వకమ్ముగా
స్వచ్ఛమైన మృదుల వచనములను: 547

"ఏను దేవి! పరిగృహీత దారుండ నా
కీమె కూర్చునట్టి యామె భార్య
నిన్ను బోలునట్టి నెలతుకలకు కడు
దుఃఖ మౌను సవతి తోడి మనికి 548

భ్రాత నాకు ననుజు డీతడు ప్రియదర్శ
నుండు సాధు వర్తనుండు నకృత
దారుడౌ సుమిత్ర తనయుండు వీర్యవం
తుండు శ్రీయుతుం డితండు పడతి! 549

తరుణు డీతడు ప్రియదర్శనుండు నపూర్వ
భార్య జేకొనంగ వలయు వాడు
నగు నితండు నీకు ననురూపుడౌ భర్త
యేపు మీరు నిట్టి రూపమునకు 550

ఇతని జేరి కొలువుమీ విశాలాక్షి! నా
భ్రాత నితని నీకు భర్తగాగ
నీకు సవతి యెవతె లేక వరారోహ!
తరణి కాంతి మేరు గిరిని బోలె" 551

రాము డిట్టు లంచు నామెతో వచియింప
కామ మోహిత యగు నామె యసుర
విడిచిపుచ్చి రాము వేవేగ నంతట
లక్ష్మణునకు నిట్టు లని వచించె : 552

"ఇట్టి రూపమునకు నే నీకు దగుదాన
మేలి వన్నె దాన నాలుగాగ
నన్ను గూడి సుఖమునన్ దండకారణ్య
మెల్ల నీవు సంచరింప గలవు" 553

రాక్షసాంగన యిటు లంచు పల్కగ లక్ష్మ
ణుండు వాక్య కోవిదుండు నంత
నవ్వు దోప శూర్పణఖ తోడ సౌమిత్రి
పల్కె యుక్తమైన పల్కు లిట్లు: 554

"దాసుడైన నాకు దారవై దాసివౌ
టిచ్ఛగించు దాన వెట్లు నీవు?
ఇట్టి వాడ నేను భృత్యుండ నార్యుడౌ
భ్రాత కంబుజాత వర్ణ గాత్రి! 555

సమ్మదమ్మునన్ విశాలాక్షి! సిద్ధార్థ
వమల వర్ణ కాంతి నలరు దాన
వీవు నార్యునకు సమృద్ధార్థునకు చిన్న
భార్య వగుమ నాదు పల్కు వినుమ 556

ఈ విరూప నసతి నీ నిర్ణతోదరి
నీ కరాళ గాత్రి వృద్ధురాలి
భార్య విడచిపుచ్చి వైచి యీతడు నిన్ను
మాత్ర కొలుచుచుండి మన గలాడు 557

మేలి తెరగు రూప మిది చక్క పోద్రోచి
మేలి వన్నె మీరు మేని దాన!
యే వివేకవంతు డేని వరారోహ!
మనుజ కాంత లెడల మనసు పడునె?" 558

అంచు లక్ష్మణుండు నామెతో పల్కంగ
తలచె వాని పల్కు తథ్య మంచు
నా కరాళ గాత్రి యా నిర్ణతోదరి
తా నెరుంగక యెగతాళి పల్కు 559

కామమోహిత యగు నామె యిట్లు వచించె
రాఘవునకు నా పరంతపునకు
భార్య సీతతోడ పర్ణశాలను గూరు
చున్న యప్రధృష్య శూరునకును: 560

"ఈ విరూప నసతి నీ నిర్ణతోదరి
నీ కరాళ గాత్రి వృద్ధురాలి
భార్య నీమె బట్టి ప్రాకులాడుచును మ
న్నింవ కున్నవాడ వీవు నన్ను 561

నేను మెసవుదాన నీ మానుషాంగన
నీవు గాంచుచుండ నీమె నిపుడె
నే చరించుదాన నీతోడ గూడి యే
సవతు లేక యుండ సౌఖ్య మార" 562

ఇట్టు లంచు బల్కి మృగ శాబ లోచన
మీది కురికె కనలు మీర నామె
కొరవి నిప్పు లట్లు మెరయు కన్నులయామె
రోహిణిన్ మహోల్క రొప్పునట్లు 563

* శూర్పణఖ ముక్కు చెవులు కోయుట *

మృత్యు పాశ సదృశ మీదికి నురికెడు
దాని దాని గాంచి దాశరథియు
నిలువరించి మహిత బలుడు కోపమ్మున
లక్ష్మణునకు నిట్టు లని వచించె: 564

"క్రూరులైన మొరటు వారితో సౌమిత్రి!
యెక్కసక్కె మాడ నెట్టులైన
గా దిరెట్టులైన గాని వైదేహి జీ
వించునట్లు చూడు మీవు సౌమ్య! 565

ఈ విరూప నసతి నెంతయు మదియించి
యున్న దాని నీ మహోదరి దను
జాంగన నిక పురుష శార్దూలుడా! నీవు
వికృత రూప మొనగి విడిచి పెట్టు" 566

అని వచింప లక్ష్మణున కది విని మహా
బలుడు వాడు రాము పార్శ్వమందె
కనలు గొన్నవాడు ఖడ్గమ్ము పైకెత్తి
చెక్కివైచె దాని ముక్కు చెవులు 567

ముక్కు చెవులు తునిగి పోవగా నదియును
వికృత రవము చెలగ వెఱ్ఱి కేక
లిడుచు పరుపు వారె నేగుదెంచిన యట్లె
ఘోర శూర్పణఖయు ఘోరడవికి 568

ఆమె వికృత రూప యతి ఘోర రూపిణి
రక్త సిక్త యైన రాక్షసియును
బరపె బిట్టు రొదల పలు తెరంగులు గాగ
ప్రావృషేణ్య వారివహము నట్లు 569

ఓడుచుండ నెత్తు రొడల పెక్కెడలనా
ఘోర దర్శన యగు క్రూర దైత్య
బాహు యుగ్మకమ్ము పైకెత్తి గర్జించు
చున్ మహా వనమ్ము జొచ్చె నపుడు 570

అంత నామె విరూపిత యసుర సంఘ
సంవృతుండైన ఖరు జనస్థాన గతుని
భ్రాత నుగ్ర దర్శనుని చేరంగ నరిగి
పడియె పుడమిని దివినుండి పిడుగు వోలె 571

లక్ష్మణుని తోడ భార్యతో రాఘవుండు
వనికి వచ్చుట తన విరూపణము నంత
శోణితోక్షత భయ మోహ శోషితాంగి
సహజ ఖరునకు నెరిగించె సర్వ మామె 572

## (19 వ సర్గ)

అట్లు పడిన దాని నామె విరూపను
శోణి తావసిక్త జూచి భగిని
ఖరుడు రాక్ష సాగ్రసరుడు క్రోధమ్మున
నుడుకుచున్న యాత డడిగె నిట్లు: 573

* ఖరాదులకు శూర్పణఖ తన భంగపాటు మొరపెట్టుకొనుట *

"లెమ్ము చెప్పుము వివరమ్ముగా నంతయు
విడుము జడిమ చిత్త విభ్రమమ్ము
ఎవడు వాడు నిన్ను నిట్టి రూపొంద వి
రూప జేసె తెల్పుమా పనుపడ? 574

ఎవడు వాడు ఘోర కృష్ణ సర్పమ్ము నే
పావ మెరుగకుండ బండి యున్న
దాని విషము జిమ్ముదాని ముంగట నల
వోకగా మొనవ్రేల పొడుచు వాడు? 575

ఎవడు వాడు కాల పాశము మతి దప్పి
కుత్తుకం దగిల్చి కొని యెరుంగ
కున్న వాడు నేడు నిన్ను జేరగ వచ్చి
ఘోర తర విషమ్ము గ్రోలినాడు? 576

కామ గతిని గల్గి కామ రూపిణి వయి
బల పరాక్రమవతివైన నిన్ను
నంతకోపమానవై యరిగిన దాని
నీ యవస కీడ్చె నెవడు వాడు? 577

అఖిల భూత సమితి నసుర గంధర్వుల
మహిత చిత్తులైన మౌని జనుల
నెవడు వాడు నిన్ను నిట్లు విరూప గా
వించి యున్నవాడు వీర్యశాలి? 578

లోకమందు కానరాకుండె నెవ్వాడు
నాకు విప్రియ మ్మొనర్చు వాడు
ఆ సహస్ర నయను డైన మహేంద్రుడు
పాకశాసనుండు కాక యింక? 579

జీవితాంతకమ్ములౌ విశిఖమ్ముల
నేను నేడు వాని ప్రాణములను
గొనెదు వాడ సలిలమును బెరసిన పాల
నంతవట్టు నాను హంస యట్లు 580

అమ్మ లేచి క్రుమ్మ నాయమ్మ లుచ్చిపో
నేయ నేను కలన నీల్గి నతని
దెవని నురుగు జిమ్మ నెత్రని నెత్తురు
నుర్వి యింక త్రావ నున్న దొక్కొ? 581

ఎవని మేనినుండి యెరచి వెల్వడ బీకి
కూడి విహగ గణము కూరుచుండి
పరమ హర్ష యుక్తి భక్షించునో కదా
నేల గూల్చ నేను నాలమందు? 582

కావజాలు వారు కారు గంధర్వులు
నిర్జరుల్ పిశాచ నిచయమైన
నసురు లైన నింక ననిలోన నా చేత
జిక్కి నతని దిక్కు దక్కి నతని 583

మెల్ల తెలివి నొంది తెల్లమ్ముగా నాకు
వాని నెరుగ జెప్ప వలయు నీవు
నెవడు దుర్వినీతు డిట్టులు వనమున
నగడు పరచె నిన్ను పొగరు మిగిలి?" 584

అంచు నన్న మిగుల నల్కగొ న్నాతండు
పల్క నాలకించి వాని పల్కు
నంత శూర్పణఖయు నశ్రు పూరము వార
పల్కె నిట్టు లంచు వాని తోడ : 585

"పరువమైన వారు వర రూపవంతులు
మహిత బలురును సుకుమార తనులు
స్వచ్ఛ సరసిజాత సదృశాయతాక్షులు
వల్కలాజిన కృత వాససులును 586

పరమ దాంతి యుతులు ఫల మూల భోజనుల్
ధర్మ వర్తనలును తాపసులును
దశరథావనీశు తనయులు రామ ల
క్ష్మణులు సోదరులు ప్రశస్త గుణులు 587

అవనినాథ లక్షణాన్వితుల్ గంధర్వ
రాజ సన్నిభులుగ తేజరిల్లు
వార లమర వరులొ వారలు మనుజులో
ఊహ సేయు పనికి నుత్సహింప 588

పరువమైన వయసు వర రూపవతి సర్వ
భూషణోత్క రాభిభూషితాంగి
వా రిరువురి మధ్య వారి సుమధ్యమ
కాన నచట నాకు కానబడియె 589

కడగి యా ప్రమదయె కారణ మౌటచే
కూడి వా రిరువురు గూడ నన్ను
నిట్టు లీ యవస్థ కీడ్చిన వారలు
దిక్కు లేని కులట చక్కి గాగ 590

దారి తప్పి నడచు దాని నెత్తురును నా
చచ్చినట్టి వారి పచ్చి నెత్రు
నెగయుచుండ నురుగు నే నని మొన గ్రోల
వలయు నంచు నిచ్చ గలదు నాకు 591

ఇదియె నాదు మొట్ట మొదటి కోరిక తండ్రి!
దీని నిపుడు నీవు తీర్పవలయు
త్రావవలయు నేను దాని రక్తమ్మును
వారి రక్త మాహవమ్ము నందు" 592

*** పదునలువురు రాక్షసుల వధ ***

అంచు నామెయున్ వచించు నంతటిలోన
పదునలువురు మహిత బల సమేతు
లంతకోపమానులౌ రాక్షస వీరుల
పనిచె నిట్లు ఖరుడు కనలు మీర : 593

"అలఘు శస్త్ర సంపదాఢ్యు లిర్వురు నరుల్
వల్క లాజిన కృత వాససులును
వచ్చి చొచ్చియున్నవారు ఘోరమ్మైన
దండకా వనమ్ము తరుణి తోడ 594

రూపు మాపి వారిరువుర నా దుర్వృత్త
నిటకు తొలగ గొంచు నేగు డెండు
ఈమె నా సహోదరీ మతల్లియు వారి
శోణితమ్ము బట్టి యానగలదు 595

ఈ మనోరథ మిది యిష్టమౌ నా సహో
దరికి నీమె కిపుడు దైత్యులార!
సత్వరమ్ముగ నిది సమకూర్పు డవ్వారి
బిట్టు కలచి స్వీయ వీర్య యుక్తి" 596

పనుపు నిట్టులంచు పడసిన వారలు
వార లసుర వరులు పదునలువురు
నరిగి రచటి కప్పు డామెతోడుత గూడి
మారు తేరితాఁకి వార మట్లు 597

అంతటి నిశాత విశిఖులౌ నసురులైన
నతని సముదగ్ర తేజు డౌనట్టివాని
వారు వ్రేల్మిడి నణగింప నేర రైరి
పేర్చి చెలగిన శిఖి వనద్విపము లట్లు 598

## (20 వ సర్గ)

అంత ఘోర రూప యైన శూర్పణఖ రా
మాశ్రమమ్ము చేర నరుగుదెంచి
సీత తోడ గూడ భ్రాత లిర్వురి వారి
దెలియ జెప్పె రాక్షసులకు నామె 599

పొరజూచి రచట వార లా రాక్షసు
లలఘు సత్త్వశాలి యైన రాము
జేరి పర్ణశాల గూరుచున్నాతని
సీతతో సుమిత్ర సూతి తోడ 600

వచ్చియున్నవారి వారి నా రాక్షసి
శ్రీ యుతుండు రఘుకులేశు దరసి
భ్రాత లక్ష్మణునకు ప్రజ్జ్వల త్తేజున
కనియె రాము డిట్టు లనుచు నపుడు : 601

"సీత నేమర కిట చెంగట సౌమిత్రి!
యొక మూహూర్త కాల ముండు మీవు
దీని దారి నేగుదెంచిన వారిని
వీరి నురుము సేసి విడచు వాడ" 602

వినియు పల్కు లివియు విదితాత్ముడౌ రాము
డాడినవి యతండు 'నట్లె' యంచు
లక్ష్మణుండు నపుడు రాముని పల్కు మ
న్నించి యా విధమున నెరపుచుండె 603

అలఘు కార్ముకమ్ము హాట కాలంకృత
మైనదాని రాఘవాన్వయుండు
ధర్మమూర్తి సజ్జిత మ్మొనరించి యా
రాక్షసులకు నిట్టు లని వచించె: 604

"దశరథావనీశు తనయుల మన్న ద
మ్ములము రామ లక్ష్మణులము మేము
సీతతోడ గూడి యేతెంచితిమి తిరు
గంగ రాని దండకాటవికిని 605

పండ్లు దుంపలు తిను వారమై దాంతిమై
ధర్మ వర్తనమున తపము మాని
దండకా వనమున నుండువారిని మమ్మ
నిట్లు బాధపెట్ట నేటి కీరు? 606

పరమ ఘాతుకులను పాపాత్మకుల మిమ్మ
సమర రంగమందు చంపుటకయి
మౌనివర నియోగ మూని వచ్చిన వాడ
శస్త్ర చాప బాణ సహితుడ నయి 607

నిలుడు మీర లిచట నిర్భర సంతుష్టి
తలగి చనుట యింక తగదు మీకు
నాస యున్న యట్టులైన ప్రాణములపై
మరలి చనుడు రాత్రి చరులు వేగ" 608

అతని పల్కు లవియు నాలించినంతనే
పలికి రిట్టు లంచు పదునలువురు
రాక్షసాగ్రసరులు బ్రహ్మఘ్నులౌ వారు
శూలపాణు లలుక జూడు వారు 609

"మాకు నధిపుడౌ సుమహితాత్మునకు ఖరా
సురుని కలుక వొడము కరణి జేసి
బవరమందు కొట్టువడి నేడు మా వల్ల
నుసురు లొడల నుడుగ నుందు వీవు 610

యుద్ధరంగ మందు నొక్కనికి న్నీకు
నెదిరి నిల్వనైన నెక్కడిదొకొ
శక్తి మాకు బహుళ సంఖ్యాకులకు నిప్పు
డింక కలన పోరు చేటి మాట? 611

రమ్ము మా వలన కర ప్రయుక్త పరిఘ
శూల పట్టసులగు శూరవరుల
వలన కేలి విల్లు ప్రాణముల్ వీర్యమ్ము
తలగ ద్రోయ సేత తప్ప దిపుడు" 612

ఇట్టు లని వచించి యెంతయు క్రుద్ధులై
వారు దైత్యవరులు పదునలువురు
బిట్టు శూలములను విసరివైచిరి దుర్జ
యుడగు రాఘవాన్వయోద్భవు పయి 613

శూలములను వాని లీల కాకుత్థ్సుండు
పదియు నాలుగింటి వాని నెల్ల
స్వర్ణ భూషితముల శరముల నన్నింటి
తోడనే కడు వడి దునియ నేసె 614

అంత పిమ్మటన్ మహాతేజు డాతండు
భాస్కరాభము లగు బాణములను
పదియు నాలుగింటి ప్రస్తర చ్ఛిదముల
కినుక యినుమడింప కేల గొనియె 615

కరమునన్ గ్రహించి కార్ముక మెక్కిడి
లక్ష్యమైన దైత్యరాజి పైన
బాణములను రాఘవాన్వయుం డేసెను
వజ్రములను నాకభర్త వోలె 616

కనక పుంఖ సహిత కాంచనాలంకృత
జ్వలిత తేజసాత్త శర చయమ్ము
ప్రక్కలించి వేగ రాక్షస వక్షముల్
తత్కవోష్ణ రుధిర ధార మున్గి
బయలు వెడలి పుడమి పగిలిచి లో జొచ్చె
నశని నిస్వనమ్ము లడర నపుడు 617

వారు పడిరి పుడమిపై భిన్న హృదయులై
ఛిన్న మూలము లగు చెట్ల వోలె
శోణితార్ద్రమైన మేనుల వికృత రూ
పముల వీడి చనిన ప్రాణములను 618

వారి పుడమి బడిన వారిని గన్గొని
యలుక నొడ లెరుంగ కసుర కాంత
యడలు గడలు కొనగ నచ్చోట మరలంగ
భైరవారవముల బరగ జేసె 619

ఆమె మరల బొబ్బ లార్చుకొంచును జవ
మార శూర్పణఖయు మరల జేర
నరిగి ఖరుని చెంత కామెయు నించుక
పైపయి తడియారవారు రక్త
మార్ద్ర యగుచు పడియె నాతని ముంగట
బంక లొలయుచున్న వల్లి వోలె 620

భ్రాత చెంత నామె పరమ శోకార్తయై
యులివు పాట పాట వెలువరించె
కనుల వెంట నీరు కార్చె నెల్లు చెలంగ
విన్ననైన మోము వన్నె దప్ప 621

రణ నిపాతితులను గాంచి రాక్షసులను
పరువిడిన శూర్పణఖయును మరలి యటకు
నా యసురు లెల్లర వధమ్ము నంతవట్టు
ఖరున కాయమ సోదరి యెరుక పరచె 622

## (21 వ సర్గ)

అతడు మరల పడిన యా శూర్పణఖ నన
ర్థార్థ మరుగు దెంచినట్టి దాని
గాంచి కనలు గొన్న ఖరు డిట్టు లని పల్కె
స్పష్టమైన రీతి పల్కు లెసగ : 623

### * శూర్పణఖ ఖరుని పురికొల్పుట *

"నేను నీ ప్రియమ్ము నెరప నిప్పుడె గదా
పనిచియున్న వాడ వారి శూర
వరుల నల్ల ద్రావు వారి రాక్షసులను
ఏటి కిట్లు మరల నేడ్వ నీవు ? 624

భక్తులుం గడు ననురక్తులున్ హితులును
వీరు నాకు నెల్లవేళలందు
చంపువారె కాని చచ్చువారలు కారు
చేయకుండ రేను చెప్పినయది 625

ఇదియు నేమి వినగ నిచ్ఛగించుచు నుంటి
నేమి కారణమున నీవు మరల
నార్పు లిడుచు నిట్లు 'హా! నాథ!' యంచును
పాము వోలె నేలపై బొరలెదు? 626

దిక్కు లేని యట్లు వెక్కి యేడ్చెద వేల
నేను దిక్కు గాగ నిలిచి యుండ
లెమ్ము లెమ్ము వలవ దిమ్మెయి భయమంద
విక్లబత్వ మింక విడువు మీవు" 627

ఇట్టు లంచు పల్కు లెసగ నా దుర్ధర్ష
నెంతయు ఖరు డూరడించినంత
కనుల నురలు నీరు కడకొత్తి యామెయు
భ్రాత ఖరునితోడ పలికె నిట్లు : 628

"జొను వచ్చియున్న దాన నిప్పుడు నేను
ముక్కు చెవులు కోలుపోయి యిటకు
నురలు రుధిర ధార నొడలెల్ల తడియగా
నీవు నన్ను నూరడించినావు 629

పంపియుంటి వీవు పదునాల్గు మందిని
వీర రాక్షసులను వారి కనలి
రఘు కుమారు నతని లక్ష్మణుతో గూడ
నేల గూల్ప ప్రియము నెరప నాకు 630

వారలైన శూల పట్టస పాణులు
నలుక రెట్టి గొన్న యట్టివారు
సమర రంగమందు చచ్చి రెల్లరు రాము
విశిఖములను మర్మ భేదకముల 631

ఒక్క క్షణములోనె యుర్వీ తలమ్ముపై
బడినవారి మహిత బలుర గాంచి
యరసి చూచి రాము నా మహత్కార్యమ్ము
బెదరు ముమ్మరముగ గదిరె నాకు 632

నన్ను భయము గ్రమ్ముకొన్నది రాత్రించ
రాగ్రణీ! విషాద మందియుంటి
మరల వచ్చి నిన్ను శరణమ్ము జొచ్చితి
నెల్లెడల భయమ్మె యెదుట గాంచి 633

ఘన విషాద నక్ర గర్భితమై పరి
త్రాస వీచికాన్వితమ్ము నైన
విపుల శోక జలధి వినిలీననై యున్న
నన్ను నేల కావ వన్న! నీవు 634

పీరె దైత్య వరులు పిశితాశనులు నన్ను
ననుసరించి వచ్చినట్టి వారు
పడినవార లచట పుడమి రాముని చేత
నిశిత తీవ్ర బాణ నిహతు లగుచు 635

ఉన్న యెడల జాలి యన్నది నా యెడ
నా నిశాచరు లెడ నైన గూడ
రాముతో నిశాచరా! సాటిగా శక్తి
తేజమైన నున్న దేని నీకు
చంపు మీవు దైత్య జన కంటకుం డగు
వాని దండకా నివాసు నతని 636

నేడు చంపకుండు వాడవయే నీవు
రాము నా యమిత్రు నేమి యైన
ప్రాణములను విడిచి వైతు నీ యెదుటనే
అన్న! లజ్జ యుడిగి యున్న దాన 637

తలపులోన గాంచుదాన నే నీవు సం
గ్రామ రంగమందు రాము మహిత
చిత్తు ముందర నెదురెత్తి నిల్చుండగా
జాల వఖిల సైన్య సహిత మైన 638

శూరమాని పీవు శూరుండవే కావు
యెరవు కల్ల మగటిమేను నీది
రామ లక్ష్మణు లను నా మానవుల నిరు
వురను చంపజాల కుంట నీవు 639

రాముతో నిశాచరా! సాటిగా శక్తి
తేజ మైన నున్నదేని నీకు
నతని నీవు దండకారణ్య నిలయుడౌ
వాని గూల్చుము కుల పాంసనుండ! 640

విగత సత్త్వుఁ డల్ప వీర్యుండునౌ నీకు
నిచట వాస ముండు టెట్టి దొక్కొ?
తొలఁగి పొమ్ము నీవు తోడ్తో జనస్థాన
మహిని వీడి బంధు సహితముగను 641

ఈవు సత్వర గతి నిక రామ తేజోభి
భూతు డగుచు నణఁగి పోదువు గద
దశరథావనీశు తనయుండు రాముండు
నప్రధృష్య తేజు డౌను గాదె
అతని తమ్ముఁడైన నత్యంత వీర్యుఁ డా
తండె నను విరూపిత నొనరించె" 642

ఇట్టు లంచును విలపించి పత్తెరగుల
నాయతోదరి యగు నసుర కాంత
మొత్తుకొనుచు తనదు పొట్ట చేతుల నెలు
గెత్తి యేడ్చి దుఃఖ మినుమడింప 643

## (22 వ సర్గ)

ఇట్లు శూర్పణఖయు నెంతయు నవమతి
నెరప శూరునకును ఖరున కపుడు
నుడివె నసుర వరుల నడుమ నిట్లంచును
ఖరుడు పల్కులు ఖరతరము గాగ: 644

### * ఖరుని యుద్ధ సన్నాహము *

"అలుక యిదియు నీదు నవమాన సంభవ
మలవి మీరియున్న దయ్యె నాకు
నోర్చు కొనగ రాక యున్నది యియ్యది
మిడిసి పడిన లవణ జడధి వోలె 645

మనుజుడైన రాము మగటిమిచే క్షీణ
జీవితు డని లెక్క చేయ నేను
వీడుకొనెడువాడు నేడు ప్రాణమ్ముల
నాత్మ దుశ్చరిత్ర హతుడ నూవె 646

నిలుపు కొనుము కంటి నీ రిదియున్ నీవు
తొలగ ద్రోచి పుచ్చు కళవళమ్ము
రాము డతడు యమ నిలయమున కనుజుతో
నేగ నేను నేర్పరించు వాడ 647

బవరమందు రాము పరశు ధారను నేల
కొరిగి నాతని కొన యుసురు వాని
యుష్ణ రక్త రుధిర మో రాక్షసీ! నీవు
త్రావుదాన వింక తనివి దీర" 648

ఆలకించి యా ఖరాస్య పరిచ్యుత
మైన పల్కు పరమ హర్ష మంది
యామె యపుడు రాక్షసాగ్రేసరుని భ్రాత
మరల మెచ్చుకొనియె మౌర్ఖ్యమునను 649

అట్లు తొలుత నామె తిట్లకు పాలయి
ఇప్పు డిట్లు మరల మెప్పు లంది
ఖరుడు నీ విధమ్ముగా దూషణుని తోడ
వాహినీశు తోడ పల్కె నపుడు: 650

"నాదు చిత్త మెరిగి నడచు వారిని చతు
ర్దశ సహస్ర సంఖ్య దానవులను
ఆహవమ్మున వెనుకడుగు వేయని వారి
నతుల భీమ వేగులైన వారి 651

క్రూరకర్ము లైన ఘోర రూపము వారి
కారు నల్లమబ్బు గేరు వారి
లోక హింస నాభిలోలుపు లౌవారి
విపుల బలుర నుగ్ర విక్రములను 652

ఆయతాస్యులన్ మహౌజసులౌ వారి
వ్యాఘ్రదర్పులైనవారి దర్ప
పూర్ణులైన దైత్య పుంగవులను సర్వ
సన్నహన యుతమ్ము సౌమ్య! నడపు 653

నా రథమ్ము వేగ చేర రప్పింపుము
చాపముల నమర్పు సౌమ్య! దాన
చిత్ర చిత్రమౌ విశిఖములున్ ఖడ్గముల్
వివిధ నిశిత శక్తి వితతి గూర్పు 654

దుర్వినీతుడు రఘుసూతి దురమునందు
మన్ని గొనగ పౌలస్త్యుల మహిత మతుల
ముందుకడ నే బయల్దేరి పోవుట కయి
కోరుకొనువాడ సంగ్రామ కోవిదుండ" 655

అంచు నతడు పల్కు నంతటిలోననే
అర్క వర్ణమౌ మహా రథమ్ము
వన్నె వన్నె మేలి వాజుల బన్ని యే
తేర దూషణుండు తెలియ జెప్పె 656

మేరు శిఖర సదృశ చారు రూపము దాని
తప్త కనక భూషణాప్తి దాని
స్వర్ణ చక్ర యుతము వైడూర్య మయ కూబ
రాన్వితము విశాలమైన దాని 657

మంగళములు కనకమయ మైన మత్స్యవి
తతియు పుష్పములును తరు సమితియు
శైల పక్షి సంఘ చంద్రార్క తారక
లలమి యుండగ నలరారు దాని 658

ర పతాక యుతము కరవాల యుక్తమ్ము
ంకిణీక సముదయాంకితమ్ము
ుత్తమాశ్వ యుక్తి నొప్పుచున్న రథమ్ము
నలు మీర నెక్కి ఖరుడు నపుడు 659

లకించి యాత డరదమ్మునం దుంట
యద విక్రము లగువారు దైత్య
మహాబలాఢ్యు నట్టులే దూషణు
ండ చుట్టుముట్టి యుండి రపుడు 660

ారి గాంచి ఘోర వర్మాయుధ ధ్వజా
్వితుల నెల్ల రసుర వీరవరుల
రుడు హర్షమంది యరదమ్మునం దుండి
ెల్కె హెచ్చరికగ 'పదు' డటంచు 661

యలు వెడలె ఘోర వర్మాయుధ ధ్వజ
ైన దైత్య సైన్య మదియు నెల్ల
తి రయమ్ము మీర నల బలమ్మున జన
్గాన వనమునుండి తరలి యంత 662

ుద్గరముల శూలముల పట్టసమ్ముల
ాడి మీరి యున్న పరశువులను
ేల బూనిస కరవాల చక్రమ్ముల
ాజమాన తోమరముల మరియు 663

ుతుల శక్తి తతుల నతి ఘోర పరిఘుల
ిదిదికొల గలట్టి కార్ముకముల
రిగృహీతములగు భయద దర్శనములౌ
ర గదాసి ముసల వజ్రములను 664

చేత బట్టి ఖరుని చిత్తానువర్తులౌ
భయద రూపులైన పదియు నాల్గు
వేల దానవాళి వెడలి వచ్చిరి జన
స్థాన వనమునుండి సత్వర గతి 665

పరువు వెట్టుచున్న వారి భీకర పరా
క్రమము గల్గు వారి రాక్షసులను
గాంచి యించు కంతగా పిమ్మటన్ ఖరు
స్యందనమ్ము జనియె ననుసరించి 666

అంత చిత్ర వర్ణమౌ వార్వముల మేలి
పసిడి సొమ్ము లెసగు వాని బరపె
ఖరు తలం పెరింగి గమనించి సారథి
త్వరగ బరచుచున్న యరి విఘాతి
స్యందనమ్ము తనదు చప్పుడుల్ నిండించె
నెల్ల దిశల మూల లెల్ల యెడల 667

ఖరుడు ఖర నిస్వనుడు కడు కనలు గదుర
నంతకుని యట్లు త్వరితుడై యరివధ కయి
సూతు పురికొల్పె బొబ్బిడు చుండి బిట్టు
అలఘు వాతేరితాశ్మ వర్షాభ్ర మట్లు 668

## (23 వ సర్గ)

* రణమునకు బయలు వెడలిన ఖరుడు దుర్నిమిత్తములు గాంచుట *

ఖరుడు బయలు వెడలగా జనస్థానమ్ము
నశుభ కరము శోణితాంబుపూర
మలబలమ్ము గాగ నభివర్షణము సేసె
గర్దభారుణమ్ము ఘన ఘనమ్ము 669

వాని స్యందనమున పన్ని యున్నవి మహా
జవ తురంగమములు జారి పడియె
సమ తలమ్ము పుష్ప సంకులమౌ రాజ
పథము నందు దైవ వశము చేత 670

ఎల్ల యెడల మిగుల నల్లనై యంచుల
రక్త వర్ణమై యలాత చక్ర
సన్నిభముగ దోచుచున్నదై పరివేష
మర్కు చుట్టు పట్ల నలము కొనియె 671

అంత హేమదండ వంతమై కడు సము
న్నతము నైన కేతనమ్ము చెంత
జేరి క్రమ్ముకొని సుదారుణమును మహా
కాయమైన యొక్క గ్రద్ద యుండె 672

పిశిత భక్షులు మృగ విహగ సంతతి జన
స్థానమున కదూర తలము నందు
గుంపు గూడి మొరటు గొంతులతో పెక్కు
తెరగు విస్వరముల నరచుచుండె 673

వెలుగు లీను దిశల పేరెలుంగుల ఘోర
మైన నక్కల గము లరచు చుండె
భైరవ స్వనమ్ము మీరగా నశుభము
యాతుధాన వితతి కలవడంగ 674

ఛిన్నపక్షము లగు శిఖరీంద్రముల వోలె
దొరగుచుండ రక్త తోయ ధార
ఆకస మ్మదియు ననాకాశ మొనరించె
భయద వారివాహ పంక్తి యపుడు 675

ఒడలు జలదరింప కడు దట్టమౌ నట్లు
కటిక చీకటియును గ్రమ్ముకొనియె
దిశలు విదిశలైన తెలియరా కుండగా
నెల్ల యెడల వెలుగు లెసగ కుండె 676

వెలిగె క్షతజార్ద్ర యుక్తమై విన్ను సంజె
వేళ కాకున్న ఖరున కా వేళ నెదురు
వచ్చె ఘోర మృగమ్ములు పక్షి గణము
కంక గోమాయు గృధ్రముల్ కడు భయమ్ము
గూర్చునవి యెల్ల గెడగూడి యార్చుచుండె 677

ఘోరరూపు లైన గోమాయువుల్ జ్వాల
లెగయజిమ్మ మొగము లెసగెడునవి
యాహవమున కెపుడు నపశకునమ్ములు
వచ్చె నెదురుగాగ బలమునకును 678

భాస్క రాంతికమున పరిఘా సదృశమౌ క
బంధ మొండు కానవచ్చు చుండె
కాకయున్న పర్వకాల మర్కుని రాహు
వాక్రమించుకొనె మహాగ్రహు డయి 679

వీచుచుండె గాలి పెను వేగమున తన
ప్రభను గోలుపోయె భాస్కరుండు
మింట దోచి వెలిగె మిణుగురు లట్లు తా
రా గణమ్ము రాత్రి రాకమున్నె 680

దోగియున్న మీలతో పులుంగుల తోడ
కొలకు లుండె శుష్క జలజములుగ
పూలు పండ్లు రాలిపోవగా రిక్తలై
తత్క్షణమ్ము నందు తరువు లుండె 681

గాలి లేక యుండగా చెలరేగెను
దుమ్ము జలధరారుణమ్ము గాగ
కీచు కీచు మనుచు నేచి కూయుచు నుండె
కానలోని శారికా కులమ్ము 682

పడియె నుల్క లురలి పిడుగులతో పాటు
చూడ నడలుకొల్పు చొప్పు తోడ
సంచలించె సర్వ సర్వంసహా చక్ర
మద్రి విపిన కాననాన్వితమ్ము 683

బుద్ధిమంతు డైన పూర్వ నిర్జరునకు
ఖరున కరదమందు గర్జ లెసగ
కుదురుకొన్న తనికి నదిరె వామ భుజమ్ము
వాని యెలుగు రాలుపాటు నొందె 684

కలయ నెల్ల కడల గాంచెడు వానికి
కంట నీటి జాలు క్రమ్ముకొనియె
నుదుట నొప్పి యతని కొదవె గాటమ్ముగా
మరులుకొంట నతడు మరలడయ్యె 685

ఒడలు జలదరించు వడువున రేగిన
యపశకునము లవియు నరసి చూచి
విరగ బడుచు నవ్వి ఖరు డాత డప్పుడి
ట్లనియె రాక్షసులకు నందరకును 686

"ఉత్థితమ్ములౌ మహోత్పాతముల ఘోర
దర్శనముల నెల్ల తలపు లోని
కేను గొనకయుందు వీని విక్రమమున
బల విహీనుని బలవంతు నట్లు 687

కూల నేయువాడ నేల తారల నైన
నిశిత విశిఖములను నింగి నుండి
మరణ ధర్మమొంద బరపుదు మృత్యువు
నైన చక్క నలిగితేని నేను 688

బల గర్వితు డగు వాని నా రాఘవు
నతని తమ్ము లక్ష్మణాఖ్యు నింక
చంపకుండ తీక్ష్ణ సాయకమ్ముల నేను
మరలి రాకయుండ నరుము వాడ 689

ఎవతె కారణమున నీ విపర్యయ మయ్యె
రామ లక్ష్మణులకు నామె నాదు
భగిని తృప్తకామ యగు గాక తనివార
గ్రోలి వారిరువుర రుధిర ధార 690

పొంది యుండ లేదు మున్నెచ్చటను గాని
యోటమి యన నేను యుద్ధమందు
పరగుచుండు నిదియు ప్రత్యక్షమై మీకు
కల్లలాడు వాడ గాను నేను 691

వజ్రహస్తు డైన వాని మత్తైరావ
తాధియాయిని సురనాథు నైన
కనలుఁగొన్న కలన కడతేర్చు వాడ కు
మానుష ద్వయమ్ము మాటికేల?" 692

అతని గర్జితమ్ము నాలించి యా రాక్ష
సేంద్రు నగ్గలంపు సేన యదియు
పడసె సాటి లేని పరమ హర్షమ్మును
ప్రబల మృత్యు పాశ బద్ధ మగుచు 693

కదన దర్శనాభికాంక్షు లౌవారు మ
హాత్ములు సమకూడి రచట నపుడు
ఋషి వరాగ్రసరులు త్రిదశ గంధర్వులు
చారణులును సిద్ధ జనులు తాము
గూడిమాడి పల్కికొని రొండొరుల తోడ
పరమ పుణ్య కర్మపరులు వారు 694

"కొరలు గాత స్వస్తి గో బ్రాహ్మణులకు లో
కముల మేలు గూర్ప గాంచు వారి
కని పులస్త్య కులజులౌ నిశాచరుల రా
ఘవు డణంచి జయము గాంచు గాత! 695

రణమునందు సర్వ రాక్షస సింహుల
నణచినట్టి చక్రహస్తు నట్టు"
లనుచు పెక్కు తెరగులైన విట్టివె యింక
పలుకుచుండి రపుడు పరమ ఋషులు 696

కౌతుక మ్మెడంద గదురగా నచ్చో వి
మాన సంస్థులౌ సుమనసు లెల్ల
రరసి రపుడు నడచు నసుర సైన్యమ్మను
విగత జీవితమ్ము వింటనుండి 697

వెడలి వచ్చె తేర విపులోగ్ర సైన్యాభి
యుక్తు డగుచు ఖరుడు నురవడిగను
వెడలి వచ్చి రంత పెక్కురు రాక్షసుల్
వాని రాక్షసాధిపతిని గాంచి 698

కాల కార్ముకుండు కరవీర నయనుండు
యజ్ఞ శత్రుడున్ విహంగముండు
దుర్జయుండు మరి పృథుగ్రీవుడున్ శ్యేన
గామి యట్లె పరుష నామకుండు 699

మహితమాలి మేఘమాలి సర్వాస్యుడు
రక్త భోజనుండు రాత్రి చరులు
ప్రబల వీర్యయుతులు పండ్రెండుగురు ఖరు
నలమి వెడలి రపుడు బలసి కొలిచి 700

అసుర పుంగవులు మహా కపాలుడు స్థూల
నయనుడున్ ప్రమాథి నామకుండు
నట్లె త్రిశిరు డేగి రా దూషణుని వెంబ
డించి సైన్యనాథు లీ నలువురు 701

ఆ శయద వేగయును సమరాభికామ
విపుల బలయైన రాక్షస వీర సేన
చెచ్చెరన్ రాజపుత్రుల జేర జనియె
చంద్ర సూర్యుల గ్రహముల చంద మొప్ప 702

## (24 వ సర్గ)

ఖర పరాక్రముండు ఖరు డాత డాశ్రమ
పదము చెంత జేరవచ్చి నంత
నరసి చూచె నవియె యౌత్పాతికమ్ములు
రాఘవాన్వయుండు భ్రాత తోడ 703

### * రాముని యుద్ధ సన్నాహము *

ఉత్థితమ్ము లైన యుత్పాతముల ఘోర
మైన వాని రోమహర్షణముల
ప్రజకు కీడు గూర్చువాని గనుంగొని
లక్ష్మణునకు నిట్టు లని వచించె:  704

"అరయు మీని నో మహాబాహూ! సర్వ భూ
తాపహారకమ్ము లైన యీ స
ముత్థితమ్ములౌ మహోత్పాతముల సంహ
రింప రాక్షస గణ మెల్ల వారి 705

మింట నివియె చూడు మేఘముల్ రుధిర ధా
రల గురియుచు ఖర విరావములను
వెలువరించు చుండి విచరించు చున్నవి
పరుషములును గర్ధభారుణములు 706

తోచు శరము లెల్ల ధూమ సమేతమై
నాదు నాహవాభినందు లగుచు
స్వర్ణ పృష్ఠ సహిత చాపముల్ లక్ష్మణా!
కదలి యాడు చుండె కాంచు మదియె 707

వనములోన దిరుగు పక్షు లవేవియో
కూయుచున్న విచట కూరుచుండి
ముందు మనము భయము నొందువార మటంచు
ప్రాణములకె ముప్పు వచ్చు నంచు 708

సంభవించును సుమహిత సంప్రహార
మిందు శంక లేదిక శూర! యిదియె నాదు
బాహు వదరుచు మాటికి పల్కు చేర్వ
జయము మనకు శత్రున కపజయము నంచు 709

సప్రభమ్ము సుప్రసన్నమ్మునై కాను
పించు నీదు వదన బింబ మిపుడు
సమరమునకు నెత్తి చనువారి కెవ్వరి
కైన గాని కాంతిహీన మగున
యేని మోము వారి కెల్లను లక్ష్మణా!
తప్ప కగును జీవిత క్షయమ్ము 710

వినగ వచ్చుచుండె పెను రొద ఘోరమై
యార్చుచున్న రాక్షసాళి వలన
క్రూరకర్ము లైన వార లా రాక్షసుల్
మోదుచున్న భేరి మొత్తములను 711

వచ్చి పడెడు కీడు వారించు తెర గది
నెరప నగును మేలు దొరయ గోరి
మూడనున్న కీడు పొడగన్న యాతండు
నెరుక గల్గు పురుష డెవ్వ డైన 712

అందు వలన కొంచు నరిగి వైదేహిని
శరము లంది కేల చాప మూని
చెట్లు బలసి యుంట చేర దుర్గమ మైన
కొండ గుహను జేరి యుండు మీవు 713

ఎదురు తిరుగ కుండు టీ పల్కునకు నీవు
నిచ్చగించువాడ నేను వత్స!
ఒట్టు నాకు నీవు పెట్టు మడుగుల పైన
నాలసింపకుండ నడుగు మయ్య 714

పరమ శూరుడవును బలవంతుడవు నీవు
చంపు దీవు వీరి శంక లేదు
స్వయము గాగ నేనె చంపగోరుచు నుంటి
నీ నిశాచర జను లెల్ల వారి" 715

ఈ విధమ్ముగా వచింపగా రాముండు
సీతతో సుమిత్ర సూతి యంత
కార్ము కాశుగముల గైకొని దుర్గమ
మైన శైలగుహ సమాశ్రయించె 716

చేరుకొన్న యంత సీతతోడను గూడ
కొండ గుహను లక్ష్మణుండు నప్పు
డమ్మచెల్ల! యిదియెయౌ నుపాయ మ్మని
రాము డొడల దొడిగె మైమరువును 717

పావకోపమానమై వెల్గు మైమరు
వదియు దొడిగి నంత నలరుచుండె
రాము డతడు ధూమరహితమై చీకటి
జెలగు చున్న యగ్ని శిఖను బోలె 718

ఆత డెత్తిపట్టి యతి మహా చ్చాపమ్మ
విశిఖములను పూని వీర్య యుతుడు
పాదుకొల్పి యుండె పదము లచ్చట గుణ
ధ్వనులు నింపుచుండి దశ దిశలను 719

అంతటన్ మహాత్మ లమర గంధర్వులు
సిద్ధ చారణులును యుద్ధ దర్శ
నాభిలాష లగుచు నచ్చట చేరిరి
పుణ్యకర్మ లైన మునులు మహిత
చిత్తులౌ మహర్షి సత్తముల్ జగమున
కూడి యొండొరువుల నాడి రిట్లు : 720

"కొరలు గాత స్వస్తి గో బ్రహ్మణులకు లో
కముల మేలు గూర్చ గాంచు వారి
కని పులస్త్య కులజులౌ నిశాచరుల రా
ఘవు డణంచి జయము గాంచు గాత! 721

రణమునందు సర్వ రాక్షస సింహుల
నణచినట్టి చక్రహస్తు నట్టు"
లనుచు నిట్లు మరల నని రిట్టు లొండొరు
వంక వారు తేరిపార జూచి 722

"భయద కర్మలైన వారలు రాక్షసుల్
వీరె పదియు నాల్గు వేల మంది
ఒక్కరుండె రాము డున్నాడు ధర్మాత్మ
డెట్టు లగునొ యుద్ధ మింక మీద" 723

అంచు రాజ ఋషులు నవనీసు రాగ్రణుల్
సగణముగను సిద్ధ జనులు నుండి
రెదల కౌతుకమ్మ గదుర విమాన సం
స్థితులు నైన సర్వ దేవతలును 724

అతని నిద్ధతేజ మావహించిన వాని
ననిమొన న్నిలిచిన యతని రాము
గాంచి సర్వ భూత గణములు భయమున
నదిరి పడియె నప్పు డట్టి యెడల 725

అనుపమాన మైన దారూప మక్లిష్ట
కర్మ డైన రాము క్రమ రూప
మలుక గొన్న వేళ నా రూపము పినాక
మూని యున్న రుద్రు వోలె నుండె 726

అంత గంభీర నిర్హ్రాదవంత మగుచు
ఘోర వర్మాయుధ ధ్వజ ధారియైన
యాతుధాన సైన్య మ్మది యన్ని యెడల
కనుల ముందర నచ్చట కానవచ్చె 727

చెలగ జేయు వారు సింహ నాదమ్ముల
నొండొరువుల నార్చుచుండు వారు
చాపువారు మహిత చాపముల్ మిక్కిలి
మిట్టిపడెడు వారు నట్టి సేన 728

దుందుభుల నణంగ ద్రొబ్బెడు నంతటి
విప్రఘుష్ట రవము వెల్చుచున్న
వారి సుతుములమ్ము నారావ మయ్యది
నింపె తద్వనమ్ము నిర్భరముగ 729

ఆ నినాదమునకు నదలెత్తి కానన
చరము లైన యట్టి శ్వాపదములు
పారె నులివు లేని పట్టు జేరెడు దాక
వెనుక తట్టు తిరిగి కనుగొనకయె 730

సేన యయ్యదియును చేత దాల్చిన వివి
ధాయుధముల తోడ నలరెడునది
యబ్ధి వలె గభీర మైనది కడు వేగ
మార రాము కడకు జేర వచ్చె 731

కనుల బరపి యెల్ల కడల రాముడు రఘు
వంశ జాతుడు రణ పండితుండు
కాంచె ఖరుని సేన కదనాభిముఖముగా
రెచ్చి పెచ్చు పెరిగి వచ్చు దాని 732

సాగ దీసి భయద చాపమ్ము పొదినుండి
వెలికి దీసి తీవ్ర విశిఖములను
తెచ్చి పెట్టుకొనియె తీవ్రమౌ క్రోధమ్ము
సర్వ రాక్షసులను చంపు కొరకు 733

కనలు గొన్న వాడు కనరాని వా డయ్యె
ప్రజ్వలించు కాల వహ్ని వోలె
నరసి యిద్ధ తేజ మావహించిన వాని
నురికెను వన దేవతోత్కరమ్ము 734

అలుక గొన్న వాని దా రాము రూపమ్ము
కన్ను దోయి కపుడు కానబడియె
దక్షు నధ్వరమ్ము ధ్వంసమ్ము సేయ నె
త్తిన పినాకపాణి తీరుగాగ 735

అతని నిద్ధతేజ మావహించిన వాని
నని మొన న్నిలిచిన యతని రాము
గాంచి సర్వ భూత గణములు భయమున
నుదిలకొనుచు పరచి యురుక జొచె 736

ధనువులును భూషణమ్ములు ధ్వజము లొప్ప
వహ్ని సమ వర్ణమైన యా వర్మములును
పిశిత భుక్కుల యా సేన వెలయు చుండె
సవితృ నుదయాన నీలాభ్ర సంఘ మట్లు 237

## (25 వ సర్గ)

కార్ముకమ్ము కేల గైకొన్న రాముని
కనలి నాతని రిపుఘాతి నతని
గాంచె నాశ్రమమ్ము కడకు వచ్చిన యంత
ఖరుడు తనదు నగ్రగసరులతోడ 738

### * రాక్షసులతో సంకుల సమరము *

వాని గాంచి ధనువు బాణమ్ము తోడుత
నెక్కు వెట్టి కరకు టెలుగు చెలగ
'రథము నడవ నిమ్ము రామాభిముఖముగా'
నంచు హెచ్చరించె నతడు సూతు 739

ఖరుని యాజ్ఞ బట్టి గడపెను సూతుండు
వారువముల మహిత బాహుడు రఘు
సత్తముండు విల్లు ఝళిపించు కొంచు తా
నొక్కరుండ నిలిచి యున్న యెడకు 740

వాని నట్టు లురికి పడువాని గన్గొని
తక్కువార లెల్ల దైత్య జనులు
నతని మంత్రి వరులు నడ్డమ్ముగా జని
రలవు మీరి బొబ్బ లార్చుకొనుచు 741

అట్టు లా నిశాచరాళి మధ్యమ్మున
నరదమందు చెలగు నతడు ఖరుడు
క్రాలుచుండె తారకా గణ మధ్యమం
దుదిత మంగళునకు నుద్ది గాగ 742

అంత వేయి వాడి యమ్ముల గురిపించి
యప్రతిమ పరాక్రమాన్వితు డగు
రాము గాడ నేసి రణ రంగమున ఖరుం
డేర్చి బిట్టు బొబ్బ యార్చె నపుడు 743

అంత కనలు మిగుల నా భీమధన్వుపై
రాముపైన గెలువరాని వాని
పైన పెక్కు తెరగులౌ నాయుధముల వ
ర్షించి ముంచి రసురు లెల్లవారు 744

ప్రాసములను శూల పట్టస కరవాల
పరశు ముద్గరముల బరపి రాము
సంగరమ్ము నందు చక్కు పీడించిరి
దైత్య జనులు రోష తత్పరు లయి 745

మబ్బు బోలువారు బొబ్బ లార్చెడువారు
బలిమి గల్గువారు పరువు లిడిరి
రాముపైకి రథ తురగ గిరి కూటాభ
కరుల పైన కలన నరుమ సతని 746

అంపవాన కురిసి యా రక్కసుల గుంపు
ముంచి వైచె రాము ముమ్మరముగ
మూసి కురియుచున్న మొయిళుల గుంపులు
ప్రబల ధారల గిరివరుని బోలె 747

రాఘవుండు ఘోర రాక్షస గణ పరి
వృతుడు యాతుధాన తతివిస్పష్ట
శస్త్ర సమితి నెల్ల శరముల మార్కొనె
నదుల పెన్ ప్రవాహ ముదధి వోలె 748

అతడు ఘోరమైన యా వ్రేటులను మేను
వ్రయ్యనైన వనట బడయ డయ్యె
పదను దేరి యున్న వజ్రముల్ పెక్కింట
దెబ్బ తిన్న పర్వతేంద్రు నట్లు 749

ఆత డేటువడిన యాతడు రాఘవు
డొడల నెల్ల నెత్తు రోడుచుండ
నొప్పుచుండె రాము డప్పుడు సంధ్యాభ్ర
పరివృతుం డగు దినకరుని వోలె 750

పెక్కు వేల మంది బెరసి చుట్టున్ ముట్ట
నున్నవాని గాంచి యొంటివాని
నలమటించి రప్పు డమర గంధర్వులు
సిద్ధ జనులు తాపసేంద్ర గణము 751

అంత మండలీకృ తాయత చాపుండు
రాము డలుక యగ్గలముగ నొంది
విశిఖ శర చయమ్ము విరజిమ్మె నూరుల
కొలది గాగ వేలకొలది గాగ 752

ఆపరాని యట్టి వోపరా నట్టివి
కాల దండ తుల్య కంకపత్ర
చయ మజిహ్మగమ్ము సంగ్రామ భూమిని
బరపి పుచ్చె రాఘవాన్వయుండు 753

రాము డట్లుగా నరాతి సేనలపైన
లీల బరపిన శరజాల మదియు
స్వీకరించె రాక్షసీ జన ప్రాణముల్
కాల ముక్త పాశ జాల మట్లు 754

ప్రక్కలించి దాన వానీక గాత్రము
లా శరమ్ములు రుధిరాప్లుతమ్ము
లంతరిక్ష గతములై వెలుగొందెను
దీప్త వహ్ని తుల్య తేజ మెసగ 755

వెడలి యడచి పడియె కడు నుగ్ర మైనవి
యసుర గణము నసువు లపహరించు
సాయకోత్కరము లసంఖ్యేయములు గాగ
రాము చాప మండలమ్ము నుండి 756

వాన కార్ముకముల పడగల కొనలను
మైమరువుల గముల మస్తకముల
నాభరణ సమేతమౌ బాహు యుగముల
నూరువులను కరి కరోపమముల
జెండె రాఘవుండు ఖండనమున నూర్ల
కొలది గాగ వేల కొలది గాగ 757

సారథులను గూడి స్యందనాయుక్తమౌ
బంగరు సవరణల వారువముల
మావటీంద్ర తోడ మత్త గజమ్ముల
నట్లె రాహుతులను హయ యుతము ప
దాతి గణము సంగరాంగణమున జంపి
యమ నికేతనమున కనిచి పుచ్చె 758

వెలిచి రాత్రరవము భీకరముగ నంత
నసుర జనులు సునిశితాగ్రములును
కర్ణ రహితములుగ గ్రాలు నాశీక నా
రాచ చయము వారి వచ్చుచుండ 759

మర్మభేదులైన మార్గణముల వాడి
యైన వాన రాఘవాన్వవాయు
చేత బడుట నట్లు సేన యయ్యది కుందె
వహ్ని చేత శుష్క వనము వోలె 760

భీమబలురు దైత్య వీరులు కొందరు
అరిగి రాఘవునకు నభిముఖముగ
వైచి రతనిమీద పరమాయుధమ్ముల
శూల ఖడ్గ పరశు జాలములను

బాణములను మహిత బాహు డా శస్త్రమ్ము
లెల్లవాని నడ్డగించి రాము
డాహవమ్ము లోన నసువుల గొనియె కు
త్తుకల మొత్తములను ద్రుంచి వైచి

ఛిన్న మస్తకులును ఛిన్న వర్మేష్వాసు
లైన వార లెల్ల రవని బడిరి
వైనతేయ పక్ష వాత విక్షిప్తమై
ధరణి గూలునట్టి తరుల వోలె

అచట నున్న తక్కినట్టి వారును విషా
దాన్వితులును నైన దానవులును
ఖరుని దరియు కొరకె పరువిడి పోయిరి
శరణు జొచ్చు కొరకు శరము లలప

కూరుచు కొని మరల వారెల్లరన్ కు స
రించి దూషణుండు రెచ్చగొట్టి
తాకుదెంచె నంత కాకుత్థ్సు మీదికి
కనలి యముడు రుద్రు జెనకు నట్లు

తొలగ ద్రోచి భయము దూషణు ప్రాపున
నేగుదెంచి వార లెల్ల మగుడి
తార్కొనంగ సాల తాల శిలాయుధు
లగుచు రాము జేర నరిగి రపుడు

శూల ముద్గర చాపముల్ కేల బూని
రాక్షసుల్ మహాబలురు సంగ్రామమందు
పరగ జేసిరి శర శస్త్ర వర్షములును
వృక్ష పాషాణ సంఘాత వృష్టి లపుడు 767

రామునకును మరల రాక్షసుల్ వారికి
నద్భుతముగ రోమహర్షణముగ
సమర మయ్యె నపుడు సంకులముగ మహా
ఘోరముగను వారు క్రోధ సమభి
విష్టు లగుచు దరియ వెడలి రెల్లెడ నుండి
మరల నపుడు రఘుకుమారు పైకి 768

దైత్య గణము లుద్యత ప్రాస హస్తులు
విశిఖ వృష్టిని కురిపించు వార
లలమి బలసి యుండ నఖిల దిశలను ప్ర
దిశల వారి నెల్ల తేరి చూచి 769

పరపి యాత డంత భైరవ నాదమ్ము
నతుల బలుడు రాక్షసాళి పైన
కార్ముకమున గూర్చి గాంధర్వ నామకా
స్త్రమ్ము పరమ భాస్వరమ్ము నేసె 770

అంత వేల కొలది యమ్ముల గములు కో
దండ మండలమ్ము నుండి వెడలె
నట్లు వెడలినట్టి యమ్ములచే దచ్చి
కడల వెల్ల మూసి క్రమ్మి యుండె 771

శిత శరము లతండు చేకొనుటయు గాని
నారి లాగుటైన నారసముల
విడిచి పెట్టుటైన వీక్షింప రసురులు
కోల పోటు లొంది కుందువారు 772

చదలు కప్పివైచె సదివాకరమ్ముగా
నారసంపు టిరులు నలు గడలను
కాలు దన్నియుండె కాకుత్స్థుడా సాయ
కముల గముల వెలికి గ్రక్కనట్లు 773

ఒక్క యుమ్మడి పడుచున్న వారల తోడ
నొక్క యుమ్మడి హతి నొంది మిగుల
నొక్క యుమ్మడి పడియున్న వారల తోడ
నిండియున్న దయ్యె నేల యెల్ల 774

అడవ బడిన వారును నేల బడిన వారు
తెగి పడిన వారు తునియలై త్రెళ్ళినారు
పరెలయిన వారు సురిగిన వారు నచట
కాననైరి నిశాచరుల్ వేనవేలు 775

చీర చుట్టియున్న శీర్ష భాగములతో
కంకణముల తోడి కర చయముల
తునిగి పడిన తొడల తోడ మోకాళ్ళతో
పలు తెరగుల నగల వరుస తోడ 776

పలు తునియలుగాగ బద్ధలై పడియున్న
స్యంద నాశ్వ హస్తి చయము తోడ
పలు తెరంగులైన వ్యజన చామర వతా
కాతపత్ర సంచయమ్ము తోడ 777

బహు విచిత్ర రామ బాణాభిహత శూల
పట్టసమ్ముల కరవాలములను
పరెలు పరియ లైన ప్రాసములను వికీ
ర్ణమ్ములై పడిన పరశ్వథముల 778

పిండియైన రాతి బండలతో పెక్కు
తెరగులం దునిగిన యరిది యంప
కట్టె లలముకొన్న యట్టి యాహవ భూమి
వెరపు గొల్పునట్లు వెలయు చుండె 779

## (26 వ సర్గ)

చెండుచుండ నట్లు స్వీయ సైన్యమ్మును
గాంచి దూషణుండు కన్నులార
భయద వేగులైన వారి మహాబాహు
లను దురాసదులను రాక్షసులను
దురమునందు వెనుక దిరుగని వారల
నైదు వేల మంది నతడు పనిచె 780

వారు శూలములను పట్టసముల ఖడ్గ
ములను శైల వర్షముల ద్రుమముల
బాణ వర్షములను వానిపై కురిసి రె
ల్లెడల నుండి యప్పు డెడతెగకను 781

ప్రాణహారి యైన ప్రబలమౌ వర్షమ్ము
పాద పాశ్మజాల వర్ష మతడు
దశరథాత్మజుండు ధర్మాత్ముడు నిశాత
విశిఖ సముదయమున స్వీకరించె 782

స్వీకరించి యతడు వృష్టి యయ్యది కను
మోడ్చియున్న వృషభ మున్న యట్లు
పడసె రాఘవుండు పరమమౌ క్రోధమ్ము
సర్వ రాక్షసులను చంపుటకయి 783

అలుక పెనగొనంగ నంతట నాతండు
వెల్గు లీనునట్లు విక్రమమున
నంప గముల దూషణాన్వితమౌ సేన
యెల్ల కడల జిమ్మె వెల్లివిరియ 784

చదలు కప్పివైచె సదివాకరమ్ముగా
నారసంపు టిరులు నలు గడలను
కాలు దన్నియుండె కాకుత్థ్సుడా సాయ
కముల గముల వెలికి గ్రక్కునట్లు 773

ఒక్క యుమ్మడి పడుచున్న వారల తోడ
నొక్క యుమ్మడి హతి నొంది మిగుల
నొక్క యుమ్మడి పడియున్న వారల తోడ
నిండియున్న దయ్యె నేల యెల్ల 774

అడవ బడిన వారును నేల బడిన వారు
తెగి పడిన వారు తునియలై త్రెళ్ళినారు
పరెలయిన వారు సురిగిన వారు నచట
కాననైరి నిశాచరుల్ వేనవేలు 775

చీర చుట్టియున్న శీర్ష భాగములతో
కంకణముల తోడి కర చయముల
తునిగి పడిన తొడల తోడ మోకాళ్ళతో
పలు తెరగుల నగల వరుస తోడ 776

పలు తునియలుగాగ బ్రద్దలై పడియున్న
స్యంద నాశ్వ హస్తి చయము తోడ
పలు తెరంగులైన వ్యజన చామర పతా
కాతపత్ర సంచయమ్ము తోడ 777

బహు విచిత్ర రామ బాణాభిహత శూల
పట్టిసమ్ముల కరవాలములను
పరెలు పరియ లైన ప్రాసములను వికీ
ర్ణమ్ములై పడిన పరశ్వథముల 778

పిండియైన రాతి బండలతో ప్రెక్కు
తెరగులం దునిగిన యరిది యంప
కట్టె లలముకొన్న యట్టి యాహవ భూమి
వెరపు గొల్పునట్లు వెలయు చుండె 779

## (26 వ సర్గ)

చెండుచుండ నట్లు స్వీయ సైన్యమ్మును
గాంచి దూషణుండు కన్నులార
భయద వేగులైన వారి మహాబాహు
లను దురాసదులను రాక్షసులను
దురమునందు వెనుక దిరుగని వారల
నైదు వేల మంది నతడు పనిచె 780

వారు శూలములను పట్టసముల ఖడ్గ
ములను శైల వర్షముల ద్రుమముల
బాణ వర్షములను వానిపై కురిసి రె
ల్లెడల నుండి యప్పు డెడతెగకను 781

ప్రాణహారి యైన ప్రబలమౌ వర్షమ్ము
పాద పాశ్మ జాల వర్ష మతడు
దశరథాత్మజుండు ధర్మాత్ముడు నిశాత
విశిఖ సముదయమున స్వీకరించె 782

స్వీకరించి యతడు వృష్టి యయ్యది కను
మోడ్చియున్న వృషభ మున్న యట్లు
పడసె రాఘవుండు పరమమౌ క్రోధమ్ము
సర్వ రాక్షసులను చంపుటకయి 783

అలుక పెనగొనంగ నంతట నాతండు
వెల్గు లీనునట్లు విక్రమమున
నంప గముల దూషణాన్వితమౌ సేన
యెల్ల కడల జిమ్మె వెల్లివిరియ 784

### * దూషణ వధ *

అంత నలుక గొన్న యా సైన్య నాధుండు
దూషణుండు శత్రు దూషణుండు
వజ్ర నిభము లైన వాలమ్ములన్ ముంచె
రాఘవాన్వవాయు రాము నతని 785

మిక్కుటంపు టలుక నెక్కొన రాముండు
నంత నతని ధనువు నంపకోల
దునిమె సంగరమున తురగముల్ వీరుండు
నాలుగింటి ద్రుంచె నాలుగింట 786

సైంధవముల జంపి శాత శరమ్ముల
సారథి శిర మర్ధచంద్ర బాణ
మున హరించె రాక్షసుని యురోభాగమ్ము
గాడ నేసె మూట గాటముగను 787

భగ్న కార్ముకుండు భగ్న శతాంగుండు
నిహత సారథియును నిహత హయుడు
కేల గొనియె నతడు గిరి శృంగ సదృశమై
మెయి గగుర్పజేయు మేటి పరిఘ 788

జాతరూప పట్ట సమభివేష్టితమును
మహిత దేవ సైన్య మర్దనమ్ము
శాత తీక్ష్ణ లోహ శంకు సంకీర్ణము
పరవసోక్షిత మయి పరగెడునది
వజ్ర కులిశ సన్నిభ స్పర్శనమ్మును
పర నగర కవాట పాటకమ్ము 789

మహిత భుజగ సదృశమౌదాని పరిఘను
బవరమందు చేత బట్టి బిగ్గ
క్రూరకర్ముడైన యా రాత్రిచరుడు దూ
షణుడు రాము దరియ జనియె నురికి 790

మీది కురుకుచున్న యా దూషణుని భుజ
యుగము హస్త భూషణోల్లసితము
త్రుంచివైచె నంప దోయి నా రాముండు
ఛిన్న హస్తు నతని చేయి జారి
పడియె నెదుట కలనివలనన నిడుపారు
పరిఘ వృత్రవైరి ధ్వజము నట్లు 791

తునిగి పడిన కేలి దోయితో పాటుగా
పడియె దూషణుండు పుడమి మీద
తుత్తునియలు గాగ తునిగిపో కోరలు
ధరణి బడు మనస్వి దంతి యట్లు 792

నిహతుడై రణమున నేల గూలిన వాని
నతని దూషణు గనులార గాంచి
'మేలు మే' లటంచు మెచ్చుచు కాకుత్థ్సు
పూజ సేసె సర్వ భూతములును 793

అంత లోననె కడు నలిగిన వారలు
ముప్వు రసుర సేన మొదలియార్లు
కూడి రాము మీది కురికిరి మృత్యు పా
శావపాశితు లయినట్టి వారు 794

మహిత బలయుతుడు ప్రమాధి మహా కపా
లుండు స్థూల లోచనుండు వారు
కేల నెత్తి విపుల శూలమ్ము నా దాన
వాగ్రణియు మహా కపాలు డట్లె
పట్టసమ్ము చేత బట్టి స్థూలాక్షుడు
పరశువున్ ప్రమాధి యురికి రపుడు 795

కాంచినంత వారి కడు వేగ మీదికి
నురుకు వారి రాఘవుండు వేడి
కొనల వాడి యంపకోలల గైకొనె
నరుగుదెంచి యున్న యతిథు లట్లు 796

పరమ మార్గణముల నరకి వైచెను నేల
గూల నా మహాకపాలు శిరము
ప్రమథియించె లెక్కపట్టగా రానన్ని
మార్గణముల నా ప్రమాధి బట్టి 797

పడియె నాత డిల్గి పుడమిపై కొమ్మల
తోడి పెద్ద చెట్టు పోడిమిగను
నిశిత సాయకముల నింపె నా స్థూలాక్షు
నక్షి యుగ్మకమ్ము నా క్షణమ్మ 798

అలిగినతడు దూషణాసురు ననుయాయు
లైదు వేల మంది నసుర జనుల
నైదు వేల వాడి యంపకోలల యమ
సదనమునకు ననిచె క్షణము లోన 799

కాంచి దూషణుండు కలన నీల్గుటయును
వాని ననుసరించువారు పడుట
యానతిచ్చె నిట్టు లని ఖరుం డల్కతో
బలియులౌ తన దళవాయులకును 800

"దురమునందు కూలె దూషణు డీతండు
కూడి నడచు వారితోడ గూడ
గొప్ప సేనతోడ గూడి యుద్ధము సేసి
కుమనుజాండు రాము కోత్రలకును 801

పలు తెరంగు లగుచు బరగు శస్త్రమ్ముల
సర్వ రాక్షసులును చచ్చి పడిరి"
ఇట్టు లంచు పల్కి రెట్టించి నల్కతో
ఖరుడు రాము దరియ నురికె నపుడు 802

కాల కార్ముకుండు కరవీర నయనుండు
యజ్ఞ శత్రుడున్ విహంగముండు
దుర్జయుండు మరి పృథుగ్రీవుడున్ శ్యేన
గామి యట్లె పరుష నామకుండు
మహితమాలి మేఘమాలి సర్పాస్యుడు
రక్త భోజనుండు రాత్రిచరులు 803

వీర్య మహితులైన వీరు పన్నిద్దరు
సైన్య సహితులైన సైన్యపతులు
తాము నడచి రపుడు రాముని మీదికే
పరమ సాయకముల బరపు కొంచు 804

అంత పావకాభ మైన శరమ్ముల
భూరి కనక వజ్ర భూషితముల
బరపి బిలుకుమార్చె పరమ తేజశ్శాలి
యతని సేన దక్కినట్టి వారి 805

అసుర జన శతమ్ము నా రాఘవుం డేక
శతక కర్ణ యుక్త శర చయమున
మరి సహస్ర జనుల సరి సహస్రమ్మున
సదమదమ్ము సేసె కదన భూమి 806

వాని చేత భిన్న వర్మ విభూషణుల్
ఛిన్న భిన్న చాప శింజినులుగ
ధరణిమీద శోణితాదిగ్ధ గాత్రులై
పడిరి సర్వ దానవాళి యపుడు 807

శోణి తోక్షితమ్ము లైనవి ఖండన
భూమి పడిన యట్టి ముక్త కేశ
చయము గప్పి యుండె జ్యాతల మెల్లను
కుశల మహిత వేది కౌరలునట్లు 808

క్షణములోన రాక్షస గణమ్ము నిహతమ్ము
గాగ మహిత ఘోర కాననమ్ము
మాంస రుధిర కర్దమాన్విత మౌటచే
నిరయ తుల్య మగుచు నెగడు చుండె 809

భయద కర్ములైన వారలు రాక్షసుల్
పదియు నాల్గు వేల బలగ మెల్ల
నుక్కణంగి పోయి రొక్క రామునిచే ప
దాతిచేత మనుజ సూతి చేత 810

సేనలోన నెల్ల శేషించినది మహా
రథుడు ఖరు డొకండు రాక్షసుండు
త్రిశిరు డనెడు వాడు రెండవ వాడును
రాము డతడు పరబలార్దనుండు 811

చచ్చిపోయి రలఘు సత్త్వలు రాక్షసుల్
ఘోర దుర్విషహులు వారి మిగిలి
యున్న వారలెల్ల యుద్ధ రంగమ్మున
లక్ష్మణాగ్రజు డగు రాముచేత 812

అంత నా భీమ బలము మహాహవమున
బలియుడౌ రాముచే గూల గలయజూచి
రాము ఖరు డప్పుడే మహారథము మీద
నెదురుకొనె నుద్యతాశని ఇంద్రునట్లు 813

## (27 వ సర్గ)

రథముపైన నట్లు రామాభిముఖముగా
నరుగుచున్న వాని ఖరుని దరియ
జేరి యిట్టు లంచు జెప్పెను వాహినీ
నాథు డసుర త్రిశిర నామకుండు: 814

* త్రిశిర వధ *

"నన్ను బనుపుమయ్య మున్ను విక్రాంతుడా!
మగుడు మీవు నిట్టి తెగువ యుడిగి
చూడు మింక రాము నేడు మహాబాహు
ఖండనమ్ము లోన పడిన వాని 815

శపథ మాచరింతు సత్యమ్ము నీకు నే
నాయుధమ్ము గూడ నంటువాడ
'రాక్షసులకు నెల్లరకు వధార్హుం డైన
వాని రాము జంపువాడ' నంచు 816

ఏను వీని కనిని మృత్యు వౌటయొ కాక
ఇతడె కలన నాకు మృత్యు వౌటొ
సంగ రోత్సవమ్ము చాలించుకొని మధ్య
వర్తి వగుమ యొక ముహూర్త మీవు 817

పరమ హర్ష మొంది పయన మౌదువు జన
స్థానమునకు జచ్చె నేని రాము
డట్లు కాక నేనె హతుడైన రాముని
దరియ నేగు దీవు దుర మొనర్ప" 818

ప్రార్థన మ్మొనర్ప నా త్రిశిరుడు మృత్యు
లోభముననుు ఖరుడు లోగి యనుమ
తించె "యుద్ధ మాచరింపు మేగు" మటంచు
పోయె రాఘవాభిముఖ మతండు 819

భాస్వరమ్ము లైన వాజుల బూన్చిన
తేరిపైన నెక్కి త్రిశిరు డపుడు
దరియ నురికె రాము దురము లోపల మూడు
కొమ్ము లున్న మేటి కొండ యట్లు 820

ఆతడు పెను మబ్బు నట్టులు వాలంప
వాన జల్లు పెల్లు పరగ జేసి
నీటి చెమ్మ మబ్బు వాటమౌ దుందుభి
ధ్వాన ముద్ధురమ్ము బరపె నపుడు 821

వచ్చుచున్న దానవాగ్రేసరుని వాని
త్రిశిరు రాఘవుండు తేరిచూచి
వాని నెదురు కొనియె వాడి నారసముల
నదర విడిచి సాయకాసమున 822

రామునకును త్రిశిర రాక్షసునకు మహా
సంప్రహార మయ్యె సంకులమ్ము
మిగుల బలసి యున్న మృగరాజునకు మత్త
కుంజరమ్మునకును క్రుమ్ము వోలె 823

అంత త్రిశిరు చేతి యమ్ముల మూట ల
లాట సీమ నాత డేటువడుట
నలుక పిచ్చలింప నా రాఘవుం డల్గి
ఇట్టు లనియె కోప ముట్టిపడగ: 824

"ఔర! యసురునకు పరాక్రమ శూరున
కింత పాటి బలిమి యెసగు నాక్కొ?
ఏటు వడితి నొసట నిచ్చట నీతని
యమ్ము లిపుడు తాక నలరులట్లు 825

స్వీకరింపు నాదు నిష్వాసమౌర్వీ వి
సృష్టమైన యీ విశిఖ చయమ్ము"
నిట్టు లంచు బల్కి యేర్చిన యలుక నా
శీవిషోపమానమై వెలుంగు
ప్రదరములను నాటె పదునాలుగింటిని
క్రుద్ధు డగుచు త్రిశిరు రొమ్ము మీద 826

నాలి కణుపు లున్న నాలుగు కోలల
వాని తురగముల జవాన్వితముల
నాలుగింటి నేల గూలిచె తేజస్వి
యొనిమిదింట గూలనేసె సూతు
తేరినుండి కోల దెగనేసె రాముండు
దైత్యవరు సముచ్ఛ్రిత ధ్వజమ్ము 827

అంత భగ్నమైన యా రథమ్మునినుండి
మీది కురుకుచున్న యా దితిసుతు
నెదద గాడనేసె బెడిదంపు టమ్ముల
రాము డుడిగె చేష్ట లతడు దాన 828

అలుకగొన్న రాము డప్రమేయాత్ముండు
వాడి మీరు వేగవంత మైన
యాశుగముల మూట నా దానవాగ్రణి
తలల మూటి నేల తలగ ద్రోచె 829

వాడు నపుడు రామ బాణాభిపీడితు
డుర్వి మీద నెత్తు రోడుచుండ
పడియె మున్నె నేల బడియున్న తన యుత్త
మాంగములకు కెలన నసుర వరుడు 830

ఖరుని భటులు చావగా మిగిలిన వారు
దైత్య జనులు నంత తత్తరమున
విరిగి పారుచుండి రురక నిల్చుండక
పులికి బెదరు జింక మొత్త మట్లు 831

పారుచున్న వారి వారిని గనుగొని
ఖరుడు నల్గి స్వయముగా మగుడ్చి
చేర నురికె రఘుకుమారుని మీదికే
చంద్రు దరియు రాహు చంద మొప్ప 832

## (28 వ సర్గ)

దూరముగ్లోన నట్లు దూషణుడును త్రిశీ
ర్షుండు నేల బడుట చూచినంత
నళుకు వొడమె ఖరున కైనను రాము ప
రాక్రమమ్ము కన్నులార గాంచి 833

*** రామునితో ఖరుని ద్వంద్వ యుద్ధము ***

కాంచి యాత డెదురగా రాని రాక్షస
సేన దూషణ త్రిశిర సహితము
రాము నొకని చేతనే మడియుట మహా
బలుడు మేటి మగలు పడిన బలము
నరసి ఖరుడు పిమను డసురుడు రాముని
దాకె నముచి వజ్రి దాకునట్లు 834

వంచి కార్ముకమ్ము బల్మిమై నెత్తురు
త్రావునట్టి బెట్టిదంపు వాడి
యమ్ము లలుకగొన్న యాశీవిషము లట్లు
బరపె రాముమీద ఖరుడు పేర్చి 835

నారి పెకు్క మార్లు సారించి యస్త్రముల్
కానుపించు చుండి కరచినయవి
సమరమందు ఖరుడు స్యందనమ్మున నుండి
మార్గముల నొనర్చె మార్గణముల 836

ఆ మహారథుండు నఖిల దిశలు ప్ర
దిశలు గూడ నిశిత విశిఖములను
నింపివైచె దానినిం గాంచి నంతట
రాము డతి మహా చ్ఛరాసనుండు 837

అతడు సైపరాని యట్టి సాయకముల
సస్ఫులింగ వహ్ని సన్నిభముల
సందు లేకయుండ చదలు గావించె ప
ర్జన్యు డంబు వృష్టి సల్పినట్లు 838

ఖరుడు రాఘవుడును బరపిన కడు వాడి
మీరు నారసముల మీద నున్న
యాకస మ్మదియు ననాకాశమై యొప్పె
నమ్మ లెల్ల కడల గ్రమ్ముకొనగ 839

ఒకరి నొకరు చంప నుంకించి కిన్కతో
పోరు సల్పుచున్న వా రిరువుర
విపుల బాణజాల వృతుడైన సూర్యుండు
వెలుగు లీనకుండె వింట నపుడు 840

అంత కర్ణ రహితమైన నాళీక సా
యకముల నతి సునిశితాగ్రములను
గాడనేసె రాము ఖరుడు తోత్రమ్ముల
మత్త కుంజరమ్ము మొత్తునట్లు 841

స్యందనస్థు విపుల చాప హస్తుని దాన
వాగ్రసరుని పర్యవస్థితు డగు
నతని గాంచె నెల్ల ప్రాణి కోటియు పాశ
హస్తుడైన కాల యముని పోలె 842

సర్వ సైన్య సంఘ సంహర్తయౌ వాని
పౌరుషమున పర్యవస్థితు డగు
నలఘు సత్త్వ రాము నతి పరిశ్రాంతుగా
దలచె ఖరుడు నపుడు తన యెడంద 843

వీరు నతని సింహ విక్రాంత గామిని
మృగపు నట్లు విక్రమించి నతని
గాంచి రాఘవుండు కళవళ పడడయ్యె
చిన్న మృగము గన్న సింహ మట్లు 844

అంత సూర్య సదృశమై వెలింగెడు మహ
నీయ స్యందనమున నెగడుచుండి
ఖరుడు తాకుదెంచె కయ్యమ్మునన్ రాము
పావకునకు నెగయు పతగ మట్లు 845

అంత రాము నా మహాత్మ్మ చాపమ్మును
విశిఖ సహితముగను పిడికిలి కడ
విరుగ నేసె నపుడు ఖరుడును తన హస్త
లాఘవమ్ము జూపి రాఘవునకు 846

వాడుశ్శమరల నింక నేడమ్ములన్ శక్రు
నశనివోలె వాడియైన వాని
గొని ఖరుండు కవచమున నాటె నర్కమై
బరప నిట్లు ఖరుడు పర్వాయుక్త
మైన బాణములను వాని తాకున రాము
నర్కతేజ కవచ మవని బడియె 847

అంత నతడు రాము నప్రతిమౌజను
శర సహస్రములను బరపి ఖరుడు
గాఢ నేసి బిట్టు గాటమ్ముగా నార్చి
పేర్చె సమరమందు పెచ్చుపెరిగి 848

శరము లలప నతని సర్వగాత్రమ్ముల
నలుక గొన్న రాఘవాన్వయుండు
రాము డాహవమున రాజిల్లె నిర్ధూమ
మైన యగ్ని వోలె మండుచుండి 849

అంత నపుడు రాము డరి నిబర్హణు డింక
నొండు మహిత చాప మురు గభీర
నినద యుతము సజ్య మొనరించె నాతండు
ముగియ జేయు కొరకు పగతు బ్రదుకు 850

మని వరేణ్యు డతడు మున్నొసంగిన యది
వరము సుమహనీయ వైష్ణవమ్ము
ధనువు దాని కేల దాలిచి యెక్కిడి
ఖరు నెదుర్కొనంగ పరువు వెట్టె 851

అంత కనక పుంఖవంతమ్ములై నాలి
కణుపు లున్న మేలి కాండములను
కనలు మిగుల గొన్న కాకుత్థ్సు డనిలోన
ఖరుని కేతనమ్ము విరుగ నేసె 852

కనుల గాంచ దగిన కాంచన ధ్వజ మది
పెక్కు తునియలుగను విరిగి యొరిగె
చెల్లచెదరు గాగ నెల్లెడ భూమిపై
నమర వరుల యాజ్ఞ నర్కు నట్లు 853

కనలు గొన్న వాడు ఖరుడు నాలుగు సాయ
కముల రఘుకుమారు గాత్రమందు
జొనిపి నొవ్వ జేసె నని నేర్పు లెరిగిన
యాత డంకుశముల హస్తి నట్లు 854

ఖరుని మహిత కార్ముకమునుండి వెడలిన
నారసములు పెక్కు నాటుకొనగ
రాము డుండె నపుడు రక్త సిక్తాంగుడై
మిక్కుటంపు టలుక నెక్కొనంగ 855

ఖండనమున చేత బట్టి కార్ముకము కో
దండ ధారి శూర తల్లజుండు
గొప్ప వింట బరపె కోలల నారింటి
ఖరుని మేన చక్క గురి యొనర్చి 856

శిరము నొక్క నిశిత శరమున రెండింట
బాహువులను రెంటి బరపి నొంచె
నర్ధచంద్ర ముఖములొ బాణముల మూట
ఖరుని వెడద రొమ్ము గాడ నేసె 857

అంత పిదప నా మహాతేజు డర్కోప
మానమైన వాని మార్గణముల
గొనియె పదియు మూటి నని రాక్షసుం జంప
గోరి మిగుల నల్క గొన్నవాడు 858

నురము సేసె నంత నొగ లొక్క యమ్మున
నాల్గు తురగములను నాలుగింట
రణములోన ఖరుని రధ సారధి శిరమ్ము
నరికి వైచె షష్ఠ శరము తోడ 859

బలియు డేసె మూడు బాణముల త్రివేణు
విరుసు మహిత బలుడు విరిచె రెంట
ద్వాద శాశుగమ్ము బరపి భగ్న మొనర్చె
శర సమేతముగను ఖరుని విల్లు 860

త్రుంచి యిట్లు వజ్ర తుల్య శరమ్ముల
రాము డొలయగా నలంతి నవ్వ
వాస వోపముండు పదుమూడవ శరమ్ము
బరపి ఖరు నగల్చె బవరమందు 861

భగ్న కార్ముకుండు భగ్న శతాంగుండు
నిహత సైంధవుండు నిహత సూతు
డవతరించి ఖరుడు నవనీస్థలికి గదా
పాణి యగుచు నేలపైన నుండె 862

ఆ మహారథునకు రాము డాచరించి
యున్న పని దేవతల్ మును లొక్క మొగిన
ప్రస్తుతించిరి హృష్టులై ప్రాంజలు లయి
కలసి యపుడు విమానాగ్ర గతు లగుచును 863

## (29 వ సర్గ)

విరథుడైన వాని ఖరుని గదాపాణి
మహిని నిలిచి నతని మహిత తేజు
డైన రాము డరసి యాతని కిట్లనె
మొదలు మెత్తనైన మొరటు పల్కు: 864

"వాజి వారణ రథ వర్గ సంబాధమౌ
గొప్ప సేన నిన్ను కొలుచుచుండ
నాచరించి యుంటి వతి దారుణమ్మైన
కర్మ సర్వ లోక గర్హితమ్ము 865

ప్రాణి కోటి నెల్ల బాధించు క్రూరుండు
పాప కార్యములను బరపు వాడు
వాడు నిలువ లేడు మూడు లోకమ్ముల
పాలన మ్మొనర్చు ప్రభువె యైన 866

జగతికిన్ విరుద్ధమగు కర్మ రాత్రించ
రా! యొనర్చుచున్న యట్టి క్రూరు
జంపువారు సుమ్ము సర్వ జనమ్ములు
దుష్ట సర్ప మెదుర దునిమి నట్లు 867

పాప మాచరించు వాడు లోభమ్మున
గాని కామముననుగాని చింత
పడక భ్రష్టు డతడు కడగాంచు దానికి
బ్రాహ్మణి వడగండ్ల బడసినట్లు 868

ధర్మచారు లైన దండకారణ్య ని
వాసు లైన మహిత భాగధేయు
లౌ తపస్వి జనుల హతమార్చి రాక్షసా!
ఫలము పడయ కుండు వాడ వొక్కో? 869

పాపకర్ము లైన వారలు లోక జు
గుప్సితు లగు వారు క్రూర జనులు
చిరము నిల్వలేరు సిరుల దేలుచు నున్న
వ్రేళ్ళు తునిగినట్టి వృక్షము లటు 870

పాప కర్మమునకు ఫలితమ్ము ఘోరమ్ము
ప్రాణి తప్పకుండ బడయు గాదె
యరుగుదెంచి నంత నదను వృక్షములకు
కారునందు పూలు గలిగినట్లు 871

పాప కర్మములకు ఫలము లోకమ్మున
కట్టి కుడుపు నచిర కాలమందె
గరళ మిశ్రితమ్ముగా క్షణదాచరా!
మున్ను తాను తిన్న యన్నమట్లు 872

లోకమునకు కీడు లో దలంచుచు ఘోర
పాప మాచరించు వారలకును
ప్రాణములను దీయు పనికై నిశాచరా!
పంపియున్న వాడు ప్రభువు నన్ను 873

నేడు నేను విడుచు వాడి బాణములు హి
రణ్య భూష ణాఢ్యలంకృతములు
చీల్చి వైచి నిన్ను చెచ్చెర లో జొచ్చు
పుట్ట జొచ్చు భుజగములను బోలె 874

ధర్మచారు లైన దండకావన చరుల్
మున్ను నీవు మెసవి యున్నవారు
వారి ననుసరించు వాడవు సేనతో
నేడు యుద్ధమందు నిహతుడ వయి 875

బాణ హతిని పడిన వానిని నిను నేడు
పరమ ఋషులు గాంచు వారు గాక !
నీవు మున్ను హింస నెరపిన వారు విమాన
సంస్థు లిపుడు నిరయ సంస్థు నిన్ను 876

కొట్టు కొనుము నీవు కోరిన యట్లు కు
లాధమా! ప్రయత్న మాచరింపు
నేల గూల్చువాడ నేడిదే నీ తల
పక్వమైన తాటిపండు వోలె" 877

ఈ విధమ్ముగా వచింపగా రాముండు
కవల నెఱ్ఱ వడిన కనుల వాడు
ఖరుడు బదులు పల్కె కాకుత్స్థునకు నిట్టు
లలుక నొడలు మరచి చెలగి నవ్వి: 878

"ప్రాకృతులను చచ్చు రాక్షసులను జంపి
యాహవమున దశరథాత్మజాత!
పొగడుకొనెద వెట్లు పొగడంగ రానట్టి
వాని నిన్ను నీవె స్వయము గాగ 879

బల పరాక్రమములు గలవార లెవ్వార
లైన గాని మానవాగ్రసరుడ!
చెప్పుకొనరు నీకు నెప్పుడున్ కించిత్తు
స్వీయ తేజమునకు నెగసి పడుచు 880

అకృత మతులు క్షత్రియాన్వయ పాంసనుల్
ప్రాకృతు లగువారు లోకమందు
వదరుచుండు వారు పని లేకయే రామ!
ఈవు వదరుచున్న యిట్టి రీతి 881

కులము గొప్ప చెప్పుకొనుచు యుద్ధమ్మున
మరణ వేళ చేర నరుగుదెంచి
నపుడు వీరు డెవ్వ డప్రస్తుతమ్ముగా
స్వయము ప్రస్తవముల పలుకువాడు? 882

తెల్లమయ్యె నీదు తేలికతన మెల్ల
వెంట నీవు వదరుచుంట జేసి
కాంచనమున కీడుగా వచ్చునట్లుగా
మండిపోవు గడ్డి మంట వోలె 883

నిల్చియుండ గదను దాల్చిన వాని న
న్నీవు చూడకుంటి విచట నిపుడు
ధాతు విచిత్రమైన ధరణీధరము వోలె
నప్రకంపనీయు డైన వాని 884

చాలువాడ గొనగ సంగరమున గదా
పాణి నేను నీదు ప్రాణములను
మూడు లోకములను గూడ భీకర పాశ
హస్తు డైన కాల యముని వోలె 885

కలవు పెక్కు చెప్పవలసిన వైనను
నిన్ను గూర్చి కాని నేను చెప్ప
సవితృ డస్తమించి చనినవా డగునేని
యుద్ధవిఘ్న మంత నౌదవు గాదె 886

నిహతు లైరి వారు నీ చేత పదునాల్గు
వేలమంది దైత్య వీర వరులు
త్వ ద్వినాశనమున తద్బాష్ప ధారల
నిదియె తుడిచి వేయు దిపుడు నేను" 887

పల్కి యిట్టు లంచు పరమాంగదుడు వాడు
పరమమైన యల్క ఖరుడు నంత
విసరివైచె గదను వేగ రాముని మీద
మండుచున్న యశని మాద్రి గాగ 888

అపుడు మండుచున్ మహా గద ఖర బాహు
సంప్రయుక్త మగుచు సాగిన యది
వృక్ష గుల్మములను వే భస్మ మొనరించి
వాని చెంగటికిని వచ్చె నదియు 889

మీద పడెడు దాని మృత్యు పాశోపమ
మైన దాని జ్వలితమైన దాని
నంతరిక్ష గతము నా గద రాముండు
పెక్కుగా నగల్చె విశిఖములను 890

పడియె నేలమీద భగ్నమై శరముల
చెల్ల చెదరు గాగ నెల్ల యెడల
మహిత గద యదియును మంత్రౌషధమ్ముల
బలిమి పడినయట్టి పన్నగి వలె 891

## (30 వ సర్గ)

### *రాముడు ఖరుని గూలనేయుట*

బాణములను గదను భగ్నము గావించి
ధర్మ వత్సలుండు దాశరథియు
నలతి న వ్వొలయగ ననియె నిట్లని సంభ్ర
మాన్వితునకు ఖరున కట్టి యెడల: 892

"ఇదియె గాదె నీదు నెల్ల బలమ్మును
దానవాధమ! యిదె కానవచ్చె
నీకు శక్తిలేమి నా కన్న తెల్లము
రిత్త బిట్టు బొబ్బ లిడుదు వీవు 893

నారసములచే తునాతునకలై యిదే
పుడమి మీద విరిగి పడియెను గద
పలుకులందె గొప్ప ప్రాగల్భ్య మున్న నీ
శత్రు ఘాతిని యగు శక్తి యదియె 894

'చచ్చి పడిన రాక్షసాళికి కన్నీరు
తుడిచి వేయు వాడ దొడగి నే' న
టంచు నీవు తొల్లి యన్నది యెల్లను
కల్ల పల్కె యయ్యె గాదె యదియు 895

క్షుద్రశీలుడైన క్షుద్రుని కపట దు
ర్వర్తనమ్మునన్ బరంగు దైత్య
ప్రాణములను నే నపహరించు వాడను
గరుడు డమృత పాత్ర గమిచి నట్లు 896

చీల్ప నా శరములు ఛిన్న కంఠుండవై
నేల గూలియున్న నీ రుధిరము
ఫేన బుద్బుదాభివేష్ట నాలంకృత
మవని తలము నేడె యాన గలదు 897

క్రమ్ముకొనగ నలమి దు మ్మెల్ల యొడలను
జారి పడినటుల భుజమ్ము లమర
కౌగిలించి పుడమి గట్టిగా పండెదు
దొరకనట్టి పడతి దొరకి నట్లు ౨౦౪

దీర్ఘ నిద్రలోన దేలి యో రాక్షస
పాంసన! యిట నీవు పండియుండ
గత శరణ్యులకు మహితులకు దండకా
రణ్య మిదియు నిక శరణ్య మగును 899

మచ్చరముల హతస్థాన మైన చోట
దానవాధమ! నీ జనస్థాన మందు
భయము దిగనాడి తిరుగాడు వార లింక
మౌని జను లెల్ల యెడలను కాననమున 900

పారిపోవు వారు బాంధవుల్ గూలంగ
దానవాంగన లతి దీన లగుచు
భయము తోడ నేడు బాష్పార్ద్ర వదనలై
వెరపు గొల్పు వారు పెరల కెల్ల 901

నేడు నీవు నిట్టివాడవు పతివైన
వారు నీకు దగిన వంగడంపు
నీ కళత్ర జనులు శోక రసజ్ఞలు
కాగలరు నిరర్థకమ్ము గాగ 902

క్రూర బుద్ధివాడ! క్షుద్రాత్మకా! నీచ!
బ్రాహ్మణులను సతము పరచువాడ
మునులు నీకతమ్మనని హవి స్సగ్నిలో
వైచువారు శంక పడుచు నుండి" 903

కనలు మీర నిట్లుగా పల్కు వానిని
రాఘవాన్వవాయు రణమునందు
ఖర తర స్వనమున ఖరుడు రోషమ్మున
దూషణమ్ము సేయ దొడగె నిట్లు : 904

"పొగరు నీకు నొడల తెగ బట్టినదిగదా
భయములందు నైన భయము పడవు
చావు మూడినాడ వీవు వాచ్యావాచ్య
ముల నెరుంగ వందువలన గాదె 905

ప్రబల కాల పాశ బంధమ్మునకు లోగి
యున్నవార లెల్ల రుర్వి జనులు
కలయ నెరుగలేరు కార్య మకార్యము
నింద్రియమ్ము లారు నీసడించి" 906

అంత పల్కి యిట్టు లంచు రాముని తోడ
ముడిచి యంతట కనుబొమలు రెండు
నెల్ల యెడలను పరికించి చేరువ లోనె
యాత డా నిశాచ రాగ్రసరుడు
కనుల గాంచె నొక్క ఘన సాల వృక్షమ్ము
ప్రహర ణార్థముగను భండనమున 907

ఔడు గరచి పట్టి యాత డద్దానిని
పెల్లగించి వైచి పృథివి నుండి
బాహు యుగము తోడ పైకెత్తి యద్దాని
నార్పు చెలగ నా మహా బలుండు
విసరి పారవైచె వెస రాము మీదికి
పలికె "నీవు చచ్చిపడితి" వంచు 908

దాని మీద పడెడు దాని నమ్ముల గమి
దునిమి రాఘవుండు ద్యుతి యుతుండు
తెచ్చి పెట్టుకొనియె తీవ్రమౌ రోషమ్ము
సమరమందు ఖరుని సమయ జేయ 909

అంత స్వేద మొదవి యలమ రాముండు ర
క్తాంత లోచనుండు నలుక గదుర
భంజన మ్మొనర్చె బాణ సహస్రమ్ము
బరపి సమరమందు ఖరుని మేను 910

అతని మేన బాణ కృత రంధ్రముల నుండి
దొరగె కడు రుధిరము నురుగు తోడ
ప్రస్రవణ సమాఖ్య బరగు శైలము నుండి
వారి ధార జాలువారు నట్లు 911

విశిఖములను ఖరుని విహ్వలు గావింప
రాఘవుండు సంగరమ్ము నందు
క్రొవ్వినాత డురికె రుధిరగంధమ్ముతో
నతని చెంతకే రయమ్ము మీర 912

వచ్చి పడెడు వాని వానిని సంభ్రాంతు
రక్త సంప్లుతు నెదురైన వాని
గాంచి యించు కంతగా ప్రక్కకు దొలంగె
త్వరిత విక్రముడు కృతాస్త్రి డతడు 91

అంత పావకాభమౌ సాయక మ్మొండు
బ్రహ్మదండ మట్లు పరగు దాని
ఖరుని సంహరింపగా సమరమ్మున
రాము డందుకొనె కరమ్ము నందు 914

ధీ సమన్వితుండు దేవ తాధీశుండు
మఘవు డొసగి యున్న మార్గణమ్ము
నాత డెక్కు వెట్టె నా ధర్మ చిత్తుండు
విడిచి పుచ్చె ఖరుని యెడల నాట 915

వింటి సొగలాగి విడువంగ రాఘవా
న్వయు డతండు దొడ్డ నారసమ్ము
పిడుగు పాటు సాటి సడి యుప్పతిల్లంగ
ఖరు నురమ్ము నాటె గాటముగను 916

మార్గణాగ్ని శిఖల మండిపోయెడు వాడు
పడియె ఖరు డతండు పుడమి మీద
రుద్రు నంబ కాన లోగ్రార్చులన్ శ్వేత
వనము లోన నంతకుని వగిదిగ 917

భిదుర ఘాతమునను వృత్రాసురుని యట్లు
ఫేన హతిని నముచి దానవు నటు
వాసవాశని హతి బల దైత్యు నట్టులు
కూలనేయ నేల గూలె ఖరుడు 918

అంత రాజ ఋషులు నా పరమర్షులు
నెల్లవారు గూడి యుల్లసిల్లి
సలిపి రామునకును సంపూజనమ్మ వా
రతని తోడ నిట్టు లని పలికిరి: 919

"ఏత దర్థమే మహేంద్రుడు పాకశా
సనుడు మహిత తేజ సాన్వితుడు పు
రందరుండు పుణ్య రాశియౌ శరభంగు
నాశ్రమమున కప్పు డరుగుదెంచె 920

నిన్ను నీ యెడకును నేరుపున మహర్షి
వరులు తోడుకొనుచు వచ్చినారు
కూలనేయు కొరకు క్రూర రాక్షసులను
ఘోర పాప కర్మచారి జనుల 921

కార్య మయ్యెది యిది కడతేరె మాది నీ
వాచరింప దశరథాత్మజాత!
నెరపువారు ధర్మ మరలేక సుఖముగా
దండకా వనమున తాపసు లిక" 922

అంతలోన దేవతాళి చారణులతో
బెరసి చెలగ దుందుభి స్వనమ్ము
హృష్టు లగుచు పుష్పవృష్టి రాముని మీద
కురిసి రెల్లెడ వెరగొనుచు నపుడు 923

"అతి నిశిత శరముల నర్ధాధిక ముహూర్త
కాలముననె రాము డాలమందు
భయద కర్ము లైన వారిని పదునాల్గు
వేల మంది దనుజ వీర వరుల 924

ఖరుని దూషణుని త్రిశిరుని ముఖ్యుల నెల్ల
వారి నేల గూలవైచె నిపుడు
ఔర! యిది గదా మహత్కర్మ విదితాంత
రంగుడైన యట్టి రాఘవునిది 925

ఔర! యేమి వీర్య మౌర! యీ దక్షత
కానుపించు విష్ణుగరిమ యట్లు"
నిట్టు లంచు పల్కి యేగిరి దేవత
లేగు దెంచినట్టు లెల్ల వారు 926

అంతలోన వీరుడా నతడు సుమిత్ర
సూతి సీతతో సమేతముగను
అరుగుదెంచి వెలికి గిరిదుర్గమున నుండి
చొచ్చె నాశ్రమమ్ము సుఖము మీర 927

అంత విజయి యైన యా రాముడు మహర్షి
జనుల పూజ లందుకొనెడు వాడు
వీరు డాశ్రమము ప్రవేశించె నభిపూజ
నము సుమిత్ర సూతి యనుర జేయ 928

ఆ మహర్షి జన సుఖావహు శత్రు సం
హర్త నతని కన్నులార గాంచి
పరమ హర్ష యుక్తి బరగెను వైదేహి
కౌగిలించు కొనియె గదిసి మగని 929

పరమ ముదముతోడ బరగు నాయమ కాంచి
చచ్చి పడిన రాక్షస గణమెల్ల
నవ్యథితుడు రాము డగుటయు గనుగొని
సంతసమ్ము నొందె జనక తనయ 930

అపు డసురసంఘ మర్దనుడైన వాని
ముదిత పరమర్షి సంఘ సంపూజ్యమాను
కౌగిట శశి ప్రభానన గదియ బట్టి
మరల జనకాత్మజయు హర్ష మందె నంత 931

## (31 వ సర్గ)

### * అకంపనుడు రావణునకు జనస్థాన వధమును విన్నవించుట *

సత్వరమ్ము గాగ చని జనస్థానమ్ము
నుండి యొక డకంపనుం డనియెడి
పేరి వాడు లంక వేగమ్ముగా జొచ్చి
నుడివె నిట్లు రావణునకు వార్త : 932

"రాజ! పెక్కుమంది రాక్షసు లా జన
స్థాన వాసులైన జనులు నిహతు
లైరి ఖరుడు నిహతు డయ్యె నాహవమున
నెట్లొ వచ్చియుంటి నే నొకండ" 933

అని వచింప విన్న యా దశగ్రీవుడు
నలుక గదుర నెర్రనైన కన్ను
లలరుచుండ నిట్టు లనె నకంపనునితో
కాల్చుచున్న యట్లు కనుల తోడ : 934

"ఎవ్వ డా పరాసు వింపొ జనస్థాన
మదియు నాది నాశ మాచరించె ?
నెవ్వ డొక్కొ వాడు నెల్ల లోకమ్ముల
తనకు గతిని బడయ దలచు వాడు ? 935

ఆచరించి విప్రియము నాకు నాపైన
చొప్ప వడదు గాదె సుఖము బడయ
వాసవునకు నైన వైశ్రవణున కైన
యమున కైన కైటభారి కైన 936

కాలు డౌదు నేను కాలుని కైనను
వీతిహోత్రు కాల్చివేయు వాడ
నేను గూర్చ సుత్సహింతును మృత్యువు
నైన మరణధర్మ మూను నట్లు 937

ప్రబల తేజముననె పావ కాదిత్యుల
గాల్చివేయు వాడ కనలు గొన్న
వాయు వేగ మేను వారింపగా నుత్స
హించు వాడ నతిశయించిన త్వర" 938

అట్లు క్రుద్ధుడైన యా దశగ్రీవు రా
వణు నకంపనుండు ప్రాంజలి యయి
భయము వలన తొట్రుపడు వచనమ్ముల
ప్రార్థన మ్మొనర్చె నభయ మొసగ 939

దాన వోత్తముండు దశ కంధరుండు నా
తనికి నప్పు డభయ దాన మిచ్చె
గదుర నమ్మక మ్మకంపను డిట్లసం
దిగ్ధ వాక్యములను తెలియ బల్కె: 940

"దశరథునకు గలడు తనయుండు రాముండు
నాగ బరగు వాడు నవ యువకుడు
వృత్త దీర్ఘ మహిత విపుల బాహుడు వృష
స్కంధు డతడు సింహ సంహననుడు 941

పృథు యశం డతండు వీరుండు శ్రీమంతు
డతుల బల పరాక్ర మాన్వితుండు
నాశ మతనిచే జనస్థానమున కాయె
నణగె ఖరుడు దూష ణాన్వితముగ" 942

ఆలకించి పల్కు లా యకంపనునివి
రాక్ష సాధిపుండు రావణుండు
నురగరాజ మట్టు లూర్పులు నిగుడించి
పలుకు లిట్టు లంచు పల్కె నంత: 943

"రాము డతడు నిర్జరాధీశ్వరుని గూడి
సకల విబుధ నిచయ సహితముగను
అరుమ నో యకంపనా! జనస్థానమ్ము
చేర వచ్చె నొక్కొ చెప్పు నాకు" 944

ఆ యకంపనుండు నాలించి మరల రా
వణుడు పల్కియున్న పల్కు లవియు
తెలియ బలికె నతని బలము నా మహితాత్ము
నప్రమేయమౌ పరాక్రమమ్ము 945

"రాము డనగ బరగు నా మహా తేజుండు
విల్లు దాల్చు వారి కెల్ల మేటి
యలఘు దివ్య దారుణాస్త్ర సంపన్నుడు
యుద్ధమున పురందరోపముండు 946

వాని బోలువాడు బలవంతుడున్ రక్త
పీక్షణుండు దుందుభి స్వనుండు
పేరు లక్ష్మణుండు పిన తమ్ము డతనికి
నమృత రోచి రుజ్జ్వ లాననుండు 947

కూడి యతడు తనకు తోడుగా నాతండు
పావకునకు వాయు వట్లు రాజ
శేఖరుం డతండు శ్రీ సమేతుడు జన
స్థాన మదియు నెల్ల చదిపి వైచె
దేవతల్ మహాత్ము లా వైపుకే రారు
దీన చింత సేయ బూన వలదు 948

స్వర్ణ పుంఖ సహిత శరములు రాముండు
బరపినవి పతత్రి వర్గము లవి
పంచముఖ సమేత పన్నగము లయి భ
క్షించు చుండె నసురు లెల్లవారి 949

ఎచటి కెచటి కైన నేగుచు నున్నను
త్రాస పీడితు లగు దనుజ జనులు
అచట నచట నిలిచి నాతని రామునే
కాంచుచుండి రెదురు కట్టి వారు 950

నాశ మయ్యె నీ జనస్థాన మయ్యది
యనఘ! యీ విధమున నతనిచేత"
నన నకంపనుండు నాలించి రావణు
డతని తోడ నిట్టు లంచు పల్కె:
"నడచు వాడ నే జనస్థానమునకు ల
క్ష్మణుని తోడ రాము గనిమసంగ" 951
అంత నిట్టు లంచు నన్నంతనే యకం
పనుడు నిట్టు లంచు పల్కె నపుడు
"అధిప! వినుము జరిగినది జరిగినయట్లు
రాము నలఘు బల పరాక్రమములు 952

అలుక గొన్న రాము డా మహాయశుడు వి
క్రమము చేత నలవి గాని వాడు
నిండి పారుచుండు నిర్ఝరిణి రయమ్ము
పరిహరింప జాలు శర చయమున 953

గగన పథము తారకా గ్రహ నక్షత్ర
సహితముగను సేయజాలు నుగ్గు
శ్రీ మహితు డితండు రాముండు మున్నెడు
నుర్వి నుద్ధరింప నోపు వాడు 954

కడలి యొడ్డు నడ్డుకట్టను తెగ ద్రెంచి
జగతి ముంచివేయ జాలు విభుడు
కడలి వేగమైన గాలి వేగ మ్మైన
నాగ జాలు నీత డంప గముల 955

సంహరించి వైచి సర్వ లోకమ్ముల
తన పరాక్రమమున తత యశుండు
చాలు వాడు పురుష శార్దూలు డతడు సృ
ష్టింప మరల ప్రజల నెల్ల వారి 956

అలవి కాదు గెలువ నా రాము నో దశ
కంఠ! నీకు సంయుగమ్ము నందు
సర్వ రాక్షస గణ సహితమ్ముగా నైన
పాప వర్తనునకు స్వర్గ మట్లు 957

అతని జంప నగు నటంచు దలంప నే
నఖిల దేవ దానవాళి కైన
వాని జంపగా నుపాయ మిదే యది
వినుము నా యెడ నొక మనసు తోడ 958

వాని భార్య జగములో నుత్తమ సుమధ్య
పేరు సీత యనగ వెలయు నామె
సమ విభక్త గాత్ర శ్యామ స్త్రీ రత్న మ
మూల్య వివిధ రత్న భూషితాంగి 959

అమర వనిత లందు నప్సరో గంధర్వ
వనిత లందు దనుజ వనిత లందు
లేదు సాటి వచ్చు లేమ యా తన్వికి
మనుజ వనిత యేడ ననువు పడును? 960

అపహరింపు మీవు నాతని భార్యను
వెదకి యా మహా విపినము నందు
లేకయున్న సీత యా కామి రాముండు
పోవ విడుచు వాడు జీవితమ్మొ" 961

పలుకు లయ్యవి కడు వాచవి యయ్యెను
రాక్ష సాధిపునకు రావణునకు
ఘన భుజుండు చింత యొనరించి యా యకం
పనుని తోడ నిట్లు పల్కె నపుడు: 962

"మంచి దరుగు వాడ మరి ప్రభాతముననే
నొక్కరుడనె సూతు నొకని తోడ
తోడుకొనుచు వచ్చు వాడను సీతను
హర్షయుక్తి నీ మహా నగరికి" 963

అంత నీ విధముగ నని ఖర యుక్త మా
దిత్య వర్ణ మైన తేరి మీద
వెడలి పోయె రావణుడు దిక్కు లెల్లను
పలు తెరంగు వెలుగు లలము కొనగ 964

రాక్ష సాధినాథు రథ మది మహనీయ
మరిగెడు నది తారకాధ్వ మందు
గడపు చుండ నపుడు కడు శోభ వెలుగొందె
మబ్బు మాటు చందమామ వోలె 965

*** మారీచుడు రావణునకు హితము చెప్పుట ***

చేర నరిగి యతడు మారీచు నాశ్రమ
వాటి చేర జనియె తాటకేయు
మనుజ దుర్లభముల మారీచు దర్శించె
భక్ష్య భోజ్యములను పార్థివేంద్రు 966

స్వయముగాగ తాను సంపూజన మొనర్చి
యాస నోదకముల నతని కొసగి
యర్థ సముపహితము నగు పల్కు మారీచు
డతని తోడ నిట్టు లంచు పల్కె: 967

"లోకములకు కుశలమే కదా చక్కగా
రాక్షసాధినాథ! రాజచంద్ర!
శంక వొడమె నెరుగ జాల నైన నిదేటి
కేగు దెంచియుండు టిటకు నీవు?" 968

ఈ విధమ్ముగా వచింప మారీచుడు
రావణుడు మహా పరాక్రముండు
వాక్య కోవిదుండు పల్కె నా పిమ్మట
పల్కు లిట్టు లంచు వానితోడ: 969

"అవని గూలె నాదు నారక్షు డక్లిష్ట
కర్ముడైన రాము కడిమి వలన
నాలమున నవధ్య మైన జనస్థాన
మదియు నెల్ల నేల మట్ట మయ్యె 970

నీవు నట్టి నాకు నెరవుమా సాచివ్య
మతని భార్య నిప్పు డపహరింప"
రాక్షసేంద్రు పల్కు లాలించి మారీచు
డతని తోడ నిట్టు లని వచించె : 971

"మిత్ర రూపు డైన శత్రు డెవ్వండొకో
చెప్పియున్న వాడు సీత గూర్చి
నిందితుం డెవండు నిను గాంచి రాక్షస
వ్యాఘ్ర! వడయకుండె పరము ముదము?
తోడితెమ్ము సీత నట కటంచును
చెప్పె నెవడు నీకు? చెప్పు నాకు! 972

శృంగ భంగ మాచరింప సర్వాసుర
లోకమున కెవండు లో దలంచు
నిన్ను ప్రోత్సహించు చున్నవా డెవ్వడో
వాడు శత్రు వౌను వలదు శంక! 973

క్రూర ఫణి ముఖమున కోర నీ చేతను
వెలికి పెరుక జేయు దలచు వాడు
వా డెవండొ గాని పని య య్యదియు జూపి
కాపథమ్ము నీకు గరపినాడు
మొత్తె నెవడు రాజ! నెత్తిపై నిను సౌఖ్య
మొలయ నిద్ర దగిలి యున్న వాని ? 974

అతి విశుద్ధ వంశాభిజ నాగ్రహస్తి
ద్యుతి మద యుతమ్ము సంస్థిత దోర్విషాణ
మైన రాఘవ మద కరి నని మొన నిక
రావణా! తేరి చూడంగ రాదు సుమ్ము! 975

సాంపరాయి కాంతస్థితి సంధివాల
మతి విదగ్ధ రక్షో మృగహా నృసింహ
మాశుగాంగ పూర్ణము నిశితాసి దంష్ట్రి
సు త్తమిల నీవు మేల్కొల్పు టనువు గాదు 976

కార్ముక గ్రాహ భుజ వేగ కర్దమమ్ము
నాశ గోర్మి మాలా సుమహాహవౌఘ
మేల యతి ఘోర రామ పాతాళ ముఖము
నందు దనుజాధిపా! పడు టనువె నీకు? 977

రాక్షసాధిప! లంకేశ్వరా! ప్రసన్ను
డగుమ లంకాపురికి చక్క నరుగుమయ్య
స్వీయ దారల గూడి రమింపు మెపుడు
వని రమించుత రాముండు భార్యతోడ" 978

పల్కు లిట్టు లంచు పల్క మారీచుండు
రాక్షసేశ్వరుండు రావణుండు
మరలి చనియె తాను పురికి లంకకు చేర
జనియె స్వీయ నిలయ సత్తమమ్ము 979

## (32 వ సర్గ)

అంత శూర్పణఖయు నరసి కన్గొని భీమ
కర్మలైన యసుర గణము పదియు
నాల్గు వేలమంది నాశమ్ము నొందుట
యుద్ధభూమి రాము నొకని చేత 980

ఖరుడు దూషణుడు త్రిశిరునితో పాటుగా
నాలమందు నేల గూలి యుంట
గాంచి మరల నార్చె కడు బెట్టిదమ్ముగా
బొబ్బ దట్టమైన మబ్బు వోలె 981

### * శూర్పణఖ రావణుని చెంతకు పోవుట *

అన్యు లాచరింప నలవి గానిది కర్మ
రాము డాచరింప నామె కాంచి
లంక జేరనేగె రావణ పాలిత
మైన పురికి పరమమైన భీతి 982

కనుల గాంచె నామె ఘన విమానాగ్ర సం
స్థితుని రావణున్ ప్రదీప్త తేజు
చేరి సచివ గణము కూరుచుండగ మరు
ద్గణము తోడి మఘవు కరణి వాని 983

తపన మండలాభ తపనీయ సింహాస
నోత్తమమున గూరుచున్న వాని
స్వర్ణ వేది గతుడు ప్రాజ్యాద్యై జ్వలియించు
పావకునకు సాటి వచ్చు వాని 984

శూరు రణములోన సురలకు గంధర్వు
లకును భూత కోటులకు మహాత్ము
లౌ మహర్షి వరుల కైన నజేయుని
వ్యాత్త వదను డైన యంతకు నటు 985

అమరుల కసురులకు నైన యుద్ధమ్ముల
వజ్ర హతిని గాయపడిన వాని
గీరుకొనగ వేల్పు గౌరు కొమ్ముల కొనల్
కక్కువారి యున్న యక్కువాని 986

పది శిరమ్ములు నిరువది భుజమ్ముల వాని
ప్రేక్షణీయమౌ పరిచ్ఛదమ్ము
వాని నతి విశాల వక్షుని వీరుని
రాజ లక్ష ణాభిరమ్యు నతని 987

స్నిగ్ధ వైడూర్య కాంతుల జెలగు వాని
తప్త కాంచన కుండల ధారియైన
సుభుజ సంయుక్తుడౌ వాని శుక్ల దశను
నద్రి సాదృశ్య గాత్రు మహాస్యు నతని 988

విబుధ సమర మందు విష్ణు చక్రాహతి
నన్య శస్త్ర సంప్రహారములను
కలన కొట్టు వడిన పలు మార్లు సర్వ దే
వాయు ధాభిహతి ననాహతాంగు 989

కలచరాని యట్టి కడలిని చెచ్చెర
కలచి వైచు నట్టి కడిమి వాని
పర్వతేంద్రములను పార నూకెడు వాని
వేలుపులను త్రొక్కి వేయు వాని
నెల్ల ధర్మములను కుళ్ళగించెడు వాని
నొరుల సతుల దడవుచుండు వాని 990

సర్వ దివ్యాస్త్రయోక్తను సవన విఘ్న
కరుని భోగవతీపురి దరియ నరిగి
వాసుకిని గెల్చి తక్షకు భార్యను ప్రియు
రాలి హరియించు కొని వచ్చినట్టి వాని 991

పోయి కైలాస పర్వతమునకు ధనదు
నాజి నోడించి కామగ మైన దాని
పుష్పక విమానముం గొన్న పోటు మగని
చైత్ర రథ వన దివ్య కాసారములను
నందన మ్మాది దేవ వనమ్ము లెల్ల
నలుక రెట్టింప గూలుచునట్టి వీరు 992

అరి విమర్దనుల్ మహాభాగులౌ వారి
పైకి లేచు చంద్ర భాస్కరులను
బాహు యుగముతో నివారించు నాతని
నలఘు శైల శిఖర మట్టి వాని 993

పరమ తప మొనర్చి పదివేల యేడుల
పాటు ఘోరమైన వనమునందు
మునుపు తా స్వయంభువునకు శిరమ్ముల
కాన్క యిడిన ధీరు కడిది మగని 994

సురల వలన నసుర వరులచే గంధర్వ
వరులచే పిశాచ పతగ భుజగ
వరుల చేత నరుల వలన దక్కఁగ నని
మృత్యు భయము లేక మెలగువాని 995

అధ్వరములలో ధరామ రాభిష్టుత
మంత్ర పూత పుణ్య మహిత సోమ
మాహుత మ్మొనర్చు నవసరమున బల్మి
నాహరించి కొనెడునట్టి వాని 996

ఆప్త యజ్ఞ హారియౌ వాని క్రూరుని
బ్రహ్మఘాతి దుష్టవర్తను కడు
కఠినుడైన వాని కరుణా విహీనుని
ప్రజల కహిత మెపుడు బరపు వాని 997

వాని సర్వ భూత వర్గ రావణు సర్వ
లోకములకు భయము నాకొలిపెడు
వాని మహిత బలుని భ్రాతను శూరుని
గాంచె నప్పు డసుర కాంత యామె 998

దివ్య వస్త్ర ధారి దివ్యాభరణ యుక్తు
దివ్య మాల్య శోభ తేజరిల్లు
చున్నవాని నాసనోపవిష్టుని కాల
కాలు పగిది కడగి క్రాలువాని
నసుర నాథు నా మహాభాగు పౌలస్త్య
వంశ నందను దగువాని నతని 999

సకల శత్రులోక సంహర్త రావణు
నఖిల మంత్రి సహితు డైన వాని
చెంత జేర నరిగి చెప్పె నిట్లంచును
త్రాస విహ్వల యగు దనుజ కాంత 1000

దీప్త విస్ఫార నయనుతో తెలియ బల్కె
దారుణపు బల్కులు నభీత చారిణియును
చూపి భయ మోహ మూర్ఛిత శూర్పణఖ మ
హాత్ము చేత విరూపిత యైన యాయె 1001

## (33 వ సర్గ)

రావణు గని లోక రావణు నంతట
దీన శూర్పణఖయు వాని తోడ
సచివ మధ్యమందు సంక్రుద్ధయై యిట్లు
పరుష వాక్యములను పలికె నపుడు; 1002

### * శూర్పణఖ రావణు నెత్తిపొడుచుట *

"కామ భోగసక్తి కడు ప్రమత్తుడ వైతి
వదుపు లేక యుండ స్వైరవృత్తి
వచ్చి పడిన గాని భయ మిది ఘోరమ్ము
తెలియ దగిన దైన తెలియ కుంటి 1003

గ్రామ్య భోగ సక్తి గల మహీనాథుని
కామ వృత్త సరణి గడచువాని
లోభియైన వాని లో మెచ్చకుందురు
ప్రజలు వల్లకాటి వహ్ని వోలె 1004

స్వయము తాను తగిన సమయమ్ము గమనించి
పనుల నెరపకున్న పార్థివుండు
వాడు నాశ మొందువాడు రాజ్యమ్ముతో
పనులు వానితోడ పాటు గాగ 1005

కాంచరాని వాని కాని నడత వాని
నొరుల యానతి బడి నెరపు నృపుని
తొలగ విడుచు వారు దూరమునసె నరు
లేటిలోని బురద నేన్గు లట్లు 1006

ఒరుల చిత్తములకు నొదిగి నరాధిపుల్
స్వీయ దేశ రక్ష సేయకున్న
పెంపు మీరి వారు వెలుగొంక కుందురు
అంబురాశి లోని యద్రు లట్లు 1007

ఆత్మవంతు లైన యమర గంధర్వ రా
క్షసుల ధిక్కరించి గడచు నీవు
చపలుడవు నయుక్త చారుడ వౌవాడ
వవనిభర్త వెట్టు లౌదు నీవు ? 1008

బాలిశ స్వభావ వంతుడ వసురుడా !
ఈవు స్వీయ బుద్ధి హీనుడవును
ఎరుగ దగిన దాని నెరుగ కున్నాడవు
అవని భర్త వెట్టు లౌదు నీవు? 1009

గూఢచారి జనులు కోశముల్ నీతియు
గెలుపు గొనెడు వారి కెల్ల మేటి !
అదుపు దప్పి యుండు నధిపు లెవ్వారికి
వారు సము లగుదురు ప్రాకృతులకు 1010

చార జనుల వలన దూరస్థముల సక
లార్థములను మానవాధిపతులు
కాంచుచుండు వారు కనుక పేర్కొను వారు
ధరణి పతులు దూరదర్శు లంచు 1011

నిను నయుక్త చారు డని తలంతును ప్రాకృ
తుల సచివుల గూడి మెలగు వాని
సమసి పోయెను స్వజనము జనస్థానమ్మ
నని యెరుంగ కుంటి వైతి నీవు 1012

క్రూర కర్ము లైన వారలు రాక్షసుల్
పదియు నాల్గు వేల బలగ మెల్ల
నుక్కణంగి పోయె నొక్క రాముని చేత
ఖరుడు దూషణుండు గడచి చనిరి 1013

ఋషుల కెల్ల నభయ మిచ్చెను దండకా
వనము క్షేమము మెయి వరలు చుండె
దశర థాత్మజుండు తా జనస్థాన మ
క్లిష్ట కర్మ డరిమి గెలిసెసె 1014

రావణాసురా ! పరాధీనుడవు నీవు
క్రొవ్వి యున్న పిసిని గొట్టు వీవు
స్వ విషయమ్ము నందు వచ్చి పడిన యట్టి
భయము నెరుగకున్న వాడ వీవు 1015

క్రూరు కపట చిత్తు కొలది యిచ్చెడు వాని
క్రొవ్వి నతని పొగరు కొన్న వాని
పార్థివు దరి జేర పరువిడకుండును
ప్రాణి కోటి యెల్ల వనట బడిన 1016

అధికు డనుచు తలచు నాతని నగ్రాహ్యు
తనకు దానె మెచ్చుకొనెడు నరుని
క్రోధియైన ధరణినాథు చిక్కున బడ
చంపి వైచు వారు స్వజను లైన 1017

కార్యములను తిన్నగా నిల్పి నెరపక
వెరపులందు వెరపు బొరయ కుండి
వేగ రాజ్యమునకు వెలియైన దీనుండు
గడ్డి పరకల కెన కాగలాడు 1018

ఎండు పుల్లలైన నేదేని పని కగు
మంటి గడ్డ లైన మన్ను లైన
పదవి నుండి యూడిపడిన ధాత్రీశ్వరుల్
పట్టి పనికి మాలినట్టి వారు 1019

కట్టి యుజ్జగించి నట్టి మైలను బోలె
జజ్జువారి యున్న సరుల వోలె
రాజ్య పదవి నుండి భ్రష్టు డీ రీతినే
పనికి రాడు చాలువాడె యైన 1020

అప్రమత్తుడైన యవనీశ్వరుడు సర్వ
మెరిగి నాతడు విజితేంద్రియుండు
ధర్మశీలుఁడున్ కృతజ్ఞుడౌ నాతండు
పార్థివుండు నిల్చువాడు చిరము 1021

కనులు మోడ్చి పండు కొనియున్న నైన మే
ల్కొనియె యుండి నీతి లోచనముల
నలుకయున్ దయయును వెలిబుచ్చు చుండెడు
రాజు జనుల పూజ లందు వాడు 1022

రావణ! యిటులౌట నీవు దుర్బుద్ధివి
గుణము లివియు వీడుకొనియె నిన్ను
నెరుగకున్న వాడ వీవు చారుల వల్ల
నట్టి రాక్షసుల మహా వధమ్ము 1023

సరకు గొన కరుల విషయాసక్తు డగుచు
దేశ కాల విభాగముల్ తెలియకుండి
నేర్పు లేక మంచియు చెడ్డ యేర్పరింప
గూల రాజ్యము చెచ్చెర గూలు నృపుడు" 1024

స్వీయ దోషము లిట్లామె పేర్కొనంగ
నెంచి మనమున క్షణదాచరేశ్వరుండు
బలము దర్పము ధనమును గలుగు వాడు
చిరము రావణు డవి యెల్ల చింత సేసె 1025

## (34 వ సర్గ)

అలుక గొన్న దాని నా శూర్పణఖ నట్లు
పరుష వచనములను పలుకు దాని
సచివ మధ్య మందు సంక్రుద్ధుడైన రా
వణుడు వివరముగను ప్రశ్న లడిగె: 1026

### * రావణుని శూర్పణఖ ప్రోత్సహించుట *

"ఎవడు రాము డనగ? నెట్టి వీర్యము వాడు?
యెట్టి విక్రమమ్ము? యెట్టి రూపు?
చేరరాని దండకారణ్య భూమికి
వచ్చి యేటి కిట్లు చొచ్చినాడు ? 1027

ఆయుధ మ్మదేది యతని కా రాముని
కసుర జనుల నెల్ల కసిమసంగి
ఖరుని దూషణుని త్రిశిరు నాహవమ్మున
హత మొనర్చి యున్న యాతనికిని?" 1028

ఇట్టు లంచు రాక్షసేంద్రుడు పల్కంగ
నలుక నొడలు మరచి నసుర కాంత
యంత నున్న దున్న యట్టులు రాముని
గురిచి చెప్ప మొదలు కొనియె నపుడు: 1029

"ఆయతేక్షణుండు నాజానుబాహుండు
చీర కృష్ణ చర్మ ధారి యతడు
కామ సదృశ రూప కలితుండు రాముండు
దశరథావనీశు తనయు డతడు 1030

స్వర్ణపట్ట యుతము శక్ర కార్ముకముతో
నీడు వచ్చు చాప మెక్కు-వెట్టి
మెరుగు నారసముల కురియించు నాతండు
గరళ సహితమైన యురగు లట్లు 1031

ఘోర సాయకముల గొనుచుండు టేనియు
విడుచు చుండు టేని విశిఖములను
పట్టి కార్ముకమ్ము వంచుటేన్ రాముండు
కానరాక యుండె కలన నాకు 1032

సాంద్ర విశిఖ వృష్టి సైన్య మయ్యది చచ్చి
పడుచు నుంట కానవచ్చు చుండె
వాసవుండు రాళ్ళవాన వర్షింపగా
పొలియు మంచి పంట పొలము వోలె 1033

భయద రూపులైన వారలు రాక్షసుల్
పదియు నాల్గువేల బలగ మెల్ల
నేల గూలి పోయె నిశిత శరమ్ముల
నతనిచే నొకే పదాతి చేత 1034

హతులు సేన తోడ నర్ధాధిక ముహూర్త
మందె దూషణుండు నవల ఖరుడు
ఋషుల కెల్ల నభయ మిచ్చెను దండకా
వనము క్షేమము మెయి వరలు చుండె 1035

పరిభవించి విడిచి వైచె చంపక నన్ను
నొక్క-దాని నెట్టులో మహాత్ము
డంగనన్ వధించు టన జంకుటన్ విది
తాత్ముడైన దశరథాత్మజుండు 1036

అతని సోదరుండు నలఘు తేజశ్శాలి
తుల్య విక్రముండు తుల్య గుణుడు
నతని యెడల భక్తు డనురక్తు డాతండు
పేరు లక్ష్మణుండు వీర్యశాలి 1037

కడు సమర్థి దుర్జయుడును విక్రాంతుండు
శేముషీ యుతుండు జేత బలియు
వాడు రామునకును వలకేలు నిత్యమ్ము
బయట మెలగుచుండు ప్రాణ మతడు 1038

రాము నాలును ప్రియురాలు విశాలాక్షి
పూర్ణ చంద్ర సదృశ ముఖియు నామె
యెల్ల వేళల ప్రియ హితము భర్తకు గూర్ప
తగులు గల్గియుండు ధర్మపత్ని 1039

ఆమె రమ్యకేశి యామె సునాసోరు
యశము గల్గు నామె యా సురూప
దీని కీ వనికిని దేవత యట్టులు
చెలగు నింక నొక్క శ్రీ యనంగ 1040

తప్త కనక వర్ణ తను కాంతి నొప్పారు
మంగళాంగి రక్త తుంగ నఖియు
నణు సుమధ్యమయు వరారోహ వైదేహి
సీత యనెడు పేర జెలగు నామె 1041

అమర వనితనైన యక్షిని గంధర్వి
నైన కిన్నర హరిణాక్షి నైన
నిట్టి రూపు గల్గు నే వడంతిని గాని
యుర్వి మున్ను కాంచియుండ లేదు 1042

ఎవని భార్య యగునొ ఈ సీత యెవ్వాని
కౌగిలించు కొనునొ కడు ముదమున
నట్టివాడు తప్ప కఖిల లోకమ్ముల
వాసవునకు మించి బ్రదుకు వాడు 1043

ఆమె సాధుశీల యామె వపుశ్శ్లాఘ్య
యామె సాటి రూపె యవని లేదు
ఆమె యగును నీకు ననురూపయౌ భార్య
తగిన భర్త వామె కగుదు వట్లె 1044

విపుల జఘన నామె పీన పయోధరన్
వర వదనను నీకు భార్య గాగ
నేను కొంచు దేర బూన లక్ష్మణుడును
క్రూరు డిట్లు నను విరూప జేసె 1045

నీవు కంటివేని నేడు వైదేహిని
పూర్ణ చంద్ర సదృశ ముఖిని దాని
మకర కేతన శర నికరమ్మునకు లోగి
చిక్కు వడుదు వీవు నిక్కువమ్ము 1046

కైకొనంగ భార్యగా నీమె నీ కభి
ప్రాయ మొదవె నేని భావమందు
రక్షణమ్మ నీదు దక్షిణ పాదమ్ము
నిపుడె జయము గోరి యెత్తి పెట్టు 1047

నెరపు మట్లు ప్రియము నీవు వారలకు నా
రాక్షసులకు నెల్ల రాక్షసేశ!
ఆ నృశంసు రాము నాశ్రమ వాసియౌ
వాని కనిమసంగి వైచి యింక 1048

చంపి వాని నిశిత శరముల లక్ష్మణు
మహిత రథుని గూడ మట్టుపెట్టి
హాయి మీర నీవు హత నాథయౌ సీత
ననుభవించువాడ వాకలేక 1049

ఏను పల్కు పల్కు లివి రాక్షసేశ్వరా!
చవి యొసంగు నొక్కొ యివియు నీకు?
శంక పారద్రోలి యింక నో రావణా!
నాదు వచన మిది యొనర్చు మీవు 1050

నీదు శక్తి యుక్తి నెమ్మది నెంచుమా
అపహరించి తెమ్మ యబల బల్మి
సర్వ రాక్ష సేశ! సర్వానవద్యాంగి
సీత భార్య గాగ చేకొనంగ 1051

ఆలకించి రాముని వాడి యంపగముల
హతు లసురులు జనస్థాన గతు లటంచు
ఖరుడు దూషణుడును గూలు టెరిగియుండి
ఇపు డొనర్పగ వలసిన దెరుగు మీవు" 1052

## (35 వ సర్గ)

అంత నతడు రోమహర్షణ మైన శూ
ర్పణఖ పల్కి యున్న పల్కుల విని
యభ్యనుజ్ఞ సచివు లందరకు నొసంగి
కర్జ మెంచి యరుగ గడగె నపుడు 1053

తలచి కర్జ మదియు తన మనమ్మున నిది
యిట్టు లంచు నిశ్చయించు కొంచు
తూచి చూచుకొంచు దోషముల్ గుణములు
నెద బలాబలమ్ము లెంచి కొంచు 1054

### * రావణుడు మారీచు నొద్దకు పోవుట *

ఇట్టు లాచరించుటె యొసంగు నటంచు
నెరపి పుచ్చి తనదు నిశ్చయమ్ము
అంతట స్థిరబుద్ధి సత్యంత రమణీయ
మైన యానశాల కరిగె నతడు 1055

అంత యానశాల కరిగి ప్రవిష్టుడై
రాక్షసాధిపుండు రావణుండు
హెచ్చరించె సూతు చెచ్చెర తనకునై
తేరు పూన్చి కొంచు దెమ్మటంచు 1056

అని వచించినంత క్షణములో సారథి
త్వరిత విక్రముండు దనుజ వరున
కభిమతమ్ము నైన యత్యుత్తమము మైన
తేరొకండు పూన్చి తెచ్చె నటకు 1057

కనక భూషితములు ఖరములను పిశాచ
వదన యుక్తమైన వాని పూన్చి
నదియు రత్నభూషణాలంకృతము కామ
గమనమైన యట్టి కనక రథము 1058

వారివాహ సన్నిభ నినాద యుక్తమౌ
రథము మీద నెక్కి రాక్షసాధి
నాథుడౌ ధనాధినాథానుజుడు శ్రీ స
మన్వితుండు చనియె నబ్ధి చేర 1059

శ్వేత చామరుండు శ్వేతాతపత్రుండు
దశముఖుం డతండు తప్త కనక
కుండలాభిభూషితుండును స్నిగ్ధ వై
డూర్య కాంతి యుతుడు వీర్యశాలి 1060

పది శిరోధులు నిరువది భుజమ్ముల వాడు
ప్రేక్షణీయమౌ పరిచ్ఛదమ్ము
వాడు త్రిదశ వైరి వర మునీంద్రఘ్నుండు
పది శిరముల కొండ వంటి వాడు 1061

రథము కామ గమన మధిరోహణము సేసి
శోభమీరె రాక్షసోత్తముండు
ఆకసమ్మున సబలాకమై విద్యు దు
న్మేష యుక్త మైన మేఘ మట్లు 1062

వేలకొలది గాగ వృక్షముల్ బహు పుష్ప
ఫల సమృద్ధి మీరి బలసి యున్న
శైల సహిత మైన సాగరానూపమ్ము
పారజూచి వీర్య వంతు డతడు 1063

శీత శుభ సలిల సమేతములౌ పద్మి
నీ చయమ్ము లెల్ల నిండి యుండ
వేది మంతము లగు విపులాశ్రమ పదమ్ము
లెల్ల కడలయందు వెల్లి విరియ 1064

అరటి కంది ప్రోక లలరార కొబ్బరి
చెట్లు లెల్ల యెడల చెలువు మీర
సాల తాలముల్ తమాల వృక్షమ్ములు
పూల చెట్లు బెరసి పెంపు మీర 1065

నాగ గంధర్వ గరుడ కిన్నర సహస్ర
మజ మరీచిప మాష మహర్షి వరులు
వాలఖిల్య వైఖానస పరమ మునులు
నియత భోజను లతి శోభ నెగడ విజిత
కాములౌ సిద్ధ చారణుల్ క్రాలు చుండ 1066

దివ్య రూప వతులు దివ్యాభరణ మాల్య
వేష్టిత లగువారు వేల కొలది
యప్సర స్సుదతు లనంగ కేళీ రతి
విధి విదుషులు వరిఢవిల్లు చుండ 1067

శ్రీ సమేత దేవ సీమంతినీ జన
సేవితమ్ము సిరుల జెలగు నదియు
నమృత భోజనులగు నమ రాసు రానీక
చరిత మగుచు సతము బరగు నదియు 1068

క్రౌంచ హంస ప్లవాకీర్ణ రమ్య మగుచు
సారసోత్కర సన్నాద పూరిత మయి
విశద వైడూర్య పాషాణ విలసిత మయి
స్నిగ్ధ సాగర తేజమై చెలగు దాని 1069

తెల్లనై విశాలమ్ములై దివ్య మాల్య
యుతములై తూర్య గీతాభియుక్తి నెగడు
కామగములౌ విమానముల్ కఠిన తపము
పేర్మి జగముల గెలుపొంది పేర్చు వారి
వప్సరో జన గంధర్వు లధివసింప
నెదురుపడ గాంచె రావణు డెల్ల యెడల 1070

ఘ్రాణ తృప్తి కరములై సౌమ్య మైన ని
ర్యాస రస సమేత మైన మూల
వనులు చందనంపు వనులు వేనకు వేలు
అరసి చూచు కొంచు నధ్వమందు 1071

ఉత్త మాగురు వనములు నుపవనములు
వాసనా పూర్ణమౌ జాతిఫల వనములు
గంధ బంధుర తక్కోల కాననమ్ము
లేగుచున్ గాంచె నా రాక్షసేశ్వరుండు 1072

పుష్పముల తమాల భూరుహ భవముల
మరిచ గుల్మములను మరియు నల్లె
యొడ్డు చెంత నెండుచున్న ముత్తియముల
ముత్తములను గాంచె పోవు దారి 1073

సాగరమ్ము చెంత శంఖ సంఘమ్ములు
పగడముల గములును వాడు గాంచె
కాంచె నెల్ల యెడల కనక శైలమ్ములు
రజత పర్వతములు రావణుండు
ఉల్లమునకు నించు నూట జాలులు గాంచె
కలక దేరి యున్న కొలకు లరసె 1074

విపుల ధన ధాన్య సంపద వెలయు వాని
నంగనా రత్న శోభిత మైన వాని
హస్తి హయ రథ సంబాధమైన వాని
నగరముల గాంచి రాక్షసనాథు డతడు 1075

చదును దేరి యుండి పదునెక్కి యెల్లెడ
పిల్ల తెమ్మెర మెల మెల్ల దాకు
స్వర్గ సన్నిభమ్ము సాగరానూపమ్ము
నరసి కన్గొనె ధనదానుజుండు 1076

అచట నతడు ముని జనాకీర్ణమై యున్న
మబ్బు వంటి పెద్ద మర్రి గాంచె
నన్ని దిక్కు లందు నా మర్రి కొమ్మలు
నూరు యోజనముల మేర ప్రాకె 1077

గజము తోడ మహిత కాయమౌ కచ్ఛప
మును భుజించు పూన్కి పూనికొంచు
వచ్చి గరుడు డలఘు బలశాలి యాతండు
కూరుచుండె నొక్క కొమ్మ మీద 1078

ఆకు లలమియున్న యా మఱ్ఱి కొమ్మను
భార మూనియుంట ప్రక్కలించె
విహగ సత్తముండు వినతా సుతుండు సు
పర్ణు డా యమేయ బల యుతుండు 1079

వాసముండి రచట వైఖానస మరీచి
పాఖ్య లట్టె మాష లజులు ననగ
వాలఖిల్య మౌని వరులు ధూమ్రాఖ్యులు
పరమ ఋషులు తపము నెరపుకొంచు 1080

వారి యెడల కరుణ వైనతేయుడు శత
యోజనముల తనరుపున్న కొమ్మ
గైకొని రయమార గజ కచ్ఛపమ్ముల
వెంట గొంచు నచటు వెడలి చనియె 1081

ఒంటి కాల నిల్చి యుండి ధర్మాత్ము డా
మిషము దాని బట్టి మెసవి వైచి
యట నిషాద దేశ మా చెట్టు కొమ్మతో
పతగ సత్తముండు హత మొనర్చి
ముని వరేణ్యులకు విమోచన గావించి
యతుల సంప్రహర్ష మాత డందె 1082

ఆ ప్రహర్షముననె యాతండు ద్విగుణీకృ
తమ్ము గాగ విక్రమమ్ము నంత
నమర సేవ్య మైన యమృతమ్ము గొనిరాగ
మతియుతుం డతండు మతి యొనర్చె 1083

ఉన్మథించి యా యయో జాలకమ్ముల
రత్నమయ గృహమ్ము ప్రక్కలించి
ఐంద్ర భవన గుప్తమౌ నమృతమ్ము తా
నపహరించి కొనియె నచటి నుండి 1084

అట్టిదాని మునిగ ణావృతమౌ దాని
పక్షి సత్తమ కృత లక్షణమును
మహి 'సుభద్ర' మనెడు మర్రిని కనుగొనె
నసుర నాథుడు ధనదానుజుండు 1085

హ్రాది నీశ్వరు డగు నా సముద్రమ్మున
కవలి గట్టు చేర నరిగి యాత
డాశ్రమమ్ము గాంచె నచ్చట నేకాంత
రమ్య పుణ్యమౌ నరణ్య మందు 1086

అచ్చట కృష్ణాజినో త్తరీ యాన్వితుడును
తత జటా భార వల్కల ధారి యైన
యసుర వర్యుని మారీచు డనెడు వాని
నిరత నియమిత భోజను నరసె నతడు 1087

రావణుం డతండు రాక్షసుతో సమా
గమము విధి విధమ్ముగా నొనర్చి
మనుజ దుర్లభముల మారీచుచే పూజ
లందు కొనియె రాక్షసాధిపుండు 1088

స్వయము గాగ తాను సంపూజన మొనర్చి
భోజ నోదకముల పొదవ జేసి
యర్థ సముపహితము నగు పల్కు మారీచు
డతని తోడ నిట్టు లంచు బల్కె: 1089

"లంక లోన నెల్ల రాక్షసాధీశ్వరా!
సుకుశలమ్మె గాదె క్షోణినాథ?
ఈవు మరల నిటకు నే యర్థమును గూర్చి
చేర వచ్చియుంటి శీఘ్రముగనె?" 1090

### * రావణుడు మారీచునకు తన సంకల్పము నెరింగించుట *

ఈ విధమ్ముగా వచింప మారీచుడు
రావణుడు మహా పరాక్రముండు
వాక్య కోవిదుండు పదపడి పల్కుల
పల్కె నిట్టు లంచు వానితోడ: 1091

## (36 వ సర్గ)

“ఏను పల్కుచున్న వివి తండ్రి! మారీచ!
యెల్ల పల్కు లాలకింపు మయ్య
ఆర్తి బడితి నేను నార్తుడనౌ నాకు
నీవె పరమ గతివి కావె యింక 1092

ఈ వెరింగి యున్న దే జనస్థానమ్ము
నందు ఖరుడు నాదు ననుగు దమ్ము
డతడు దూషణుడు మహాబాహు డెట్టులో
నాదు చెల్లి శూర్పణఖయు గూడ 1093

పిశిత భోజనుండు త్రిశిరుండు మహిత తే
జ స్సమన్వితుడు నిశాచరుండు
తక్కు గల్గువారు పెక్కురు శూరులు
లబ్ధ లక్షులైన రాత్రిచరులు 1094

ఉన్న వారు నిలిచి మన్ని యోగమ్మున
నచట నిత్యవాస మసుర జనులు
బాధ పెట్టు చుండి వైధర్మ చారులు
పరమ మునుల ఘోర వనము లోన 1095

భయదకర్ము లైన వారలు శూరులు
లబ్ధ లక్షు లైన రాత్రిచరులు
ఖరుని చిత్తవృత్తి యొరవడి జను వారు
పదియు నాల్గు వేల బలగ మెల్ల 1096

వార లెల్ల రింతవరకు జనస్థాన
మందు వాసమున్న యలఘు బలురు
ఖరుడు మొదలుగాగ గల రాక్షసుల్ వివి
ధాయుధముల కేల దాల్చియుండి
సన్నహనము లెల్ల సమకూర్చుకొని తాము
రాము నెదురు కొనిరి రణము లోన 1097

సంగరంపు మొనను సంజాత రోషుండు
రాము డాత డప్పు డేమి యనక
పరుషమైన పలుకు వ్యాపారితమ్ముగా
వించె కార్ముకమ్ము విశిఖములను 1098

ఉగ్రతేజు లగుచు నొప్పారు రాక్షసుల్
పదియు నాల్గు వేల బలగ మెల్ల
నాశమయ్యె తీక్ష్ణ నారాచ నిచయమ్ము
చేత మనుజుచే పదాతి చేత 1099

ఖరుడు రణములోన కడతేరి పోయె దూ
షణుడు సైత మాత డణగి పోయె
త్రిశిరు డైనను కడతేరెను దండకా
వనము నిర్భయ మయి పరగు చుండె 1100

అల్క తండ్రిచేత నాలి తోడుత బహి
ష్కృతు డతండు క్షీణ జీవితుండు
వాడు చంపినాడు బలమెల్ల క్షత్రియ
పాంసనుండు మాన వాధిపుండు 1101

కర్కశుండు లోభి కడు దుష్ట శీలుండు
తీక్ష్ణు డాత డవిజితేంద్రియుండు
త్యక్త ధర్ముడా నధర్మాత్ముడున్ మూర్ఖ
ధహిత రతుడు ప్రాణు లన్నిటి యెడ 1102

వనములోన నతడు వైరము లేకయే
యొడలి బల మొకండె యూత గాగ
చెక్కు పారవైచి ముక్కును చెవులు నా
చెల్లెలిన్ విరూప జేసి వైచె 1103

నాకు నీవు నా జనస్థానమున నుండి
బల్మి మెయిని వాని భార్య సీత
సుర సుతోపమాన సుందరి గొనివచ్చు
పనికి తోడు పడగ వలయు నచట 1104

చెంత నుండి నీవు చేయూతగా నున్న
వెన్ను దన్ని తమ్ము లున్న యెడల
సరకు సేయ నెల్ల సురల నైనను గాని
బవర మందు మహిత బలుడ నేను 1105

కాన నాకు తోడు కమ్మీవు రాక్షసా!
చాలువాడ వీవు శౌర్యమందు
సమర కౌశలమున సాంద్ర దర్పమ్మున
నీడు నీకు నెవడు లేడు సుమ్ము 1106

చతు రుపాయ వేత్త వతి శూరుడవు నీవు
నిఖిల మాయల గడు నేరుపరివి
అందు కొరకె వచ్చినాడ నిశాచరా!
నీ సమీపమునకు నేను నేడు
వినుము సాయ మనగ నొనరింప వలసిన
పని యదేమొ నాదు పలుకు బట్టి 1107

ఒడల వెండి చుక్క లొప్పారు బంగారు
వింత జింక రూపు వెలయ నీవు
రాము డాత డున్న రమ్యాశ్రమమ్మున
చెలగుచుండు మచట సీత యెదుట 1108

నిన్ను నప్పు డట్లు నిస్సంశయమ్ముగా
జింక రూపువాని సీత కాంచి
'పట్టితెం' డటంచు భర్తను లక్ష్మణు
గూడ వేడుకొనును వేడుక పడి 1109

అంత వారు తొలగి యరుగ నెవ్వరు లేని
చోట నున్న సీత సుఖము మీర
నపహరించువాడ నడ్డు నాపును లేక
చంద్రు దీప్తి రాహు చంద మొప్ప 1110

అందు పిదప భార్య నపహరించుట చేత
నుదిల కొనుచు రాము డుండ సుఖ మె
సంగ శంక లేక సంహరింతును కృతా
ర్థాంతరాత్ము డగుచు నతని నేను" 1111

మహిత చిత్తు డైన మారీచునకు నప్పు
డతని రామ కథల నాలకింప
వాయి యెండ బారి పోయెను వానికి
నెడద మిగుల నడలు గడలు కొనియె 1112

వాడి పోయి యున్న వాతెరల్ దడిపి రె
ప్పార్ప నట్టు లున్న యట్టి కనుల
ప్రాణ ముడిగి నట్టి ప్రాణియ ట్లార్తుడై
తేరి రావణు దెస పార జూచె 1113

రామ విక్రమ వేత్త యరణ్యమందు
త్రస్త సువిషణ్ణ చిత్తుడై రావణునకు
నంజలి ఘటించి యున్న దున్నట్లు చెప్పె
హితము వానికి తనకును హితము పల్కు 1114

## (37 వ సర్గ)

### * రావణునకు మారీచుని హితోపదేశము *

అసుర లోక నాథు డాడిన యా పల్కు-
లాలకించి ఇట్టు లంచు బదులు
పల్కె ప్రాజ్ఞతముడు వాక్య కోవిదుడు మా
రీచు డా నిశాచ రేశ్వరునకు: 1115

"అవని నెల్లపు డిచ్చక మాడు వారు
కావలసి నంద రో రాజ! కలరు గాని
అప్రియ మ్మైన హితవాక్య మాడు వాడు
నాలకించెడి వాడును చాల యరుదు 1116

ఎరుగకున్న వాడ వీవు నిక్క మయుక్త
చారు డౌట వలన చపల మతివి
ప్రబల బాహు వీర్య రాము గుణోన్నతు
శక్ర వరుణులకును సాటి వాని 1117

సేమ మింక తండ్రి! చేకురవలె నాక్కొ?
ధరణి నున్న సర్వ దానవులకు
రాము డల్కమై నరాక్షస మొనరింప
కుండ వలయు నొక్కొ యుర్వి యెల్ల? 1118

జనన మొంద దొక్కొ జనకాత్మజాత నీ
జీవితమ్ము ముగియ జేయు కొరకె?
సీత మూలముననె చేటు మూడుట సంభ
వింప కుండు నొక్క యింక నాకు? 1119

అణగి పోక యుండ నగునొక్కొ పురి లంక?
త్వత్సమేత మసుర తతి యుతమ్ము
ప్రభువు గాగ నిన్ను పడసి నిరంకుశ
కామ వృత్త గతిని గడచు వాని 1120

దుష్ట శీలుడు కడు దుర్మతి కామ వృ
త్తుండు పాప మంత్రితుండు నిన్ను
బోలునట్టి వాడు భూపతి హత మార్చు
తన్నును తన వారి తన విషయము 1121

పౌరద్రోల లేదు పానిని తండ్రి మ
ర్యాద మీర డెట్టు లైన నతడు
కాడు లుబ్ధు డతడు కాడు దుశ్శీలుడు
క్షత్రి యాధముండు కానె కాడు 1122

వాడు ధర్మగుణ వివర్జితుడును కాడు
కోసల సుత కెలమి గూర్చు వాడు
కాడు తీక్ష్ణు డతడు కాడు నిఖిల భూత
తతికి కీడు సేయు తలపు వాడు 1123

కాంచి కైక చేత వంచితు డైనట్టి
నిత్య సత్య వాదిని దన తండ్రి
నాచరించు వాడ నంచు ధర్మాత్ము డ
తండు ప్రవ్రజించె తండ్రి వనికి 1124

కైకయికి ప్రియమ్ము కావింపగా గోరి
తనను తండ్రి దశరథునకు గూడ
విడచి వుచ్చి రాజ్య విభవమ్ము భోగముల్
దండకా వన మ్మతండు సొచ్చె 1125

అవిజి తేంద్రియుండు నవిపశ్చితుడు కాడు
కర్కశుండు తండ్రి! కాడు రాము
డనృత దుశ్శ్రుతమ్ము లైన పీ రీతిగా
నీవు పల్క పొసగ దింత యైన 1126

తనువు దాల్చియున్న ధర్మమే రాముండు
సత్య విక్రముండు సాధు డతడు
సర్వ లోకమునకు చక్రవర్తి యతండు
ఎల్ల నిర్జరులకు నింద్రు నట్లు 1127

ఈవు నెట్టు లామె స్వీయ తేజమ్ముఁ బ్రో
వంగ నున్నదాని వాని యా వి
దేహ తనయ బల్మిఁ దేర గోరుచు నుంటి
పద్మినీ కళత్రు ప్రభను బోలె 1128

విశిఖ శిఖలు గల్గి విల్లును కత్తి యిం
ధనము లైన యట్టి తాకరాని
రామ వహ్ని జెలగి రగిలిన దానిని
రణములో చొరంగ రాదు నీకు 1129

చాప విపుల వివృత సందీప్త వదనుని
మార్గణార్చిషుని నమర్షణుని శ
రాస పాశ హస్తుడైన వానిని వీరు
శత్రు సైన్య నిచయ సంప్రహరణు 1130

అయ్య ! రామ నామ కాంతకు నాతని
దరికి జేరనరుగ దగదు నీకు
సంపరిత్యజించి సౌఖ్యమ్ము రాజ్యమ్ము
స్వీయ వాంఛితమ్ము జీవితమ్ము 1131

జనకరాజ తనయ తనదైన యాతని
దప్రమేయ తేజ మగును చూవె
ఆమె నపహరింప రామచా పాశ్రయ
కావు చాలువాడ వీవు కాన 1132

వాని కా నరేంద్ర పంచాస్యునకును హ
ర్యక్ష వక్షునకును రమణి భార్య
ప్రాణములకు మించి వానికి ప్రియమైన
దనుసరించి నడచు నతని నెపుడు 1133

వెనకరాక యుండు సీత సుమధ్యమ
మైథిలేశ తనయ మహిత తేజు
డైన వానికి ప్రియ యతి దీప్తమై నట్టి
హవ్య వాహను శిఖ యట్టి రీతి 1134

ఏల వ్యర్థమైన యీ ప్రయత్నము నీకు
నాచరింప రాక్షసాధినాథ!
వాని కెదురు పడితి వేని రణమ్మున
నదె ముగింపు నీదు బ్రదుకునకును 1135

బ్రదుకు సుఖము రాజ్య వైభవ మను నివి
దొరకు టన్నదే సుదుర్లభమ్ము
అనుభవింపగ చిర మాశింతు వేని కా
వింపకుండు రామ విప్రియమ్ము 1136

అందుచే విభీషణాదులౌ ధర్మిష్ఠు
లైన నీ యమాత్యు లందర గెడ
గూడి మంతనమ్ము లాడిన పిమ్మట
నిశ్చయ మ్మొకండు నీవు నెరపి 1137

తూచి చూచు కొనియు దోషముల్ గుణములు
నెద బలాబలమ్ము లెంచి చూచి
స్వీయ బలము రాఘవేశ్వరుని బలమ్ము
నరసి వాస్తవమ్ము నెరిగి యుండి
యేర్పరించి నిశ్చయించి మేలును కీడు
తగినయట్లు చేయదగును నీకు 1138

రణములో నీకు కోసల రాజ సూను
నెదురుకొనుటయే తగదని యెంతు నేను
నిదియు వినగదె రాత్రించరేశ! యింక
నుత్తమ మ్మర్థమౌ పల్కు యుక్తి యుతము 1139

## (38 వ సర్గ)

### * మారీచుడు తన యనుభవమును వివరించుట *

మును పొకపుడు నేను భూధరమ ట్లున్న
వాడ వేయి కరుల బలము గల్గి
యున్నవాడ వీర్య మొప్పార నీ వసుం
ధర యి దెల్లకడల తిరుగుచుండి 1140

కారు నల్ల మబ్బు గేరుచు తప్త చాం
పేయ కుండలములు మెరయు చుండ
పర కిరీట ధారి పరిఘాయుధుండు నై
వెరపు లోకమునకు బరపు చుండ
తిరుగులాడు చుండితిని దండకా వని
మునుల మాంసములను తినుచు నుండి 1141

అట్టి యెడల నా భయమున విశ్వామిత్ర
ముని వరుండు ధర్మబుద్ధి యుతుడు
స్వయము గాగ చేర జని దశరథ నరే
శ్వరుని తోడ నపుడు పల్కె నిట్లు: 1142

'నేడు రాఘవుండు నెమ్మది మెయి నను
గాచు గాక పర్వ కాలమందు
ఘోరమైన భయము మారీచు వలన ను
త్పన్న మయ్యె నాకు ధరణి నాథ!' 1143

దశరథేశ్వరుండు ధర్మాత్ము డప్పు డీ
విధముగా వచింప విన్నవాడు
బదులుపల్కె మహితభాగుడౌ ముని వరే
ణ్యునకు కౌశికాన్వ యోద్భవునకు: 1144

'పదియు రెండు నేండ్ల బాలుడు రాఘవుం
డస్త్ర విద్య నేర్చి నతడు కాడు
వలసె నేని నాదు బల మది యెల్లను
వెంబడించి నిన్ను వెడలి వచ్చు 1145

స్వయము గాగ నేనె చతురంగ బలముతో
నరుగు దెంచి రాత్రి చరుల గముల
నీ మనమ్ము కోరు నీ శత్రువులను వ
ధించు వాడ తాపసేంద్రచంద్ర!' 1146

అని వచింప విన్న యా మౌని నాథుండు
నవనినాథున కిటు లని వచించె:
'రాము డొకడు దక్క నే మహా సైన్యమ్ము
చాలకుండు నా నిశాచరునకు 1147

ఆహవముల లోన నభిపాలకుండవు
దేవతలకు నైన నీవ కావె
తెల్ల మయ్యె రాజ! ముల్లోకముల యందు
మున్ను నీవు నెరపియున్న దెల్ల
ఉండనిమ్ము సైన్య ముద్దామ మో పరం
తపన! నిలువ నిమ్ము దాని నిచట 1148

బాలు డైన నితడు పరమ తేజశ్శాలి
వాని నిగ్రహింప వలతి యితడు
చనెడు వాడ తోడుకొని రాము నా వెంట
స్వస్తి యగుత నీకు శత్రు తపన!' 1149

అని వచించి యతడు ముని వరేణ్యుడు మాన
వేంద్రు నాత్మజాతు వెంట గొంచు
వెడలె పరమ మైన ప్రీతి విశ్వామిత్రు
డపుడు తనదు నాశ్రమ పదమునకు 1150

అప్పు డతని దండ కారణ్యమున యజ్ఞ
మొనరుచుటకు దీక్ష బూని నతని
చేరి నిలిచి యుండె చిత్రమౌ విల్లెక్కు-
పెట్టి పట్టి రాఘవేశ్వరుండు 1151

పద్మపత్ర సన్నిభాక్షుండు నసుదిత
వ్యంజనుండు శ్రీ సమన్వితుండు
ధన్వి యేక వస్త్రధరుడు నై కాంచన
మాల తోడి శిఖయు గ్రాలుచుండ 1152

కాంతు లీన దండకారణ్య మది యెల్ల
దీప్తమైన స్వీయ తేజమునను
కానవచ్చె నపుడు కనులకు రాముండు
నుదిత బాలచంద్రు నుద్దిగాగ 1153

అంత నేను మేఘ మట్లుండి తప్త చాం
పేయ కుండలములు మెరయుచుండ
దత్త వరుడ బలిని దర్ప మేపార నా
యాశ్రమమ్ము జేర నరిగి నాడ 1154

చొచ్చినాడ నేను చెచ్చెర నాతండు
నరయుచుండ నుద్య తాయుధుండ
కాంచి నన్ను నతడు కార్ముకమును సజ్య
మాచరించె సంభ్రమమ్ము లేక 1155

ఈసడించి బాలు డీతడు రాఘవుం
డంచు నేను మోహ మలము కొనగ
దరియ నురికినాడ దాని విశ్వామిత్రు
సవన వేది త్వర యెసంగు నట్లు 1156

శాత సాయకమ్ము శత్రు నిబర్హణ
మతడు విడిచి పుచ్చె నట్టి యెడల
దాన నేటు వడిన నేను నూరామడ
దూర మున్న కడలి త్రోపు వడితి 1157

తలప కుంట వాడు తండ్రి! నన్ జంపంగ
నపుడు రక్షసేసె నతడు వీరు
డే నచేతనుండనై నిరస్తక్రీడ నైతి
రాము నాశుగముల రయము చేత 1158

వాడు నన్ను నట్లు పడద్రోయ గంభీర
సాగ రాప్రమేయ సలిలమందు
ఒడల తెలివి పెద్దయుం బ్రొద్దునకు నొంది
తండ్రి! లంక జేర దరలినాడ 1159

అట్లు తప్పిపోతి నప్పుడు వానిచే
పడిరి నేల తోడి వార లెల్ల
బాలు చేత నస్త్ర పటిమ లేనట్టి య
క్లిష్టకారి రఘుకులేశు చేత 1160

వల దటంచు నట్టివాడను వారించు
చుండ రాముతోడి యుద్ధమునకు
నీవు తొడరు దేని రావణా! ఘోర వి
పత్తు నత్వరమ్మ పడయు దీవు 1161

కీడు దుఃఖ మీవు క్రీడారతి విధిజ్ఞు
లైన వారి కెల్ల రసుర జనుల
కతి వినోద భర సమాజోత్స వాఢ్యుల
కేరి కోరి యాహరించు కొందు 1162

రమ్య హర్మ్యములను ప్రాసాదముల నిండి
వివిధ రత్న జాల వేష్టితమయి
వెలుగు నగరి లంక వీక్షించు వాడవు
మంట గలసి పోవ మైథిలికయి 1163

పాపములనె యొనరుపని పవిత్రులె యైన
పావులైన వారి పజ్జ నుంట
పాదరుదురు పరుల పాపమ్ములన్ ఫణి
హ్రదము లోని మత్స్య రాశి వోలె 1164

దివ్య చంద నాభిదిగ్ధాంగులన్ దివ్య
భూషణోత్క రాభిభూషితులను
దైత్య జనుల నెల్ల ధరణిపై గాంతువు
కూలిపోవ నీదు కుత్సితమున 1165

ఆంధ్రు పీడి పోవ నాంధ్రతో గూడియు
నెల్ల కడల పరుపు లిడుచు చావ
దక్క యున్న వారి దిక్కు లేకున్న రా
త్రించరులను నీవు కాంచ గలవు 1166

శాత విశిఖ జాల సంపరిక్షిప్తమై
యనల శిఖలు చక్క నలము కొనగ
సంప్రదగ్ధ భవన జాలయౌ లంక నిం
కరయు దీవు సందియంబు లేదు 1167

పరుల సతుల బల్మి బట్టుట కన్న నిం
కొండు దొడ్డ పాప ముండ బోదు
పృథ్వినాథ! నీ పరిగ్రహములు వేల
కొలదిగా ప్రమదలు గలరు గాదె! 1168

స్వీయ దార నిరతుడై యుండుమా ! నీవు
రాక్షసా ! స్వ కులము రక్ష సేయు
మానము నభివృద్ధి మహనీయ రాజ్యమ్ము
స్వీయ వాంఛితమ్ము జీవితమ్ము 1169

సౌమ్యులైన వారి సతులెల్ల వారల
నాప్త మిత్ర వర్గ మట్టులుగనె
పెద్దకాల మనుభవింప గోరినను కా
వింపకుండు రామ విప్రియమ్ము 1170

ఏను సుహృదుడ కడు నివారించుచుండ
బల్మిమై సీత ధర్షించువాడ వేని
చనెదవు సబాంధవము యమ సదనమునకు
క్షీణ బలివి రామ శరాత్త జీవితుడవు 1171

## (39 వ సర్గ)

ఇట్టు లున్న వాడ నెట్టులో యప్పుడు
పొలికలనను విడచి పుచ్ఛ నాత
డిప్పుడైన గాని యే మైనదో యది
యాలకింపుము బదులాడ కుండ 1172

అట్లు సల్పి యున్న నైన ననిర్విణ్ణు
డైన నేను నిర్వ్వరసురుల మృగ
రూప ధరుల గూడి యేపున దండకా
వనము జొచ్చియున్న వాడ రాజ! 1173

దీప్త జిహ్వకుండ తీక్ష్ణ దంష్ట్రుండ మ
హా కళేబరుడ మహా బలుండ
మెలగు చుంటి మహిత మృగమనై దండకా
వనము లోన మాంస భక్షకుడుగ 1174

అగ్నిహోత్ర శాల యందు తీర్థమ్ముల
చైత్య సాంద్ర వృక్షజాల మందు
తిరుగు చుంటి ఘోర తరుడనై రావణా!
తపసి జనుల జెనకి తాకుచుండి 1175

ధర్మచారు లైన తాపసోత్తంసుల
దండకా వనమున చెండనాడి
వారి రుధిర ధార పానమ్ము సేయుచు
మేలి మాంసములను మెక్కుచుండి 1176

వర మునీంద్ర మాంస భక్షుడ క్రూరుండ
విపిన చరుల నెల్ల వెరగు పరచి
నేను నట్లు రుధిర పాన మత్తుండనై
కడగి ధర్మదూషకుడుగ తిరిగి 1177

అపుడు చెంత జేర నరుదెంచి రాముని
తపము నూని యున్న ధర్మచారి
నా విదేహ పుత్రియౌ మహాభాగ మ
హా రథుని సుమిత్ర యనుగు పట్టి 1178

అట్లు నేను నియమితాహారుడౌ వాని
నఖిల భూత హిత సమభినిరతుని
విపిన గతుని రాము తపము నూనిన వాని
విపుల బలుని పరిభవించి యపుడు 1179

తపసి యాత డనుచు తలచిన వాడనై
పూర్వ వైర ముల్లమున దలంచి
తీక్ష్ణ శృంగమైన తిర్యగాకృతి దాల్చి
దరియ నురికినాడ దద్ద కనలి 1180

తలచు కొనుచు మున్ను తాకిన పోటరి
చంపనుంటి చింత సలుప కుండ
బల్మి మీర విల్లు వంచి సుపర్ణమ్ము
లనిల నిస్వనమ్ము లైన వాని
శాత సాయకముల శత్రు నిబర్హణ
ములను విడిచి పుచ్చె మూటి నతడు 1181

వజ్ర సన్నిభములు బాణము లవి రక్త
భోజనములు సుష్ఠు ముక్తములును
సహితముగ నెల్ల సన్నత పర్వముల్
కూడి యరుగుదెంచె మూడు నొకట 1182

విదిత మౌట రాము విక్రమమును తొల్లి
యతని శరము భయము నరసి యుంట
దాటువారి దాన తప్పించు కొని పోతి
వా రిరువురు నేల బడి రసురులు 1183

రాము శరము నన్ను నామెయి విడువంగ
పడసి యుండి యెట్లొ ప్రాణములను
నేను ప్రవ్రజించి నెమ్మది నుంటిని
తగిలి యోగమందు తపసి వృత్తి 1184

*** మారీచ హితోపదేశము ***

తరువు తరువు నందు దర్శించుచుంటిని
చీర కృష్ణ చర్మ ధారి యైన
కార్ముకమ్ము కేల గైకొన్న రాముని
పాశహస్తు యముని పగిది వాని 1185

కాంచుచుంటి వెరపు గదురంగ రామ స
హస్రములను రావణా! యటు వయి
రామభూతమై యరణ్య మ్మిదెల్ల కా
నంగ వచ్చుచుండె నా కనులకు 1186

రాక్ష సాధినాథ! రామునే కనుగొను
చున్న వాడ నేను శూన్యమునను
కాంచి నేను స్వప్న గతుడైన రాముని
ఉడిగి పోవ చేష్ట లుల్కి పడుదు 1187

రామ సంత్రస్తుడౌ నాకు రావణా! ర
కార మాదిని గల్గిన పేరు లెల్ల
రత్నములె యైన గానిమ్ము రథము లైన
హృదయమున కడు భీతి పుట్టించు చుండు 1188

ఏ నతని ప్రభావ మెరిగిన వాడను
జగడ మతని తోడ తగదు నీకు
బలిని నముచినైన బొలియింప జాలు నం
తటి వలంతియె రఘు నందనుండు 1189

రాముతోడ పోరు రణమున రాక్షసా!
ఓర్చి కాకయున్న నూరకుండు
చూడ నిచ్చగించు చున్నచో నన్నును
త్రవ్వకుండు మీవు రామ కథలు 1190

యోగ్యవృత్తి ధర్మ మొనరించు పెక్కురు
సాధు జనులు తాము జగమునందు
సర్వ నాశ మైరి సపరిచ్ఛదమ్ముగా
పరు లొనర్చు తప్పు పనుల బట్టి 1191

నేను గూడ నట్లె నీ యపరాధమ్ము
వలన నాశనమ్ము పడయు దసుర!
నెరపు కొనుము నీవు నీ కర్జ మైనట్లు
నిన్ను ననుసరించి నేను నడవ 1192

రాముడో మహా పరాక్రమ వంతుండు
మహిత సత్త్వశాలి మహిత బలుడు
వాడు సకల దాన వానీకమున కంత
కుండు తాను కాకయుండు నొక్కొ? 1193

మున్ను శూర్పణఖను గూర్చి పొగరు కొన్న
ఖరు డతండు జనస్థాన గతుడు పోయి
రాలె నక్లిష్ట కర్ముడౌ రాము చేత
చెప్ప నిజ మిందు రాముని తప్పదేమొ! 1194

బంధు హితమును గోరు నా పల్కు లివ్వి
యేను చెప్పున ట్లంగీకరింప వేని
బంధు యుతముగ విడుతువు ప్రాణము లని
నే దలిహ్మగ రామేషు నిహతుడ వయి" 1195

## (40వ సర్గ)

అర్థమున్ సమర్థ మైనట్టి పల్కు మా
రీచు డాడినది నిశాచరుండు
విన్నవాడె యైన స్వీకరింపక యుండె
మందు గొనని యట్లు మరణ కామి 1196

*** తోడ్పాటుకై రావణుడు మారీచుని నిర్బంధించుట ***

వాని పథ్య హితము పల్కెడు వాని మా
రీచు నా నిశాచ రేశ్వరుండు
కాంచి కానివాని కఠిన వాక్యమ్ముల
నుడివె కాల చోదితు డయి యిట్లు : 1197

"పొసగకున్న యర్థమును నాకు మారీచ!
చెప్పుచుంటివి గద యిప్పు డీవు
నుడువు వాక్య మిదియు కడు నిష్ఫల మ్మగు
ఛౌటిలోన విత్తు నాటినట్లు 1198

నేరవు గద నాకు నీదు పల్కుల తోడ
త్రోసిపుచ్చ రాముతోడి పోరు
పాప శీలుడైన వాడును మూర్ఖుండు
నందు పైన మనుజు డతని తోడ 1199

కడకు ద్రోచి చెల్మికాండ్రను రాజ్యమ్ము
కన్న తల్లి దండ్రి నన్ని యట్లె
ప్రాకృతమ్ము వనిత వాక్యమ్ము విని యాత
డడవి కేగె నొక్క యడుగు లోన 1200

సమరమందు ఖరుని సమయించి నాతని
ప్రాణములకు మిన్నయైన కూర్మి
కత్తె సీత నీవు కాంచుచు నుండంగ
తప్ప కపహరింప దగును నేను 1201

ఇట్టు లంచు నిశ్చయించిన బుద్ధి మా
రీచ! పోదు కొనియె హృదయమందు
దాని మరలుపంగ తరముగా దింద్ర స
హాయు లైన యా సురాసురులకు 1202

కార్య నిశ్చయ మిది కావించు నెడల ని
న్నడిగి సప్పు డిట్టు లాడ నగును
కొంచకుండ నీవు మంచియు చెడ్డ య
పాయ మైన నే యుపాయ మైన 1203

పలుక దగును తన్ను ప్రశ్నించి నపుడు దో
షజ్ఞుడైన వాడు సచివ వరుడు
ధరణి పతికి నుద్యతాంజలియై యుండి
తన కలిమిని గోరుకొనెడు వాడు 1204

ఎదురుకోలు గాక మొదలు మెత్తదనమ్ము
నెసగుచుండు పల్కు హితము శుభము
నొప్పు మీరుచుండ నుపచార యుక్తమై
పల్కు దగును ధరణిభర్త తోడ 1205

చిన్న చూపు తోడ మన్ననయే లేని
పల్కులాడి హితము పల్కియున్న
మాన్యుడైన నృప వరేణ్యుండు మారీచ!
వాడు దాని మెచ్చువాడు గాడు 1206

రూపు లైదు దాల్చి భూపు లత్యోజసు
లుండువార లెపుడు లోకమందు
వహ్ని రూపు నమరపతి రూపు సోమ వ
రుణుల రూపులు యము రూపు ననగ 1207

వేడిమియును నల్లై విక్రమ సౌమ్యముల్
దండమున్ ప్రసన్నతా గుణమ్ము
తాల్చి యుండు వారు ధరణీశ్వరులు మహా
త్మకులు సంతతమ్ము దనుజ వర్య!
దానివలన సర్వ దశలందు మాన్యులు
పూజ్యు లగుదురు గద భూమిపతులు 1208

ఈవు నైన ధర్మ మెరుగక కేవల
మొడల మరపు గ్రమ్మ నుండి యిట్లు
నన్ను జేరవచ్చి నతని దురాత్మత
పరుష మాడ నిచ్చపడుచు నుంటి 1209

అడుగ లేదు ని న్నిపుడు గుణ దోషము
లసుర! నాదు క్షేమమైన గాని
ఏను చెప్పియున్న దిప్పుడు నీ కింత
మాత్ర మమిత విక్రమా! విను మరి 1210

ఇయ్యెడల నొనర్ప నీ మహా కార్యమ్ము
సలుప నగును నాకు సాయ మీవు
వినుము సాయ మనగ నొనరింప వలసిన
పని యదేమొ నాదు పలుకు బట్టి 1211

ఒడల వెండి చుక్క లొప్పారు బంగారు
వింత జింక రూపు వెలయ నీవు
రాము డాత డున్న రమ్యాశ్రమమ్మున
చెలగు చుండు మచట సీత యెదుట
మరులు గొల్పి పుచ్చి మైథిలి నంత నీ
కిష్టమైన యట్టు లేగవచ్చు 1212

కాంచి యంత నిన్ను కాంచన మాయా మృ
గమ్ము నెడద నబ్బురమ్ము గదుర
'గొంచు రమ్ము దీని' నంచు శీఘ్రమ్ముగా
చెప్పు రామునకును సీత యపుడు 1213

కడచి తొలగి చనగ కాకుత్థ్సు డట నరు
దెంచి నీవు దూర దేశమునకు
నార్పు చెలగ కూయు 'హా! సీత! లక్ష్మణా!'
యంచు రాము పల్కు లట్లు దోప 1214

అదియు నాలకించి యనుగమించును రాము
దారి నరసికొంచు తాను గూడ
సౌహృదమ్ము మీర సౌమిత్రి సంభ్రాంతి
ననిపి పుచ్చ సీత యామె గూడ 1215

కడచి తొలగి చనగ కాకుత్థ్సుడున్ సుమి
త్రాత్మజుండు నట యథాసుఖమ్ము
తోడుకొంచు వచ్చువాడ వైదేహిని
శచిని గొంచువచ్చు శక్రు నట్లు 1216

ఇట్లు గాగ కార్య మియ్యది యొనరించి
యిచ్చ వచ్చినట్టు లేగు మసుర!
సగము రాజ్య మే నొసంగుదు మారీచ!
నీకు సువ్రతాఢ్య! నిక్కువముగ 1217

మంగళమ్ము సౌమ్య మార్గమ్ము చను మీవు
కార్య మిదియు పెంపు గాంచునట్టు
లేను నిన్ను ననుగమించెడు వాడను
స్యందనమున దండకాటవికిని 1218

పొంది యిట్లు సీత పోరు గావింపక
యాస గొల్పి రాము మోసపుచ్చి
తిరిగి నేను లంక కరుగువాడను నిన్ను
గూడి కార్యము సమకూరుచు కొని 1219

ఈవు చేయ వైతి వేని మారీచ! ని
న్నిపుడె చంపివైతు నింక నేను
బల్మి నైన గాని పని యిది నాయది
నీవు తప్పకుండ నెరప బోదు
వేని తోడుత నెదిరించి నిల్చిన వాడు
సౌఖ్యములను బడయజాల డెపుడు 1220

అతని జేరంగ జన సంశయమ్ము బ్రదుకు
ధిక్కరించుటనను చావు నిక్క మిప్ప
డీ యథార్థము నీ బుద్ధి నెంచి చూచి
యిం ది కెది పథ్య మదియు కావింపు మట్లు" 1221

## (41 వ సర్గ)

రాజు పల్కు నట్లు ప్రతికూలమౌ పల్కు
లానతీయ నసురు డాలకించి
పరుషమైన పల్కు పల్కె మారీచుడు
నిఖిల రాక్షసాధినేత తోడ 1222

*** మారీచుడు నిర్బంధము చేత**
**రావణునకు తోడ్పడ నొప్పుకొనుట ***

"పాపకర్ము డెవడు పనిపూని బోధించె
నీ వినాశనమ్ము నీకు నిట్లు
రాక్షసాధినాథ! రాష్ట్రి యుతము పుత్ర
సహితముగ నమాత్య సహితముగను? 1223

సుఖము గుడుచు నిన్ను చూచి మెచ్చక యున్న
పాపకార్య కారి వా డెవండు?
నేర్పు మీర నెవడు నీకు బోధించెనే
మరణ మందిరంపు మార్గ మిదియు? 1224

శత్రు జనులు నీకు స్పష్టమౌ నిది చక్క
నల్పవీర్యు లైన యసుర జనులు
వారు కోరుచున్నవారు నీ నాశమ్ము
కడు బలియుని నిన్ను క్రందుపరుప 1225

ఎవడు బోధపరచె నిది నీకు క్షుద్రుడౌ
వాడు నహిత వచన మాడువాడు
స్వీయ కర్మఫలము చేత నిశాచరా!
నిన్ను గూల్ప జూచుచున్న వాడు? 1226

చంప దగిన నైన చంపకున్నారుగా
నీ సచివుల రావణాసుర! పెడ
త్రోవ యిట్లు నీవు త్రొక్కగా నెట్లైన
నిన్ను నిగ్రహింప కున్నవారి 1227

తప్పు దారి బట్టి తన యిచ్చ వచ్చిన
సరణి నడచు నృపుని సత్సచివులు
మరలుపంగ దగును పరి పరి విధముల
మరలుప దగియుండి మరల వైతి 1228

పూని ధర్మ మర్థమును కామము యశమ్ము
గెలుపు గొనెడు వారికెల్ల మేటి
పడయువారు సుమ్ము స్వామి ప్రసాదమ్ము
న న్నిశాచరాధినాథ! యెపుడు 1229

అదియు నెల్ల వ్యర్థమై పోవు రావణా!
అందు హెచ్చు తగ్గు లయ్యె నేని
పడయువారు స్వామి వైగుణ్యమున మహ
నీయ మైన దుఃఖ మితర జనులు 1230

అధిపమూలకమ్ములౌ ధర్మ జయములు
గెలుపు గొనెడు వారి కెల్ల మేటి
అందు వలన మానవాధీశ్వరులను కా
పాడ వలయు నే యవస్థ నైన 1231

పాలనమ్ము సేయ వాడిమిచే గాదు
రాజ్య మో నిశాచ రాగ్రగణ్య!
ప్రజల కెల్లరకును ప్రతికూలమై గాని
యసుర! వినయము విడనాడి కాని 1232

వాడియైన కార్యపద్ధతి గల మంత్రు
లధిపుతోడ గూడ నణగువారు
మిత్రు పల్లములను మెత్తని సారధి
తోలుచున్న దురుసు తురగము లటు 1233

యోగ్య వృత్తి ధర్మ మొనరించు పెక్కురు
సాధు జనులు తాము జగమునందు
సర్వనాశ మైరి సపరిచ్ఛదమ్ముగా
పరు లొనర్చు తప్పు పనుల బట్టి 1234

వాడియైన వాడు ప్రతికూలుడౌ వాడు
ప్రభువు తమకు బ్రోపు ప్రాపు నైన
ప్రజలు రావణాసురా! పెంపు గాంచరు
క్రోష్టు రక్షణమున గొర్రె లట్లు 1235

దనుజు లెల్లవారు తప్పక రావణా!
వేగ నేల పాలు కాగరారు
వారలకును నీవు ప్రభు వౌట క్రూరుడ
వవిజితేంద్రియుడవు నహిత మతివి 1236

కాని నియ్యదియును కాకతాళీయము
నే నెరపిన ఘోరమైన కార్య
మిందు నిన్ను గూర్చియే శోచనీయమ్ము
బలముతోడ నేల ప్రాలు దీవు 1237

నన్ను గూల్చివైచి నిన్నును రాముండు
కూలనేయు నచిర కాల మందె
ఏను దీనివలన కృతకృత్యు డౌదును
శత్రు హతుడ నౌట చావనుంట 1238

రాము గాంచి నంతనే మృతి నొందిన
యట్టు లింత లెక్క పెట్టు నన్ను
నీవు చచ్చినట్టు లెరుగు చుట్టాలతో
నపహరించి తెచ్చినంత సీత 1239

తోడుకొంచు వచ్చు వాడవేన్ సీత నా
శ్రమము నుండి నేను సాయపడగ
నుంత మీవునైన నుండను నేసును
రాక్షసాళి తోడి లంక ప్రైన 1240

ఏను నీ హితైషిని నివారించుచున్న
నీ పలుకు నిశాచర! చెవి కెక్క నీవు
ఆయు వుడిగి ప్రేత సదృశులైన నరులు
చేకొనరు హితమాప్తులు చెప్పిన యది" 1241

## (42 వ సర్గ)

ఈ విధమ్ముగా వచించి మారీచుడు
రావణాసురునకు నా వెనుకను
'పోద' మంచు పల్కె నా దానవేంద్రున
కడలుచుంట దీనుడైన వాడు 1242

శర శరాస నాసి ధరునకు వానికి
నేను కానబడితినేని మరల
నుడిగిపోవు మద్వధోద్యత శస్త్రిని
చేత నింక నాదు జీవితమ్ము 1243

రాము మీదికిన్ పరాక్రమించిన వాడు
మరలిరాడు వా డుసురుల తోడ
పరగువాడు పీడు ప్రతిరూప మట్టులు
నీకు కాలదండ నిహతునకును 1244

ఏమి చేయవచ్చు నికమీద నే నైన
నిటు దురాత్ము డగుచు నీవు నుండ
నేగుచున్నవాడ నిదె నేను నా తండ్రి!
స్వస్తి నీ కగుత నిశాచరవర!" 1245

ఆ పలుకుల వలన నా రావణుండును
పరమ హర్ష మెడద పడసియుండె
చేరదీసి వాని చిక్కని కౌగిట
పలుకు లిట్టులంచు పలికె నపుడు: 1246

"ఈవు పల్కి-యున్న దియ్యది శౌండీర్య
యుతము నాదు కోర్కె- కొప్పెడునది
ఇపుడు నిక్కు-వముగ నీవు మారీచుడ
విటకు మున్న సురుడ వింకొకడవు 1247

రత్న భూషిత మగు రథ మియ్యది పిశాచ
ముఖ ఖరముల తోడ పూన్చిన యది
సత్వరమ్ము గాగ సమధిరోహింపు నా
తోడ గూడి నీవు గూడ నిపుడు 1248

మరులు గొల్పివైచి మైథిలి నీవు నీ
యిచ్చవచ్చి నట్టు లేగ వచ్చు
నెవరు లేక యున్న యెడ సీత మైథిలి
బల్మి తోడుకొంచు వచ్చువాడ" 1249

రథము నట్టిదాని రావణ మారీచు
లంతటన్ విమానమట్టు లెక్కి-
యతి రయమ్ము మీర నాశ్రమ మండల
మదియు విడచి పుచ్చి యరిగినారు 1250

అట్టు లేగుచుండి యచ్చోట దారిలో
కాంచుచున్ పురములు కాననములు
పర్వతమ్ము లెల్ల వాహినీ నిచయమ్ము
రాష్ట్రములు పలు నగరములు గూడ 1251

చేర నరిగి దండకారణ్య భూమికి
నంత నచట రాఘవాశ్రమమ్ము
పొరజూచె నపుడు మారీచుతో గూడి
రాక్ష సాధిపుండు రావణుండు 1252

స్వర్ణ భూషితమగు స్యందన మద్దాని
నుండి యంత నచట నుర్వికి దిగి
రావణుండు తన కరమ్మున మారీచు
బట్టి యిట్టు లంచు పల్కె నపుడు : 1253

"అరటి చెట్ల నడుమ నదియె రామాశ్రమ
పదము చూడు కానవచ్చుచుండె
చేయ వలయు నింక శీఘ్రముగా సఖా!
మనము వచ్చి యున్న పనిని నీవు" 1254

*** మారీచుడు మృగ రూపమున సంచరించుట ***

నుడువ నిట్లు రావణుండు మారీచు డా
తండు రాక్షసుండు దాని నాల
కించి యపుడు తాను మృగ మయి రామాశ్ర
మంపు ద్వారమందు మలయుచుండె 1255

ఆతడు కడు విస్మయావహ దర్శన
మైన యట్టి రూప మందియుండి
మెరయ కొమ్ముకొనల మేలౌ మణులు నల్పు
తెల్పు వన్నె మీర తీరు చెలగ 1256

కెంపు తమ్మి కలువ గేరు ముఖ మ్మింద్ర
నీలముల కలువల బోలు చెవులు
నించుకంత మీది కెగసిన కుత్తుక
యైంద్ర నీల దళ నిభాదరమ్ము 1257

కొమరు మిగులుచుండు కుందేందు వజ్రోప
మానమై చెలంగు దాని పొట్ట
ఇప్ప పూవు వన్నె నొప్పారు ప్రక్కలు
పద్మ కేసరముల పగిది మేను 1258

గిట్ట లొప్ప వైడూర్యమ్ము గేరునట్లు
చిరుత మోకాళ్ళు లెస్స గూర్చిన యొడళ్ళు
నింద్రు నాయుధ వర్ణము నెనయు వన్నె
నెత్తుకొని యున్న తోకతో నెసగు చుండ 1259

చిత్తహారి యగుచు స్నిగ్ధ వర్ణమ్మునై
పలు తెరంగు మణుల నలమి యున్న
మిగుల శోభ నొప్పు మృగముగా నమరె ని
శాచరుండు నొక్క క్షణములోన
వెలుగు లెసగజేసి విపిన మయ్యదియు రా
మాశ్రమమ్ము రమ్యమైన దదియు 1260

పెక్కు వన్నె లొప్పు వింత నెమ్మేనితో
కనుగొన దగి యుండి మనము నాచు
నట్టి రూపు దాల్చి యా రాక్షసుండు వై
దేహి మరులు కొల్ప దిరుగుచుండె
నందు చుట్టుపట్టులందు పచ్చిక పట్టు
లందు మేయుచుండి యచట నచట 1261

వింత రూపు నొంది ప్రియ దర్శన మ్మది
వెండిచుక్క లొప్ప వేల కొలది
తిరుగు చుండె త్రుంచి తినుచుండి మ్రాకుల
క్రొత్త లేజివుళ్ళ కొనల కొరికి 1262

కదళికా గృహమ్ము కడ కేగి యిటు నటు
కర్ణికార చయము కడకు నేగి
మంద గమనమున్ సమాశ్రయించి విదేహ
తనయ కాంచునట్టి తావుల జని 1263

క్రాలుచుండె పెలుచ రాజీవ చిత్ర పృ
ష్ఠమ్ము మహిత హరిణ సత్తమమ్ము
సంచరించుచుండె సౌఖ్యమ్ము మీర రా
మాశ్రమ పదమునకు నంతికమున 1264

మరలి యరుగు దెంచి హరిణోత్తమ మ్మది
తిరుగులాడు చుండె మరల నరిగి
యరిగి యొక ముహూర్త మతి రయ మ్మారగా
తిరిగి మరల నరుగుదెంచు చుండె 1265

ఆట లాడి యిట్టు లవనీ తలమ్ముపై
పండియుండు నొక్క పజ్జ మరల
నరుగుదెంచి చేర నాశ్రమ ద్వారమ్ము
హరిణ యూథము దరి కరుగు చుండు 1266

అనుసరించి చనగ హరిణ యూథమ్ములు
తిరిగి మరల నరుగుదెంచు చుండు
హరిణ రూప ధారియైన యా దనుజుండు
జనక తనయ తన్ను కనుగొనంగ
గోరి యెగసి పడుచు గ్రుమ్మరు కడు వింత
సొగసు లుట్టిపడగ సుడియు చుండు 1267

దాని తేరిచూచి తక్కిన హరిణము
లడవి సంచరించునట్టి వెల్ల
చెంత కరుగుదెంచి చేరి మూర్కొని దాని
పరువు వెట్టుచుండు పది దిశలకు 1268

అసురు డతడు మృగవధాసక్తుడే యైన
నడవి దిరుగుచున్న యా మృగముల
ముట్టి చూచుచుండి భుజియింప కుండెను
గుణము కప్పివుచ్చు కొనుటకు నయి 1269

అంత నట్లు మలయు నంతటి లోననే
పూలు కోసికొనగ బూని నామె
జనక మానవేశ తనయ శుభేక్షణ
చేర నరుగుదెంచె చెట్ల కడకు 1270

కదియ నేగి చూత కర్ణికా రాశోక
వృక్ష జాతము మదిరేక్షణయును
కుసుమ విసర మేరి కోసికొనుచు తిరు
గాడు చుండె నచట కమ్ర వదన 1271

అడని నుండ దగని యా పరమాంగన
యా విదేహ మానవాధినాథ
పుత్రి రత్నమయము ముక్తామణీ విచి
త్రాంగ మైన మృగము నచట గాంచె 1272

చూచె తేరి యామె సురుచిర దంతోష్ఠి
రూప్య ధాతు తుల్య రోమరాజి
నొప్పు మృగము విస్మయోత్ఫుల్ల నయనయై
విడక చెల్మి యుట్టిపడెడు నట్లు 1273

రాము దయిత గాంచి యామెను మాయా మ
యమ్ము హరిణ మదియు నంత మరల
వింత రీతి గాగ విహరించు చుండెను
వెలుగజేయు నట్లు విపిన మదియు 1274

మున్ను కనుల గాంచకున్న యా హరిణమ్ము
వివిధ రత్నజాల విలసితమ్ము
నరసి పరమ విస్మయమ్మును పడసెను
జనక ధరణి నాథ తనయ సీత 1275

## (43 వ సర్గ)

సుమము లేరి కోయుచున్న యా సుశ్రోణి
స్వర్ణ రజత వర్ణ సహిత మైన
పార్శ్వ యుక్త మగుచు పరిఢవిల్లుచు నున్న
యట్టిదాని కన్నులార గాంచి 1276

## * సీత మృగమును తెమ్మని రాముని కోరుట *

ఆమె సంప్రహృష్టయై యనవద్యాంగి
మెరుగు బంగరు మెయి యొరపు గలది
విభుని రమ్మటంచు బిల్చె నెల్గెత్తి ల
క్ష్మణుని రమ్మనియెను సాయుధముగ 1277

రామ లక్ష్మణులు నర వ్యాఘ్రు లట్లు వై
దేహి పిల్వ నేగుదెంచినారు
కలయ జూచువారు పొల మెల్ల నప్పు డ
చ్చోట నా మృగమ్ము జూచినారు 1278

దాని గాంచి శంక తలయెత్త నిట్లని
రాముతోడ బల్కె లక్ష్మణుండు
"నీ మృగమ్ము నరయ నితడు మారీచ రా
క్షసుడె యంచు తలపు గల్గు నాకు 1279

విపుల హర్ష యుక్తి వేటాడు వారలు
మానవాధిపతులు మానవేశ!
వనము లోన నిట్టి పాడు రూపున కామ
రూపి చేత పడిరి రూపు మాసి 1280

మాయదారి యతడు మైకొన్న మాయా మృ
గంపు రూప మిద్ది కనుగొనంగ
కాంతు లీనుచుండు గంధర్వ పుర సన్ని
భముగ పురుష సింహ! పరగుచుండు 1281

ఇట్టి తీరు గల్గు నట్టి రత్న విచిత్ర
మైన మృగము రాఘవాన్వవాయ!
జగతి నెందు లేదు జగదధీశ్వర! మాయ
యౌ నిదిందు సందియంబు లేదు" 1282

అని వచించుచున్న యాతని కాకుత్థ్సు
నా శుచిస్మిత యపు డడ్డగించి
పరమ హర్ష మొంది పలికె నిట్లని సీత
తోలు గాంచి మనసు గోలుపోయి 1283

"ఆర్యపుత్ర! హరిణ మభిరామ మిదియు నా
యుల్ల మెల్ల నిపుడు కొల్లగొనెడు
దీని బట్టి తోడితె మ్మో మహాబాహు!
ఆడుకొనగ మనకు నలవడు నిది 1284

మలయుచుండు నిచట మన యాశ్రమ పదమ్ము
నందు పలు తెరంగులౌ మృగములు
పుణ్య దర్శనములు మూగి గుంపులు గూడి
సృమరములును మరియు చమరములును 1285

ఋక్షములును మరియు పృషత సంఘమ్ములు
కీశ యూథములును కిన్నరులును
మెలగుచుండు నిచట మేలి రూపమ్ముల
మనసు నాకొలుపుచు మహిత బాహు! 1286

మున్ను కనుల గాంచియున్నది లే దీ మృ
గమ్ము సాటియౌ మృగమ్ము రాజ!
తేజమునను క్షమను దీప్తిని గాని యీ
మృగ వతంసమునకు మేర గాగ 1287

పెక్కు వన్నె లొప్పు వింత నెమ్మేనన
నర్ఘ రత్న బిందు లలమి కొనగ
పరగ జేసి వెలుగు వనమునం దంత జా
బిల్లి వోలె శోభ వెలయు నిదియు 1288

ఏమి రూపు హొయలు యేమి యీ మై సిరి
ఇంపు గూర్చెడి స్వర సంపదయును
అద్భుతంపు హరిణ మరిది మేనిది నాదు
మనసు దోచుచున్న మాడ్కి నుండె 1289

వలను పడున యేని బ్రదికియుండంగనే
మృగము బట్టి మెలపు మీర నీకు
నగును చూవె మిగుల నాశ్చర్యకర మది
వెల్లి విరియ జేయ విస్మయమ్ము 1290

గడపి పుచ్చి నంత కాన నావాసమ్ము
మరల రాజ్య మొంది మనెడి మనకు
నంతిపురి విభూషయై చెలంగుటకునై
యలవడియెడు గాదె హరిణ మిదియు 1291

అచ్చట భరతునకు నార్యపుత్రునకు మా
యత్తలకును నాకు నైనను ప్రభు!
ఇట్టి మృగము రూప మిది నిక్కువమ్ముగా
వెల్లివిరియ జేయు విస్మయమ్ము 1292

బ్రదికి యుండగానె పట్టగా నీ మృగ
వరము నీకు వలను పడద యేని
దీని చర్మమైన గాని నరవ్యాఘ్రు!
కూర్మి మిక్కుటముగ గూర్చు నాకు 1293

కాల గతిని జెందగా జంతు విది దీని
స్వర్ణ సదృశమైన చర్మము పయి
పచ్చగడ్డి చదర పైన పరచుకొని
కూరుచుండ నేను కోరు దాన 1294

కోర్కె వెంట నడచుకొను టిది ఘోరమ్ము
పడతుకలకు తగని పని యటందు
రీ మృగమ్ము నొడలి నీక్షించి నంతనే
వెలసె నా యెడంద విస్మయమ్ము" 1295

స్వర్ణ రోమ యుతము మణి ప్రవర శృంగ
సహితమును తరుణాదిత్య సదృశ వర్ణ
మత్రివర్చస మౌదాని నరయ రాము
మానసమ్మున గూడ విస్మయము గదిరె 1296

ఇట్లు సీత పల్కు లివి యాలకించియు
నద్భుతంపు మృగము నరసి దాని
దాని రూపు నెడల తగులూని నాతడు
సీత ప్రోద్బలమ్ము చేయుచుంట
పరమ హర్ష మొంది పల్కె సౌమిత్రితో
భ్రాతతోడ నిట్లు రాఘవుండు: 1297

"అరయు మయ్య లక్ష్మణా! విదేహాత్మజ
కోర్కె యిదియు మృగము కొరకుగాను
రూపు మేల్మి కల్మి నీ పాటి మృగమింక
నేది గాని యిపుడు లేదు సుమ్ము 1298

నందనోద్దేశ వనభూమియందు గాని
చైత్రరథ నామక వనమ్ము చక్కి గాని
ఇంక సౌమిత్రి! పృథ్విపై నెచట నైన
నీ మృగమ్మున కెనయైన దేది గాని 1299

పరగు మృగము మేనిపయి ప్రతిలోమాను
లోమముగను రుచిర రోమరాజి
వింతయైన కనక బిందువులు మృగమ్ము
నొడల మెరుగులారు చుండె నదిగొ! 1300

చూడు చెలగి గెంతుచున్న మృగము జిహ్వా
దీప్త వహ్ని శిఖను దెగడు దాని
వెలికి ముఖమునుండి వ్రేలాడు దానిని
మేఘ పటలి నుండి మెరపు వోలె 1301

ఆ మసార గల్లర్క ముఖాన్వితమ్ము
శంఖ ముక్తా నిభోదర సహితమైన
మృగము నభిరామమౌ రూప మిదియు నెవని
మానసము మరు ల్గొల్పక మాను నాక్కొ? 1302

హాటక మయమైన యదియు నానా రత్న
మయము నతుల దివ్యమైన రూప
మిది యెవనికినైన నీక్షించినన్ ప్రభూ!
మనము విస్మయమ్ము నెనయ కున్నె? 1303

మాంసమునకు గాను మరి వేడుకకు నైన
మృగ గణమ్ము సంహరించువారు
విల్లు దాల్చు మానవేశులు లక్ష్మణా!
వేటలాడు నెడల విపినమందు 1304

మానవాధిపతులు మణి రత్న కాంచన
తతుల గూర్చువారు ధనము వివిధ
ధాతువులను గూడ తగులాని పూన్కిమై
విపినమందు కూడబెట్టు వారు 1305

దాని సారభూత మైనది యెల్ల ధ
నమ్ము నిచయ వర్ధనమ్ము నరుల
కెడద దలచుకొన్న దెల్లను లక్ష్మణా!
శుక్రు కోశమందు చొచ్చినట్లు 1306

అర్థియైన యాత దర్థ కృత్యము నూని
విడచి చింత చక్క నడచునేని
యర్థ మనెడు వార లద్దాని లక్ష్మణా!
అర్థశాస్త్ర వేత్త లర్థ యుతులు 1307

రమ్యమైన హరిణ రత్నమ్ము నిద్దాని
శ్లాఘ్యమైన స్వర్ణ చర్మముపయి
కూరుచుండగలదు కూడి నా తోడుత
మైథిలేశ సుత సుమధ్యమ యిక 1308

కదళి కాజినమ్ము గాని ప్రియకి గాని
కంబళమ్ము నున్న గాని యింక
దీనిసాటిగా దదేదియు మెత్తంద
నమ్మనం దటంచు నాకు దోచు 1309

ఈ మృగమ్ము సిరుల నెసలారు నదియును
దివి జరించుచుండు దివ్య మృగము
నివియు రెండు మృగములే దివ్య మృగములు
తారకా మృగమును ధాత్రి మృగము 1310

అట్లు గాక లక్ష్మణా! యిది మాయ రా
క్షసుని దంచు నట్లు గాగ నాకు
నీవు చెప్పునట్టు లిదియు నౌనేని నే
విధిగ జేయవలయు వీని వధము 1311

క్రూరబుద్ధి వాడు మారీచు డీతండు
దాన వాగ్రణి యకృతాత్మకుండు
మున్ను తా నరణ్యమున సంచరించుచు
హింస సల్పె తాపసేంద్రులకును 1312

వేటలందు మానవేశుల పెక్కురఁ
గొప్ప విల్లు కేలఁ గొన్న వారి
గూలనేసె నెగచి కొనిపోయి పీ డందు
వలన నీ మృగమ్ము వధ్య మగును 1313

పూర్వకాల మందు ముని జనమ్మును వా
తాపి పరిభవించి ధరణి సురుల
కడుపులోన నుండి కడతేర్చు చుండెను
తనదు గర్భ మశ్వ తరిని బోలె 1314

అతడు పెద్ద కాల మైనంత నొక యప్పు
డాస మీరగా మహా మునీంద్రు
డౌ నగస్త్యు ద్యుతి సమన్వితు చేరంగ
వచ్చె నతడు నతని భక్ష్య మయ్యె 1315

విందు నుండి లేచు వేళలో తన రూప
మాత డందగోరు టరసి యెరిగి
వెలికి దోచునట్లు వెడనవ్వు వాతాపి
తోడ నిట్టు లంచు నాడె స్వామి: 1316

'పరిభవించినావు వాతాపి! స్వీయ తే
జమున నీవు లెక్క జమయు లేక
ప్రాణి లోకమందు బ్రాహ్మణోత్తములను
జీర్ణమైతి వందుచేత నీవు' 1317

దాన లక్ష్మణా! యితడు కాకయుండు వా
తాపి పగిది గాగ దానవుం డ
తిక్రమించి పోవు దెంచు వాడు విజితేం
ద్రియుని నన్ను బోలు నిత్య ధర్మ
నీత డగు నగస్త్యు చేత వాతాపి ప
ద్ధతిగ నన్ను దరిసి దాన జేసి 1318

ఇచట నిలిచియుండు మీవు సన్నద్ధుడై
దీక్షతోడ సీత రక్షసేయు
మీమె పాల నున్న దిక రఘునందనా!
మనము నెరపవలయు పని యిదెల్ల 1319

ఏను దీనిని వధియింతును కాకున్న
పట్టి కొంచు వచ్చువాడ మృగము
మృగము తోడుకొంచు నేగుదే సౌమిత్రి!
వేగిరమున బయలు వెడలి నంత 1320

చూడుమా! విదేహ సుతను లక్ష్మణ! మృగా
జినము నెడల కోర్కి యనువు పడగ
ముఖ్యమైన చర్మమును గోలుపడి పోవు
నీ మృగమ్ము చూడు మింక నేడు 1321

అప్రమత్తు డగుచు నాశ్రమమ్మున నుండి
నీవు జనకతనయ గావ దగును
చెండ నాడి వైచి జింక నొక్కమ్మున
తిరిగి యేను నరుగుదెంచు వరకు
దాని జంపివైచి తచ్చర్మముం గొని
త్వరగ లక్ష్మణ! యిట కరుగుదెంతు 1322

అలవు మిక్కిలి గల పక్షి యతి బలుండు
దీ యుతుండు సౌమిత్రి! జటాయు గూడి
మైథిలిని గొని నిలు మప్రమత్తుడ వయి
యెల్లెడల ననుక్షణము శంకించుచుండి" 1323

## (44 వ సర్గ)

ఆ విధమ్ము గాగ నాదేశ మొసగి త
మ్మునికి నతనికి రఘు పుంగవుండు
ఘన పరాక్రముండు కనక మయ త్సరు
ఖడ్గ మొండు నడుమ గట్టుకొనియె 1324

### * రాముడు మృగమును బట్టబోవుట *

పూని కేల నంత మువ్వంక వి ల్లాత్మ
భూషణమ్ము గాగ పొలుచు దాని
నమ్ము పొదుల రెంటి నమరిచి కట్టుక
వెడలె నా యుదగ్ర విక్రముండు 1325

అట్టు లురికివచ్చు నా రాజచంద్రుని
గాంచినంత బెదరు గదురు కొనగ
కన్ను గప్పి వేగ కనుమరుగయి పోయె
కానవచ్చె మరల కనుల యెదుట
కత్తిగట్టి నతడు కార్ముకమును పూని
యురికి చనియె హరిణ మున్న యెడకు 1326

కాననమ్ములోన కాంచుచు నుండెను
ఎట్ట యెదుట కానుపించుచున్న
కరణి దాని రూపు కార్ముక హస్తుని
చూచి చూచి యురుకుచున్న యట్లు 1327

దాటి నట్టు లమ్ము వ్రేటు మేర యొకప్పు
డాస గొల్పుచుండి యంది నట్టు
లడరు గదిరి నట్టు లాందోళన మ్మొంది
యుప్పరమున కెగసి యురికి నట్లు 1328

కానవచ్చు చుండె కానరా కుండె నా
యడవి పట్టులందు నచట నచట
మొయిలు తున్క లలమి మూసిన శారద
చంద్ర మండలమ్ము చక్కి గాగ 1329

చెంత గానవచ్చు నంతలో నొక ముహూ
ర్తమున దూరమందు తారసిల్లు
కానవచ్చి మరల కానరా కిట్టు లా
తండు కొంచు బోయె దశరథ సుతు
నతని యాశ్రమమున కతి దూరముగను మా
రీచ రాక్షసుండు మృగత నొంది 1330

అల్క గొన్న యాత డయ్యె కాకుత్థ్సుడు
నొడలు మరచి దాని యుక్కువమున
పాదపమ్ము నీడ పచ్చిక పట్టున
నివ్వెర పడి యంత నిల్చుకొనియె 1331

వాని కట్లు గాగ వాడు వెర్రెత్తించె
హరిణ రూపుడైన యసుర వరుడు
వన్యమృగ సమూహ పరివృత్తుడై కాన
బడె నెదుట నదూర పదము నందు 1332

పట్టుకొనగ నెంచు వానిని కనిపెట్టి
పరువు వెట్టి పోయె మరల నదియు
నా క్షణమ్ములోనె యంతర్హితమ్మయ్యె
మరల బెదురు గదుర మనమునందు 1333

మరల నంత దూర మందున్న చెట్ల జొం
పమ్ములోన నుండి బయలు పడియె
కాంచి రాఘవుండు ఘనతేజు డద్దాని
నేల గూల్ప నెడద నిశ్చయించి
యమ్ము వెలికి దీసి యత్యంత కుపితుడై
యుండె నచట రఘుకు లోద్భవుండు 1334

## * మారీచ వధ *

శత్రు మర్దనుండు సంధించి సుదృఢ చా
పమున సూర్యకాంతి భాతి వెల్గు
బ్రహ్మ నిర్మితమ్ము జ్వలిత దీప్తాస్త్రమ్ము
వ్యాళ మట్లు బుసలు వరపుదాని
మిగుల బల్మిమీర తెగలాగి విడచె నా
హరిణ సత్తమమునె గురి యొనర్చి 1335

హరిణ రూపు డైన యసుర మారీచు మై
వ్రక్కలించి వైచి పరియలుగను
సాయకోత్తమ మ్మశని సన్నిభము నాటు
కొనియె గాటముగను గుండె పగుల 1336

క్షీణ జీవితుండు శిత సాయకాతురు
డెగసి పైకి తాడి యెత్తు దాక
భైరవారవమ్ము బరపుచు నుండి ధా
త్రీ తలమ్ము మీద ద్రెళ్ళె నతడు 1337

ప్రాణములను విడచు వాడు మారీచుడు
తలచె నెట్లు సీత తరల జేయు
లక్ష్మణు నిట కింక రావణు డొంటిమై
నెట్టు లామె నపహరించు నంచు 1338

అతడు తగిన సమయ మరుదెంచె నని నిశ్చ
యించి యంత పెలుచ నెలుగు చెలగ
స్వరము రాఘవ సదృశము గాగ 'హా సీత!'
యంచు 'లక్ష్మణా!' యటంచు నార్చె 1339

అనుపమాన మైన యా సాయకము తన
యాయములను దాకి గాయపరుప
మృగము రూప మది పరిత్యజించియు స్వీయ
దనుజ రూప మతడు తాల్చియుండె
మహిత కాయు డైన మారీచు డసురుండు
ప్రాణములను విడచివైచి యపుడు 1340

అంతట విచిత్ర కేయూరు డైన యఖిల
భూషణ వితాన భూషిత భూరి తనుడు
మహిత దంష్ట్రుండునై హేమమాలి యైన
యసురవరు డయ్యె సాయకాహతిని గూలి 1341

ఘోరరూపు డైన మారీచ రాక్షసు
పుడమి బడిన వాని పుడమి బొదివి
పండియున్న వాని వానిని రక్త సి
క్తాంగు రాఘవుండు నరసి చూచి
తలచి లక్ష్మణుండు పల్కిన పల్కులు
చేరె మనసులోన సీత కడకు 1342

"మాయ యియ్యది సుమి మారీచునిది చెప్పి
యుండె మున్నె లక్ష్మణుండు తాను
నదియు నట్లె యిప్పు డయ్యెను గాదె మా
రీచు డేను గొట్ట ద్రెళ్ళి నతడు 1343

అసురు డీత డట్టు' హా! సీత! లక్ష్మణా!'
యంచు పేరెలుగున నార్చివైచి
ప్రాణములను విడచి పడియెను పుడమిపై
నాలకించి యెట్లు లగునొ సీత? 1344

అట్లె లక్ష్మణుడు మహాదాహు డిది విని
యే యవస్థ నధిగమించు వాడొ"
అంచు మిగుల చింత నంది ధర్మాత్ముడు
జలదరించెను రఘు సత్తముండు 1345

అట్టి యెడల రాము నలమె తీవ్ర భయమ్ము
దొడ్డ కీడుపాటు దొరయు శంక
హరిణ రూపు డైన యసురు జంపిన యంత
నాలకించినంత నతని స్వరము 1346

ఇంక నొక్క దాని జింకను వధియించి
దాని మాంసము గొని దాశరథియు
నచట నుండి వేగమూర జనస్థాన
మునకు నభిముఖముగ జనియె నపుడు 1347

## (45 వ సర్గ)

### * సీత లక్ష్మణుని దూషించుట *

ఆర్తనాద మదియు నడవి లోపల భర్త
గొంతు బోలెడునది గురుతు పట్టి
యనియె సీత లక్ష్మణుని తోడ "పొమ్మి వె
ఠంగి రమ్ము రఘుకు లేచ" ననుచు 1348

"ఉన్న చోట గుండె లుండకున్నవి నాకు
ప్రాణమైన నుండ బట్టకుండె
వినగ వచ్చె నాకు బెట్టిదముగ పర
మార్తు డైన వాని యార్పు తెలుగు 1349

అడవిలోన భ్రాత నాక్రందన మొనర్చు
చున్నవాని గాచు టొప్పు నీకు
చేర నురుకు మీవు శీఘ్రమ్ముగా నింక
భ్రాత శరణు గోరువాని వాని
నసుర జనుల బారి కగ్గమై నాతని
కేసరులకు నడిమి గిబ్బ వోలె" 1350

అట్టు లన్న గాని యతడు పోనేలేద
యోదలం ధరించి యన్న యాన
కనలు గొన్న యామె జనకాత్మజాత యి
ట్లనియె నతని కంత నట్టి యెడల: 1351

"మిత్ర రూపమున సుమిత్రాత్మజా! శత్రు
వట్టు లున్నవాడ వన్న కీవు
ఇట్టి చేటుపాటు చుట్టుకో మీ యన్న
పజ్జ కేగకున్న వాడ వీవు 1352

ఇచ్చగించు చుంటి వీవు లక్ష్మణ! రాము
నాశనమ్ము నిపుడు నాకుగాను
నిక్క మీవు నన్ను జిక్కించుకొను నాస
నరుగకుంటి రాము ననుసరించి 1353

నీకు ప్రియ మటంచు నే నెంతు వ్యసనమ్ము
అన్న యెడల చెలిమి సున్న నీకు
నందుచేత నా మహాద్యుతి కానరా
కున్న నెమ్మది మెయి నుంటి వీవు 1354

ఈవు వచ్చియుంటి వెవని మూలమ్మున
నతడె సంశయమున కగ్గమైన
నిచట నిల్చియుండి యేను కావింపగా
వలసినది యికేమి పనుపడు నాకొ?''  1355

అని వచించుచున్న యామెను వైదేహి
నశ్రు శోక సంప్లుతానన మృగ
వధువు వోలె భయము పడెడు సీతను గాంచి
పల్కె లక్ష్మణుండు పల్కు లిట్లు :  1356

"అమర వరుల కైన నసుర గంధర్వ ప
న్నగుల కైన గాని నరుల కైన
వలను పడదు గెలువ వైదేహి! నీ భర్త
నిందు లే దొకింత సందియంబు  1357

దేవి! దనుజ మనుజ దేవ గంధర్వుల
యందు గరుడ కిన్నరాళియందు
క్రూర మృగములందు ఘోర దానవ పిశా
చాళి నెవడు గాని సమ్మదమున
సుందబోడు వాసవోపమానుని రాము
మారుకొన్న వాడు పోరిలోన  1358

ఆలమం దవధ్యుడౌ సుమీ రాఘవుం
డిట్టు లంచు పల్కు టీపు తగదు
నిన్ను విడిచి పోవ నే నుత్సహింప నీ
యడవిలోన రాముడైన లేక  1359

అతని బలము దేవి! యనివార్య మైనది
శక్తి యుతుల కైన సైన్యయుతము
పూనుకొనిన గాని మూడు లోకములతో
విబుధ గణముతోడ విభులతోడ  1360

నీ యెడంద యింక నెమ్మది నుండుత
విడిచి పెట్టు మిట్టి గొడవ జోలి
వచ్చువాడు నీదు భర్త శీఘ్రమ్ముగా
హరిణ సత్తమమ్ము హత మొనర్చి 1361

వాని యెల్లు కాదు స్పష్టమౌ నయ్యది
మాయ నూని బరపె మరి యెవండొ
అసురు డత డొనర్చినది యది గంధర్వ
నగర సన్నిభముగ నెగడు మాయ 1362

ఉంటి వీవు న్యాస మున్నట్లు వైదేహి!
యా మహాత్మకుండు రాముడు నిను
నప్పగించె నాకు నట్లో వరారోహ!
యేను విడువ నుత్సహింప నిన్ను 1363

వైర మూని యున్నవార లో వైదేహి!
మాంస భుజులు వీరు మన యెడలను
ఖరుని నిధన మాదిగానే జనస్థాన
వధమునకును తాము బదులు దీర్ప 1364

ఈ మహా వనమ్ములో మైథిలీ! యెలుం
గులను బరపువారు పలు తెరగుల
నిచటి యసుర జనులు హింసా విహారులు
వాని దలచి చింత వలదు నీకు" 1365

ఇట్లు లక్ష్మణుడు వచింపగా విని యల్కా
గదుర నెఱ్ఱవార కన్ను లామె
సత్యవాది యైన సౌమిత్రి గన్గొని
పరుషమైన పల్కు పల్కె నిట్లు: 1366

"అకరు ణారంభ! కుల పాంసనా! నృశంస!
ఆర్యతా దూర! నీ కిష్ట మని తలంతు
బెట్టిదపు కీడు రాముని ముట్టు టందు
వలన రాము గీ డరసియు పలుకు దిట్లు 1367

సవతు గల్గు నెడల సౌమిత్రి! దుర్బుద్ధి
గలుగు టిదియు వింతగాదు లెమ్మ
నిన్ను బోలియుండి నిత్యమ్ము ప్రచ్ఛన్న
చారులైన యట్టి క్రూరులకును 1368

వెంట నంటియుంటి వొంటి నొక్కండవే
యడవి రాము నీవు కడు చెడుగవు
నా కతమ్ము గాగ పైకి కన్పడకుండ
పంచి యుండ నోపు భరతు డైన 1369

సాధ్య పడదు గాక సౌమిత్రి! భరతున
కైననీ కు నైన గాని యదియు
పద్మపత్ర సన్నిభాక్షు డిందీవర
శ్యాముడైన భర్త సంశ్రయించి
యుండి యిప్పుడు మరి యొక్కరు నొరుని కా
మించు దాన నగుట యెట్టులొక్కొ? 1370

నీ సమక్షమందు నే ప్రాణముల్ విడ
నాడు దాన సందియంబు లేదు
లక్ష్మణా! పుడమిని రాముండు లేకుండ
బ్రదుక నొక్క క్షణము పాటు గాని" 1371

ఒడలు జలదరించు కడు పరుషమ్మైన
పల్కు లిట్టు లంచు పల్క సీత
లక్ష్మణుండు నిట్టు లనియె సీతకు విజి
తేంద్రియుండు దోయిలించి కేలు : 1372

"పల్కు నుత్సహింప ప్రత్యుత్తర మ్మేను
దైవతమ్మ వగుదు వీవు నాకు
పొటి లేని యట్టి పల్కులు మైథిలీ!
వింతగాదు లెమ్ము వెలదుకలకు 1373

ఇంతు లెల్లవారి కిదె స్వభావ మ్మిట్లు
గా జగమ్ములందు కానవచ్చు
విగత ధర్మ మతులు విడబాటు గూర్తురు
చంచలల్ సుతీక్ష్ణ లించుబోండ్లు 1374

పల్కు లిట్టివాని వైదేహి! యే నింక
సైచి యుండ లేను జనక తనయ!
వీని నిపుడు నాకు వీనుల రెండింట
క్రాగు నారసముల కరణివాని 1375

సాక్షు లగుచు నాకు సర్వ వనేచరుల్
కదిసి వినెడు వారు గాక యిపుడు
న్యాయవాదినైన నన్ను నన్యాయమౌ
పరుష వాక్కు లీవు పల్కినయవి 1376

ఛీత్కరింతు నిన్ను చెడిపొమ్ము నే డీవు
నిట్లు శంకసేయు టీవు నన్ను
నాడుతనము చెడ్డదౌ సహజముగనే
అన్న మాటమీద నున్నవాని 1377

కదలి పోవువాడ కాకుత్థ్సు డున్నెడ
కగుత స్వస్తి నీకు నబ్జవదన!
కాచువారు గాక కానన దేవత
లెల్లవారు నాయతేక్షణ! నిన్ను 1378

ఇపుడు నాకు దోచు నీ నిమిత్తమ్ములు
కానవచ్చు ఘోరమైనవిగను
అరుగుదెంచి నేను మరలి రాముని గూడి
కాంచువాడ నొక్కొ కనుల నిన్ను?" 1379

లక్ష్మణుండు నిట్టు లని పల్క నాలించి
యేడ్చుచున్న మైథిలేశ పుత్రి
బదులు పల్కె నిట్లు బాష్ప పరిప్లుత
యైన యామె తీవ్రమైన పల్కు: 1380

"రాఘవుడు లేక యున్నను లక్ష్మణ! యిక
నురుకుదాన గోదావరి నురి తగిల్చి
కొందు కాకున్న నా మేను కొండనుండి
విడుతు త్రావుదు తీవ్రమౌ విషము చొత్తు
నగ్ని రాఘవు దక్కగ నన్య పురుషు
తాకు దానను గాను పాదమున నైన" 1381

ఇట్టు లంచును తెగ దిట్టి సౌమిత్రిని
ఉన్మ్మలికము గ్రమ్మ నున్న సీత
కొట్టుకొనియె కేల గట్టిగా పొట్టను
మిగుల దుఃఖ మొంది బుగులుకొనుచు 1382

ఆర్తరూపయై యేడుచు నా విశాల
నేత్ర విమనుడై గాంచి సౌమిత్రి యూర
డించనే లేదు సీతయు నించుకైన
మాటలాడక యుండె నా మరది తోడ 1383

అంత సీతకు నభివాద మాచరించి
యంజలించి లక్ష్మణు డించుకంత వంగి
మైథిలిని గాంచుచును పెక్కు మారు లాత్మ
వంతు డాతడు రాముని వజ్ఞ కరిగె 1384

## (46 వ సర్గ)

అట్టు లామె పరుషమౌ పల్కు లాడగా
నలుకగొన్న రాఘవానుజుండు
నిచ్చగింప కున్న నెంతయు రాముని
కడకు బయలుదేరె వడి గలట్లు 1385

### * రావణుడు సీత వద్దకు వచ్చుట *

వేచియున్న వాడు వేవేగ మా దశ
కంఠు డప్పు డెడయు గల్గి నంత
వద్ద కేగ దరలె వైదేహి గూరిచి
యాతడు యతి రూప మలవరించి 1386

శ్లక్ష్ణ కాషాయ సంవీత లక్షితుండు
శిఖయు నొప్పార ఛత్రమ్ము చేత బట్టి
పాదుకలు దాల్చి సమకూర్చి వామభుజము
నందు శుభమౌ కమండలు యష్టికములు
చేరె యతి రూప ధారియై సీత కడకు 1387

అన్న దమ్ము లిర్వురు లేక యడవి నున్న
యామె జేరగ జనియె నా యతి బలుండు
చంద్ర సూర్యులు లేకున్న సంధ్య జేర
నేగు దెంచిన దట్టపు టిరుల వోలె 1388

అమె నంతట గనుగొనె రామపత్ని
నతి విశుద్ధ యశస్విని యైన బాల
హిమ కిరణ విరహితను రోహిణిని వింట
భృశ సుదారుణ గ్రహము వీక్షించు నట్లు 1389

ఒప్పుగ పరికించి యుగ్ర తేజః కర్ము
డైన యాతని కదలాడ కుండె
నగ మహీజములు జనస్థాన రుహములు
నేచి వాయువైన వీచకుండె 1390

ఎర్ర డాలు కనుల నీక్షించుచున్న యా
తనిని గాంచినంత తల్లడపడి
కొంకి యురికి పారు గోదావరీ నది
యైన పోదొడగె నిదానముగను 1391

ఎడయు రాము నెడల బడయ గోరెడు దశ
కంఠు డా యెడయును గల్గినంత
నా విదేహ తనయ యండకు జనె పరి
వ్రాజ రూప ధారి రావణుండు 1392

పాపబుద్ధి యతడు భవ్య రూపమ్మున
భర్త కొరకు దిగులు పడుచునున్న
యా విదేహ పుత్రి యండకు జేరెను
చిత్ర చెంతకు శని చేరినట్లు 1393

గడ్డి పెరిగి మూగి కప్పిన నూయట్లు
భవ్య రూపధారి పాపి యతడు
పార జూచి రాము పత్ని వైదేహిని
తత యశస్వినీ మతల్లి నిలిచె 1394

శుభకరాంగి రుచిర శుభ్ర దంతోష్ఠిని
పూర్ణచంద్ర సదృశ ముఖ కమలను
పర్ణశాల నేలపై గూరుచొని యున్న
దాని బాష్పశోక దళిత గాత్రి 1395

పద్మపత్ర సన్నిభాక్షియు సీత కౌ
శేయ వాసిని యగు సీత చెంత
జేర నరిగె దుష్ట చిత్తు డా రాత్రించ
రాగ్రసరుడు రావణాసురుండు 1396

అతడు మదన సాయ కావిష్టు డౌ వాడు
బ్రహ్మ ఘోషణమ్ము పరగ జేసి
పల్కె నిట్టు లంచు ప్రశ్రిత వాక్య మే
కాంత మందు రాక్షసాధిపుండు 1397

* రావణుడు సీతను పలుకరించుట *

ఆమె జగతి కెల్ల నత్యుత్తమ స్త్రీని
కమల రహిత యైన కలుముల చెలి
వోలె రూపు దాల్చి యొప్పారు దానిని
మెలత రావణుండు పలుకరించె : 1398

"ఎవతె వీవు? తప్త హేమ వర్ణోపమా!
పసపు పట్టు చీర నెసగు దాన!
కడు శుభమ్ము గూర్చు కమల మాలిక దాల్చి
యున్న పద్మిని వలె నుంటి వీవు 1939

హ్రీవొ కీర్తి వొక్కొ? శ్రీవో? శుభాననా!
అతుల శుభపు లక్ష్మి వప్సరసవొ?
ఈవు భూతి వౌదువేమొ? వరారోహా!
స్వైర చారిణి వగు సతివి రతివొ ? 1400

వరుస దేరి కొనలు వారి నున్నారియు
తెల్లదనము మీరు పల్లు నీవి
కొనల నెరుపు నల్ల కనుపాప లొప్పార
నాయతమ్ము లమల మైన కనులు
పీన జఘన మదియు విపులమై పెంపారు
నూరువులును కరి కరోపమములు 1401

సముపచితము లవియు సంహతములు పృథు
వర్తులములు సంప్రవల్గితములు
ఘన సమున్నతాగ్ర కాంతముల్ స్నిగ్ధముల్
తాల ఫల సమానతాస్పదములు
మణి వరేణ్య పూర్ణ మాలికాన్వితములై
యొప్ప లొలుకు నీ పయోధరములు 1402

సొగసు నగవు దాన! సొగసు పల్గలదాన!
సొగసు కనుల దాన! సొగసులాడి!
కొల్ల గొంటి నాదు నుల్లమ్ము నో కాంత!
ఏరు నీట నొడ్డు గోదు నట్లు
పిడికిట నొదుగు నెర నడుము దానవు నీవు
సంహాత స్తన యుగ! చారుకేశి! 1403

అసుర వనిత నైన నప్సై గంధర్వినే
యైన యక్ష కిన్న రాంగనల ని
ట్టి రూప మున్న యే నారినైన నే
నుర్వి మున్ను గాంచి యుండ లేదు 1404

అఖిల జగములందు నగ్ర్యమౌ నీ రూపు
వయసు సౌకుమార్య భరిత గాత్ర
మిట వనమ్ములోన నిట్లు వాస మ్మంట
యెడద నాకు వెర్రియెత్త జేయు 1405

అందు వలన మరలుమా! నీకు భద్రమౌ!
నిట వసించుచుంట కీవు తగవు
క్రూరులైన కామ రూపులౌ రాక్షస
నిచయములు వసించు నిలయ మిద్ది 1406

రమ్య తరములైన ప్రాసాద శిఖరముల్
నగరిలోని యుపవనములు గాని
సంప దన్వితములు సద్గంధ యుతములౌ
నెడల సంచరించు పెసగు నీకు 1407

మేలి పూల మాల మేలి భోజనమును
మేలి దువ్వలువయు మెలపులాడి!
మేలి మగడు నీకు చాలగా తగియుండు
నని తలంచు వాడ నసిత నయన ! 1408

ఎవతె వౌదు వాక్కా? ఈవు వరాననా!
రుద్రు లందునేన్ మరుత్తులందు
నేని వసువులందు నేని వరారోహ!
నాకు దేవతాంగన వలె దోతు 1409

ఏగుదేర కుందు రిటకు గంధర్వులు
నమర జనులు కిన్నరాళి యైన
రాక్షసులకు నిది నిలయమై చెలంగెడు
నెట్లు వచ్చియుంటి విటకు నీవు? 1410

మెలగు కోతు లిచట మృగపతుల్ చిరుతలు
వ్యాఘ్ర మృగము లట్లె పరగు చుండు
ఋక్ష గణములున్ తరక్షువుల్ కంకముల్
వాని కెట్లు భయము పడవు నీవు? 1411

మద సమన్వితములు మహిత బలాఢ్యముల్
ఘోర రూపము లగు కుంజరముల
కెట్టు లొంటిదాన పీవు వరాననా!
భయము పడవు ఘోర వనము లోన? 1412

ఎవతె? వెవని దాన? వెటనుండి వచ్చితి?
దానవ జన సేవితమ్ము ఘోర
మైన దండకా వనావని కల్యాణి!
ఒంటి నేల తిరుగుచుంటి పీవు?" 1413

అంచు రావణుడు దురాత్ముడు వైదేహి
బల్కరించి నంత బ్రాహ్మణోత్త
మాకృతి గొని వచ్చి నాతని రావణు
గాంచి పూజ యాచరించె నతని
కతిథి సత్కృతు లవి యన్నియు నొనరించి
యపుడు జనక మానవాధిప సుత 1414

మొట్ట మొదట పాద్యమున నిమంత్రించియు
నాసనమ్ము తెచ్చి యతని కొసగి
చెప్పె నప్పు డామె 'సిద్ధమయ్యె' నటంచ
తనికి విప్ర సౌమ్య దర్శనునకు 1415

భూమినిర్జర వేషమ్ము బూని వచ్చి
నతని పాత్రకుసుంభ సంయుతుని గుడుప
రానివాని నపాయ దర్శనుని గాంచి
మైథిలి యొనర్చె విప్ర నిమంత్రణమ్ము 1416

"బ్రసి యిదే యిచ్చ గూర్చుండు బ్రాహ్మణవర!
ఇయ్యదియె పాద్య మిది స్వీకరింపు సిద్ధ
మిదియె వనజాత ముత్తమ మిందు భుక్తి
నీకునై యింక భుజియింపు నెమ్మదిగను" 1417

అంచు ప్రతిపూర్ణ భాషిణి నాహ్వాయితను
రావణుడు గాంచి మైథిలి రాజపత్ని
నామె బల్మి హరింపంగ నపుడు మనసు
నిల్పె నాతడు దృఢముగా నిజ వధ కయి 1418

అంతట సువేష వేటకై యరిగి నతని
లక్ష్మణ సమేతు రాముని రాక కెదురు
చూచుచున్ నలు గడలను చూచు నామె
తన్మహా వనమున పచ్చదనమె కాంచె
కాంచలే దయ్యె రామ లక్ష్మణుల నెచట 1419

## (47 వ సర్గ)

ఇట్లు ప్రశ్నింప హరియింప నెంచి నతడు
రావణాసురుడు విదేహ రాజ పుత్రి
యాత డొక పరివ్రాజకు డను తలవున
తన్ను గూరిచి చెప్పె నాతనికి నామె 1420

బ్రాహ్మణుం డితండు పైగా నతిథి బదు
లీయకున్న శావ మిచ్చు నాకు
నంచు నొక ముహూర్త మాలోచనము సేసి
బదులు పల్కె సీత వాని కిట్లు : 1421

* సీత రావణునకు తన్నెరింగించుట *

"పుత్రి నేను జనక భూమి పాలునకును
మైథిలేశు డైన మహిత మతికి
వెలయు సీత యనగ పేరు భద్రము నీకు
రాము భార్య నో ధరామరేంద్ర ! 1422

సర్వ కామ్య వస్తు సంప త్సమృద్ధిమై
దివ్య భోగములను దేలు దాన
పదియు మీద రెండు వర్షమ్ము లచట ని
ఝ్వాకు లింటిలోన వాస ముండి 1423

అంత పదియు మూడు నగు నేట భూపతి
ప్రభువు సచివ నిచయ పరివృతు డయి
నిశ్చయించు కొనియె నెరపగా నభిషిక్తి
రామునకును ధరణి రాజ్యమందు 1424

జరుగు చుండ నిట్లు సన్నాహముల్ రాఘ
వాభిషేకమునకు నంత లోనె
ఆర్యురాలు కైక యను నామెయును తన
భర్త నడిగికొనియె వరము లవియు 1425

ఆమె కేకయ సుత మా మామ నరికట్టి
యుంచి ధర్మ పథము నుడుగ కుండ
సత్య సంధు డైన సార్వభౌముని భర్త
నా వరముల రెంట నడిగి కొనియె
వనికి నా మగనిని పంపగా భరతున
కవనికి నభిషిక్తి యాచరింప 1426

'నేడు నే భుజింప నేను నిద్దురపోని
కేను త్రావ నేది యెట్టు లైన
నిదియె నా బ్రదుకున కిక తుది రామాభి
షేక మొక్క వేళ చేయనైన' 1427

అని వచించుచున్న యా కైక నపుడు మా
మామ పార్థివుండు మానదుండు
బ్రతిమలాడు కొనియె బహు సంపదల నిచ్చి
యతని యాజ్ఞ నెరపదయ్యె నామె 1428

ఇరువదియును నైదు యేడుల వాడు ప్రా
యమున నా మగండు నలఘు తేజు
డేను పుట్టి పదియు నెనిమిది యేడు ల
ప్పటికి లెక్క వచ్చె వయసు నాకు 1429

రాము డనెడు పేర బ్రథితుండు జగమున
శుచియు సత్యయుతుడు సుగుణయుతుడు
నాయతేక్షణుండు నాజానుబాహుండు
నిఖిల భూత విహిత నిరతు డతడు 1430

కామ సక్తుడైన యా మహాతేజుండు
దశరథేశ్వరుండు తండ్రి స్వయము
కైకయికి ప్రియమ్ము కావింప రామాభి
షేచనమ్ము తాను సేయకుండె 1431

అరుగుదెంచి యున్న యాతని నభిషేక
మునకు తండ్రి చెంతకును రఘువరు
రాము గాంచి నాదు రమణుని కైకేయి
పల్కె నిట్టులు దృఢ వచనములను 1432

'ముదల యిచ్చె నాకు నిది నీదు తండ్రి నీ
వాలకింపు రాఘవా! యిదెల్ల
భరతునకు నొసంగ వలయు రాజ్య మ్మకం
టకము గాగ రామ! యిక యిదెల్ల 1433

నీవు నైన పోయి నిలువంగ వలయును
పదియు నాలు గేండ్ల పాటు వనిని
కల్ల కాక యుండ కాకుత్థ్స! నీ తండ్రి
పలుకు వనికి నీవు బయలు దేరు' 1434

'అట్లె చేయువాడ' నని పల్కి యా కైక
తోడ రాఘవు డకుతోభయుండు
నా దృఢ వ్రతుండు నాదు వల్లభు డప్పు
డామె పల్కు లవియు నాచరించె 1435

ఈయవలె ప్రతిగ్రహింపగా రాదు స
త్యమ్మె గాని కల్ల లాడరాదు
ఇదియె బ్రాహ్మణాగ్రణీ! రాము పరమోత్త
మమ్ము నిశ్చిత వ్రతమ్ము సుమ్ము! 1436

తమ్ము డతని సవతి తల్లి బిడ్డండు ల
క్ష్మణు డనంగ వీర్యశాలి యాత
డరి హరుండు నతడు పురుష శార్దూలుండు
రామునకును తోడు రణమునందు 1437

భ్రాత లక్ష్మణు డనువాడు దృఢవ్రతుం
డతడు ధర్మచారి యనుగమించె
కార్ముకమ్ము కేల గైకొని వెంబడి
నన్ను గూడి యరుగుచున్న వాని 1438

జడలు దాల్చి తాపసాకార మూని నా
తోడ తనదు తమ్ముతోడ గూడి
దండకా వనమ్ము ధర్మ నిత్యుడు విజి
తేంద్రియుండు చొచ్చె నేగుదెంచి 1439

కైక కారణమ్ముగా నట్లు మువ్వర
మేము రాజ్యమున బహిష్కృతు లయి
ద్విజ వరాగ్రగణ్య! తిరుగు చున్నారము
కడు బలమ్ము మీర కారడవిని 1440

ఊరడిల్లి యుండు మొక ముహూర్తమ్ము పా
టీవు వాసముండు మెసగు నిచట
వచ్చువాడు నాదు భర్త పుష్కలముగా
వన్యములను తెచ్చువాడు విప్ర! 1441

ఇంక నెరుగ జెప్పు మీవు నీ పేరును
కులము గోత్ర మదియు కల తెరంగు
ఏటి కిట్లు తిరుగు దీ వొంటి దండకా
రణ్య భూములందు బ్రాహ్మణ వర!" 1442

పల్కుచుండ రామ పత్నియౌ సీత యీ
సరణి మహిత వీర్యశాలి యతడు
పల్కె నిట్టులంచు బదులు తీవ్రమ్ముగా
రాక్షసాధిపుండు రావణుండు: 1443

* రావణుడు తన ప్రభావము చెప్పుకొనుట *

"ఎవ్వ దన్న బెగ్గడిల్లు లోకమ్ములు
సామ రాసు రోర గాన్వితముగ
పేరు రావణు డను పెంపారు వాడను
సీత! నేను రాక్షసేశ్వరుండ 1444

నిన్ను హేమ వర్ణ సన్నిభ గనుగొని
యొడల పట్టుబట్ట నొవ్వుదాని
నేను స్వీయదార లెడల ననిందితా!
ఇంచుకైన మోద మెనయకుంటి 1445

ఇచట నచట నుండి యెత్తుక వచ్చిన
పెక్కుమంది మేలి వెలది మిన్న
లెల్లవారిలోన నిక భద్రమా నీకు
నగ్ర మహిషి వీవ యగుమ నాకు 1446

కడలి నడిమి చక్కగా నొప్పు లంక నా
నదియె నూవె నా మహానగరము
కాచుచుండ దాని కడలి నల్గడలను
నిలిచియుండు కొండ నెత్తిమీద 1447

అచట నుపవనమ్ములందు నాతో విహ
రించుచుండు దాన వీవు సీత!
ఈ యరణ్య వాస మియ్యది భామినీ!
ఈవు కోరుకొనవ యింక నెపుడు 1448

ఐదు వేల మంది యతివలు దాసీ జ
నమ్ము లఖిల భూషణాభియుతలు
సీత! నిన్ను జేరి సేవించుచుండు వా
రీవు భార్య వౌదు వేని నాకు" 1449

* సీత రావణుని దూషించుట *

ఈ విధమ్ముగా వచింప రావణుడును
కనలు గొన్నది జనకాత్మజాత
యతనికి బదులాడె నా యనవద్యాంగి
యసురవరుని కడు ననాదరించి 1450

"ఘన మహీధ్రమ ట్లకంప్యుడౌ వాని మ
హేంద్ర సదృశు డగుచు నెసగు భర్త
నలఘు జలధి వోలె నక్షోభ్యుడౌ రాము
ననుసరించు వ్రతము నంది తేను 1451

సర్వ లక్షణాభిసంపన్నుడౌ వాని
వట తరు పరిణాహవంతు నా య
శస్వి మహితభాగు సత్యసంధుని రాము
ననుసరించు వ్రతము నంది తేను 1452

మహిత బాహు యుగళు మహిత వక్షస్కుని
సింహ విక్రమ గతి చెలగు వాని
పురుషసింహు సింహమునకు దీటౌ రాము
ననుసరించు వ్రతము నంది తేను 1453

పూర్ణ చంద్ర వదను భూపాల సుతు విజి
తేంద్రియు డగువాని నిన కులజుని
మహిత కీర్తిశాలి మహితాత్ముడౌ రాము
ననుసరించు వ్రతము నంది తేను 1454

గుంటనక్క వీవు కోరుదు నన్ను సిం
గంపు బెంటి బడయ గాని దాని
తాక నలవి గాని దానను నీ కేను
ప్రబల భానుమంతు ప్రభను బోలె 1455

కాంచుచుంటి వీవు కాంచన వృక్షముల్
పెక్కు మందభాగి! నిక్కువమ్ము
రావణా! యిపు డిటు రాఘవు ప్రియపత్ని
పడయ గోరుచున్నవాడ వనగ 1456

వడి గలట్టిది మృగవైరి పంచాస్య మా
కొన్న దాని నోట నున్న దాని
వడి గలట్టి పాము వాయిలో గల దాని
కోర వెలికి దీయ గోరుచుంటి 1457

మందరాద్రి సత్తమమ్మును కేలితో
నెత్తికొంచు బోవ నెంచుచుంటి
కాలకూట విషము కడు పారగా గ్రోలి
చన దలంచుచుంటి సౌఖ్యమార 1458

కంట గోకికొనుచు నుంటివి సూదితో
నాల్క కత్తివాయి నాకుచుంటి
రాఘ వాన్వవాయ రమణిని ప్రియపత్ని
పడయ గోరుచుంటి వనగ నీవు 1459

కుతుక రాయి గట్టుకొని సముద్రమ్మునే
యీది దాట నిచ్ఛగించుచుంటి
పంకజాప్త కుముద బంధుల నిరు కేల
బట్టికొనగ నాసపడుచు నుంటి
రాఘవాన్వయు ప్రియురాలిని భార్యను
చెనక గోరుచుంటి వనగ నీవు 1460

ప్రజ్వలించుచున్న పావకు గనుగొని
వలువ మూటగట్ట దలచుచుంటి
వనఘ శీల వృత్త యగు రాము భార్య నీ
వపహరింప నెడద నాసపడుట 1461

వాడి యినుప వాతి బరిసెలపై నీవు
నడచి పోవ నాసపడుచు నుంటి
దాశరథికి తగిన దానిని భార్యను
చేకొనంగ నిచ్ఛ సేయు కతన 1462

అంతర మ్మేమొ నక్కకు హరికి నడవి
నంతర మ్మేమొ జాలున కంబునిధికి
నంతర మ్మేమొ సారాయి కాసవమున
కంతర మ్మదె నీకు నైక్ష్వాకునకును 1463

అంతరము హేమ సీసములం దదేమొ
అంతరము చందనమ్మున కసలు కేమొ
అంతరము హస్తికిని పిల్లి కడవి నేమొ
అంతరము దాశరథికి నీ కదియె సుమ్ము 1464

అంతరము కాకికిని గరుత్మంతున కెదొ
అంతరము మద్గు కేకుల కదియు నేమొ
అంతరము గృధ్రమునకును హంస కేమొ
అంతరము నీకు రామున కదియె సుమ్ము 1465

అమర వల్లభ సమ తేజుడైన రాము
డిషు శరాసన పాణియై యెసగు దాక
నేను జీర్ణింప నీవు హరింపనైన
మక్షికము దిగ్రమింగిన మణిని బోలె" 1466

ఇట్లు పల్కు సుధృష్ట మౌనట్లు పల్కి
యా నిశాచరవరుతోడ నా యదుష్ట
భావ గాత్రప్రకంపన వ్యథిత యయ్యె
ప్రబల వాతోద్ధత కదళి పగిది తన్వి 1467

గజ గజ వడంకు సీతను గాంచి రావ
ణుండు మృత్యు సమ ప్రభావుం డతండు
స్వీయ కులమును బలమును పేరు చేసి
నట్టి పనులును వివరించె నడలు గొలుప 1468

## (48 వ సర్గ)

### * రావణుడు సీతను బెదరించుట *

చెప్పుచుండ నిట్లు సీత పరుషమైన
పల్కు లగ్గలంపు టల్క గదుర
ముడివడంగ నొసలు బొమలు రావణుడును
పల్కె నిట్టు లంచు బదు లతండు: 1469

"వైశ్రవణున కేను వరవర్ణినీ! యను
జుండ సవతి తల్లి సుతుడ భద్ర
మౌను నీకు రావణాఖ్యుడ పంక్తి కం
ధరుడ ప్రస్తుత ప్రతాప యుతుడ 1470

ఎవ్వ డన్న నమరు లెల్లరు గంధర్వ
గణ పిశాచ భుజగ గరుడ యుతము
పారిపోవు వారు భయభీతు లెప్పుడు
జనులు మృత్యువునకు జడియు నట్లు 1471

వైశ్రవణుని విభుని ద్వైమాతు నెవ్వాడు
కారణాంతరమున కలనిలోన
ద్వంద్వ యుద్ధమందు తలపడి క్రోధాన
విక్రమించి మించి విజయమందె 1472

ఎవని భయ మదేర్ప స్వీయ సంస్థానమ్ము
వృద్ధిమత్పురమ్ము విడచి పుచ్చి
ధారుణీధ రావతంసమ్ము కైలాస
మధివసించి యుండె నైలబిలుడు 1473

అట్టివాడ మింట నరుగుదు నో భద్ర!
విలుచు కొన్న వాడ వీర్యమునను
పుష్పక మ్మనంగ బొల్చు నాతని విమా
నమ్ము కామగతి యుతమ్ము శుభము 1474

అలుక మొలిచియున్న యాస్యమ్ము నా యది
కాంచినంతనె జనకాత్మజాత!
విరిగి పరుగు వెట్టుదురు పరిత్రస్తులై
వాసవాది నాకవాసు లెల్ల 1475

ఏను నిల్చియున్న యెడల నెచ్చట నైన
వీచు జంకి వాయు వేపుదక్కి
తీవ్రకిరణు డైన దినకరు డళుకున
శీత కిరణు డగుచు చెలగువాడు 1476

ఆకు లల్లలాడ వవనీ రుహమ్ముల
నీరు నెమ్మది గన నేరు లవియు
పరగు నెచట నెచట పర్యటించుచు నుందు
నిలిచియుండు వాడ నేను నెపుడు 1477

అబ్ధి కవలి గట్టునందు శుభమ్మైన
నా పురమ్ము లంక నాగ నొప్పు
ఘోర రాక్షస పరిపూరిత మ్మయి నిర్జ
రాధినాథున కమరావతి వలె 1478

పాండు వర్ణమైన ప్రాకార రేఖ యె
ల్లెడల చుట్టుకొనగ నెసగు నదియు
హేమ కక్ష్య లొప్ప నింపారు వైడూర్య
తోరణ మయ మగుచు తోచు పురము 1479

స్యందనాశ్వ హస్తి సంబాధ మైనది
విపుల తూర్య నాద విస్తరమ్ము
సర్వ కాలిక ఫల సహిత వృక్షానీక
సంకు లోపవన శుభాంకితమ్ము 1480

అచట నున్న దానవై నీవు నో సీత!
నన్ను గూడి ధరణినాద పుత్రి!
తలచుకొనక యుండుదానవు మానవ
కామినుల మనస్వినీ! మనమున 1481

అనుభవించుదానవై వరవర్ణినీ!
మానుషముల దివ్యమైన భోగ
ములను మనములోన దలపవు మానవు
నాయు వుడిగిపోయి నతని రాము 1482

స్థాపన మ్మొనర్చి సామ్రాజ్యమంద ప్రి
య సుతు దశర థోర్వరాధినేత
మానవేశ్వరుండు మంద వీర్యాన్వితు
నితని వెడల నంపె జ్యేష్ఠ సుతుని 1483

భ్రష్ట రాజ్యుడైన వానితో రాముతో
నపగతాత్ముడైన యతని తోడ
తత్తపస్వి తోడ తాపసోపాధితో
నాయతాక్షి! యేమి చేయు దీవు? 1484

నిఖిల రాక్షసాధినేత కామమ్ము మై
స్వయము గాగ నిటకు వచ్చి నతని
మన్మథ ప్రయుక్త మార్గణావిష్టు తి
రస్కరించి పుచ్చ రాదు నీకు 1485

నను తిరస్కరించినను భీరురాల! యా
పైన పరితపింప వలసి వచ్చు
తొల్లి కాల దొలగ ద్రోచి పురూరవు
నుమ్మలించి నట్టి యూర్వశి వలె 1486

నరుడు రాము డతడు నా ప్రేలితో నాహ
వమున సాటి వచ్చు వాడు కాడు
నీదు భాగ్య వశత నిన్ వరవర్ణినీ!
చేర వచ్చి నతని జేరి కొల్వు!" 1487

* సీత రావణుని మరల దూషించుట *

పల్కు నాత డిట్లు వైదేహి క్రుద్ధయై
యెఱ్ఱ వారి కన్ను లెసగు చుండ
పరుషమైన యట్టి పల్కు రాక్షస నాథు
తోడ నిట్టు లంచు నాడె నపుడు: 1488

"సర్వ భూత జాల సంపూజ్యమానుడౌ
వైశ్రవణుడు దేవవర్యు డన్న
యనుచు జెప్పకొనుచు నది యెట్టులొకొ నీవు
నాచరింప గోరు దశుభ కర్మ? 1489

సమసి పోవు వారు సర్వ రాక్షసు లవ
శ్యమ్ము గాగ రావణాసుర! యిక
నవిజితేంద్రియుడవు నతి కర్కశుడవు దు
ర్బుద్ధి వీవు వారి భూపు డగుట 1490

అపహరించి యా బలారాతి భార్యను
శచిని బ్రదికి యుంట శక్య మగును
రాము భార్యయైన యామెను నన్ను గొం
పోయి యున్న బ్రదుక బోల దింక 1491

బ్రదుకవచ్చు చిరము వజ్రపాణి నుండి
యపహరించి యప్రతిరూప యైన శచిని
దానవా! నన్ను బోలెడు దాని జెనక
నమృత మానిన గాని నీ కగును ముక్తి" 1492

## (49 వ సర్గ)

ఆలకించి సీత యాడిన పల్కు ప్ర
తాపవంతు డైన దశవదనుడు
కీలు గొల్పి కేలు కేల సుమహనీయ
మౌ నటులుగ తనదు మేను పెంచె 1493

మరల నిట్టు లనియె మైథిలితో వాడు
పల్కు లంతకన్న పైబడినవి :
"వెర్రిదాన వెంతు వినలే దటంచు నా
వీర్య విక్రమములు వెనుక నెపుడు 1494

ఆకసమున నిల్చి యవనీతల మ్మిరు
కేల బట్టి యెత్తజాలు వాడ
నంబురాశి నైన నానువాడను మృత్యు
వైన నని నెదిర్చి హత మొనర్తు 1495

అర్కు నాపువాడ నతి తీక్ష్ణ శరముల
పుడమి యెల్ల పగుల నడచు వాడ
కాంచు వెర్రిదాన! కామరూపిని నన్ను
నఖిల కామ దాయి నైన నన్ను" 1496

అని వచించుచున్న యంత క్రుద్ధుండైన
యతని కనులు పింగళాంచలమ్ము
లర్క సన్నిభమ్ము లనల ప్రభమ్ములు
నయ్యె రక్త వర్ణ మలముకొనగ 1497

### * రావణుడు సీత నపహరించుట *

విడచి సౌమ్యమైన భిక్షు రూపమ్మును
తత్క్షణ మ్మతండు దశ వదనుడు
తాల్చె రావణుండు ధన దానుజుడు కాల
రూప నిభము స్వీయ రూప మపుడు 1498

తప్త కాంచన కుండల ధరుడు రక్త
చక్షుడున్ నీల జీమూత సన్నిభుండు
దశ ముఖుడు శ్రీయుతుడు క్షణదా చరుండు
కనలు ముమ్మరముగ నెద గ్రమ్ముకొనగ
బాణ కార్ముక పాణియై వరగె నపుడు 1499

విపుల కాయు డతడు విడచి వుచ్చియు పరి
వ్రాజ కాకృతి యగు వాలక మది
స్వీయ రూప మపుడు చేకొని యుండెను
రాక్ష సాధిపుండు రావణుండు 1500

అలుక మిగుల నెర్రనైన కన్నుల వాడు
కాడు మబ్బు వన్నె క్రాలువాడు
మేన నెర్రవలువ లూనినవా డుండె
నన్ను మిన్న మైథిలాత్మజ గని 1501

అసిత కేశజాలకాంత సహా నామెను
భానుమంతు కాంతి పగిది దాని
సతి మనోహర వసనాభరణోపేత
సీత రావణుండు చెప్పె నిట్లు: 1502

"వనయ వలదువేని భర్తగా మూడు లో
కముల లోన పేరు గల్గు నతని
నాశ్రయింపుమా వరారోహ! సన్నిపు
డీడు తగినవాడ నేనె పతిని 1503

[illegible] చిరకాల మీవు నే
[illegible] మెలుపదితి
[illegible] నెరపక యుండుదు
[illegible] 1504

విడిచి పెట్టు మనుజునెడ గల్గు భావమ్ము
బరపు నాపయి నిక భావ మీవు
రాజ్య విచ్యుతుడగు రాము నసిద్ధార్థు
పరిమితాయు వైన వాని యెడల
నరసి యే గుణమ్ము లనురక్త వైతివి
మూఢురాల! తెల్వి పొగడు కొనెదు 1505

ఆడుదాని మాటకై రాజ్యమును మిత్ర
జన సమేతముగను సంత్యజించి
క్రూర మృగ చయమ్ము గ్రుమ్మరు నీ వని
వాస మున్నవాడు వాడు కుమతి" 1506

పల్కు లిట్టు లాడి వైదేహికిన్ ప్రియా
ర్హకు ప్రియమ్ము పల్కు నామె కసుర
కామ మోహితుండు కడు దుష్ట చిత్తుండు
దశ గళుండు సీత దరియ నరిగి
యొడిచి పట్టె నామె నుడువీధి రోహిణీ
తార బుధుడు బట్టు తద్విధమున 1507

వాడు పట్టుకొనియె పద్మాక్షి సీతను
మూర్ధ జాతములను పుర్రచేత
బట్టుకొనియె తొడల పట్టున నామెను
దక్షిణంపు పాణితలము తోడ 1508

అరసి యతని మృత్యువ ట్లున్న వానిని
తీక్ష్ణ దంష్ట్రిడైన దీర్ఘబాహు
పర్వ తోపమాను వన దేవతల్ భయ
భ్రాంతి మీర పర్వు వారి రపుడు 1509

ఖర సమన్వితమ్ము ఖర నిస్వనమ్మునై
హాటకాంగ యుక్త మైన దివ్య
మహిత రథ వరమ్ము మాయా మయమ్ము రా
వణుని యెదుట కానవచ్చె నపుడు 1510

అంత నామె పరుషమైన వాక్యముల మ
హా స్వనుండు తూలనాడుకొంచు
పట్టుకొంచు తొడల పట్టున వైదేహి
స్యందనమ్ము మీద నతడు చేర్చె 1511

పట్టి రావణుండు వైదేహి నా యశో
మహిత కాన దూరమైన రాము
గూర్చి బిగ్గ నార్చె గొంతెత్తి 'రామా!' య
టంచు దుఃఖ వేద నార్త యగుచు 1512

కామదూర నామె కామార్తు డాతండు
పన్నగేంద్ర వధువు పగిది గాగ
మెలి దిరుగుచు నున్న మెలతను చేకొని
యరిగె నెగసి రావణాసురుండు 1513

అంత రాక్షసేంద్రు డాకసమున నామె
నపహరించి కొనుచు నరుగుచుండ
మిక్కుటముగ నార్చె సొక్కిన ట్లాతుర
భ్రాంత చిత్తయైన పగిది గాగ 1514

* సీత మొర *

"హా! సుమిత్ర సూతి! హా మహాబాహు! పె
ద్దల యెడంద లెపుడు దెలచువాడ!
యెరుగ కుంటి నన్ను నెత్తుక పోవుట
కక్ష గొన్న వాడు రాక్షసుండు 1515

బ్రదుకు సుఖము నర్థ వర్గమ్ము లెల్లను
ధర్మమునకు గాను తలగ ద్రోచి
నను నధర్మ మార్గమున హరియించుచు
నుండ నీవు కాంచకుంటి రామ! 1516

అంచునుందురుగద యవినీతులను వంచు
వాడ వని పరంతపా! జనమ్ము
లిట్టి రీతి పాపి నితని రావణుని శా
సింప కున్న వాడ వెట్లు నీవు? 1517

కానరాక యుండు గద యవినీతున
కతని కర్మఫలము లాక్షణమ్మ
కాల మట్టి యెడల కలసిరావలె గదా
చేల పంట కదను వోలెనె గద! 1518

కాన కార్య మిదియు కాలోపహత చిత్తు
డగుచు నిట్లు నెరపినాడ వీవు
జీవి తాంతకరము చెడు దారుణ మ్మిది
భ్రంశ మందు దీవు రామువలన 1519

అమ్మ చెల్ల! యిప్పు డా కైక బాంధవ
యుతము కోర్కె దీర నుండు గాక
కడు యశస్వి ధర్మ కాముడునౌ వాని
ధర్మపత్ని నిట్లు తస్కరింప 1520

నాకు సెల వొసగ జనస్థాన కర్ణికా
రముల పుష్పితముల ప్రార్థన మ్మొ
నర్తు వేగ రామునకు నెరింగింపుడు
'సీత రావణుండు చెరగొనె' నని 1521

వందనమ్ము మాల్యవ ద్గిరీంద్రమునకు
ప్రస్రవణ శిఖరికి వందనమ్ము
చెప్పు రాఘవునకు చెచ్చెర నీవును
'సీత రావణుండు చెరగొనె' నని 1522

హంస సారస నిచయాకీర్ణమైన గో
దావరీ నది కిదె దండ మిడుదు
చెప్పు రాఘవునకు చెచ్చెర నీవును
'సీత రావణుండు చెరగొనె' నని 1523

ఈ వనమ్ములోని యెల్ల పాదపముల
నాశ్రయించి యున్న యఖిల దైవ
తముల కిడుదు నేను దండము భర్తతో
చెప్పు డీరు నన్ను చెరగొను టిది 1524

ఇచట వాసమున్న యెల్ల వానిని మృగ
విహగ గణము శరణు వేడుకొందు
భర్తతోడ తెలియ బల్కుడు ప్రియురాలి
ప్రాణములకు మిన్నయైన దాని
వివశ 'సీత గొంచు వెడలి పోయెను రావ
ణాసురుండు వేగ' మంచు మీరు 1525

జాడ తెలిసియున్న స్వర్గములో నున్న
మహిత బాహు డతడు మహిత బలుడు
విక్రమించి నన్ను విడిపించుకొని వచ్చు
యమునిచే నపహృత నైన గాని" 1526

*** సీత జటాయుపును గాంచుట ***

అపుడు జాలిగొల్పు నాలాపముల విల
పించుచు కడు నలమటించు నామె
యాయతాక్షి గాంచె నచ్చోట గ్రద్దను
చేరియున్న దాని చెట్టు మీద 1527

అరసి చూచి దాని నామె యా సుశ్రోణి
యసురవర వశ గతయైన యామె
యదలుచుంట రాలుపడిన యెలుంగుతో
పిలుపు బరపె నిట్లు వెరపు మీర 1528

"ఆరయు మయ్య నన్ను నయ్యా! జటాయువూ!
దిక్కు లేని యట్లు దీనురాలి
పాపకర్ము డైన వాడు రాక్షస నాధు
డీత డెత్తుకొనుచు నేగు దాని 1529

అలవి కాదు నీకు నరికట్ట సీతని
క్రూరు డీ నిశాచరుం డితండు
పాపబుద్ధి సత్త్వ వంతుడు జితకాశి
యదియు గాక యితడు సాయుధుండు 1530

నన్ను చెరగొను టిత డున్న దున్నట్లు రా
మునకు నో జటాయువూ! యిదెల్ల
జరిగినదియు నెల్ల సౌమిత్రికిన్ గూడ
కడమ లేక నీవు నుడువ దగును" 1531

## (50 వ సర్గ)

అలుకు డదియు నంత నవసుప్తుడై యున్న
యా జటాయు వప్పు డాలకించె
వేగ కన్నుదోయి విచ్చి రావణు గాంచి
కాంచె నాతడు జనకాత్మజాత 1532

కాంచి గిరిశిఖరము కరణి గ్రాలెడు వాడు
వాడి ముక్కు తోడి పక్షివరుడు
చెట్టుమీద నున్న శ్రీయుతుం డాతండు
పల్కె శుభకరములు పల్కు లిట్లు: 1533

* జటాయువు రావణునకు ధర్మము చెప్పుట *

"నే పురాణ ధర్మ నిష్ఠమై దశకంఠ!
నిల్చియుందు సత్య నిరతుడ నయి
నే జటాయు వనగ నెగడెడు వాడను
గృధ్రరాజు నే నహీన బలుడ 1534

సర్వ లోకమునకు సార్వభౌముడు మహేం
ద్ర వరుణోపముండు రాఘవుండు
దశరథావనీశ తనయుండు లోక హి
తమ్మునం దతండు తగిలియుండు 1535

అట్టి లోకనాథు డైన వానికి ధర్మ
పత్ని యీ మె పేరువడిన యామె
యలరు సీత యన వరారోహ యీామె నీ
వెత్తుకొంచు బోవ నెంచుచుంటి 1536

ధర్మ మూనియున్న ధరణీతలేశ్వరు
డితరు లాంద్ర తడవు బెట్టు లొక్కొ?
రక్షణీయ లగుచు రతిశయముగ రాజ
భార్య లెల్ల రలఘు బలయుతుండ! 1537

హీనమైన బుద్ధి యిది పరదారాభి
మర్శనమ్ము నుండి మరల జేయు
మితరు డెవ్వ డైన నీసడించెడు దాని
నెపుడు ధీరు డాచరింప రాదు
ఆత్మ భార్య వోలె నన్యుల భార్యల
బ్రోవవలయు నెపుడు బుద్ధియుతుడు 1538

అర్థమైన కామమైనను శాస్త్రమ్ము
లందు చెప్పకున్న యట్టి దాని
బరప బూనుకొనరు పౌలస్త్య నందనా!
అవనిపతులు శిష్టు లైన వారు 1539

రాజే ధర్మము కామము
రాజుత్తమ నిధియు నెల్ల ద్రవ్యమ్ములకున్
బ్రాజిత ధర్మము పాపము
రాజ నిమిత్తమున నడచు రాష్ట్రము లోనన్ 1540

చపల మతివి రాక్షసాగ్రణి! పాప స్వ
భావుడైన వాడ వీవు నెట్లు
ప్రాప్త మయ్యె నాకొ- ఐశ్వర్య మియ్యది
మలిన కర్మనకు విమాన మట్లు? 1541

ఎవనికిన్ స్వభావ మెయ్యదియో దాని
మొట్ట మొదలు తుడిచి పెట్ట గాదు
ఇరవుకొనక యుండు చిరము దుష్టాత్ముడౌ
వాని యెడల నార్యమైన గుణము 1542

నాడు లోన గాని నగరమ్ములో గాని
యలఘు బలుడు రాము డతడు నీకు
కీడు సేయకున్న వాడు ధర్మాత్ము డీ
వెట్లు కీడు సేయు దివు డతనికి? 1543

మునుపు శూర్పణఖయె మూలమ్ముగా జన
స్థాన గతుడు ఖరు డతండు మట్టు
మీరి రాముతోడ పోరిలో నక్లిష్ట
కర్మచేత కాలగతిని జెందె 1544

ఇందులోన చెప్పు మేమియో పొరబాటు
వాస్తవముగ రాము వలన నైన?
నపహరించికొనుచు నరుగుచుంటివి లోక
పాలుడైన యతని భార్య నీవు 1545

సీత విడువు మీవు చెచ్చెర పావక
సన్నిభ మగు ఘోర చక్షువు లవి
కాల్చివేయ కుండగా నిన్ను వృత్రుని
బల విరోధి యశని పగిది గాగ 1546

అరయకున్న వాడ వాశీవిష మ్మైన
ఫణిని కొంగున ముడివైచి కొనియు
కుతుక చుట్టు కట్టుకొని యున్న నైనను
కాలపాశ మీవు కాంచవైతి 1547

ఎంత బరువు నరున కెత్త క్రుంగించదో
అంత బరువె మోయ నగును సౌమ్య!
ఎంత జీర్ణ మగునొ యే రోగమును లేక
యంతె తినగ నొప్పు నన్న మైన 1548

ఎట్టి కార్యమాచరింప గల్గదొ ధర్మ
మైన కీర్తి యశము నైన నవని
కాయమునకు మిగుల కస్తియౌ నా పని
నెవ్వ డింక నాచరింపవలయు? 1549

* జటాయువు రావణు నడ్డగించుట *

జనన మాది గాగ చనె రావణా! యారు
పదుల వేల యేండ్ల వయసు నాకు
బరపుచుండగ పితృ పైతామహ మ్మైన
రాజ్య పాలనము సలక్షణముగ 1550

వృద్ధు డేను యువకు డీవు విల్లమ్ముల
నంది మరువు దొడిగి యరద మెక్కి
తైన నీ విదేహ తనయను నీ వెంట
గొంచు నరుగ లేవు కుశలి వగుచు 1551

బల్మి మీర నీవు వైదేహి హరియింప
నోపలేవు కాంచుచుండ నేను
విచలనమ్ము లేని వేద శ్రుతిని న్యాయ
సమభియుక్త హేతు సమితి యట్లు 1552

పోరు సల్పు మీవు శూరుండ వైనచో
నుండు రావణా! ముహూర్త మిచట
పండె దీవు చచ్చి పడియుండి నేలపై
మున్ను ఖరుడు పండియున్న యట్లు 1553

పోరిలోన పెక్కు మారులు దైత్య దా
నవుల గూలనేసినా డతండు
చీర వాసనుండు సీతాపతి వధించు
నచిర కాలమందె ఆలమందు 1554

ఏమి చేయ నాకు నిట శక్యమౌనాకో
దొల కరిగి రా నృపాల సుతులు
చచ్చువాడ వీవు చెచ్చెర వారికి
జడిసి నీచ! లేదు సంశయమ్ము 1555

ఏను బ్రదికియుండ నీ శుభాకారను
సరసిజాత దళ విశాలనయన
రాము భార్యను ప్రియురాలిని సీతను
నీవు కొంచు నేగలేవు గాక! 1556

నెరపవలయు ప్రియము నే నవశ్యమ్ముగా
ప్రాణ సమితి నొడ్డి యైన గాని
యా మహాత్మకునకు రాముని కట్టులే
మనుజ పతికి దశరథునకు గూడ 1557

నిలుము నిలువు మొక్క నిముసమ్ము రావణా!
కాంచు మీవు పంక్తి కంధర! యిక
నొసగువాడ నీకు యుద్ధాతిథేయమ్ము
ప్రాణమున్న దాక రాత్రిచరుడ!
రాల్చువాడ నిన్ను రథ సత్తమము నుండి
పండు తొడిమ నుండి పడిన పగిది" 1558

## (51 వ సర్గ)

న్యాయ సరణిగా జటాయు వీ రీతిగా
పల్క నాలకింప నల్క గొన్న
పం క్తి కంధరు నిరువది కన్ను లవి యెల్ల
నగ్ని సన్నిభమ్ము లై వెలింగె 1559

### * రావణునితో జటాయువు యుద్ధము *

కనలు గొనుట వలన కడు నెర్ర వారిన
కనులవాడు త ప్త కనక కుండ
లాన్వితుండు రాక్షసాధీశ్వరుం డమ
ర్షణుడు పర్వె విహగరాజు పైకి 1560

సంప్రహార మదియు సంకుల మయ్యె నా
ఘోర వనములోన వా రిరువుర
కాకసమ్ము లోన ననిలోద్ధతమ్ము లౌ
నంబువాహ యుగ్మ మట్టి రీతి 1561

అపుడు యుద్ధ మదియు నద్భుతమై తన
రారుచుండె గృధ్ర రాక్షసులకు
పక్ష సహితమైన పర్వతేంద్రములకు
మాల్యవంతములకు మాద్రి గాగ 1562

అంత కర్ణ రహితమై వాడిమీరు నా
శీక సాయకముల భీకరముల
గురిసి ముంచె గృధ్రవర్యు జటాయువు
నలఘు బలుడు రావణాసురుండు 1563

పత్రరథ విభుండు వా డా జటాయువు
గృధ్ర వరుడు రాక్షసేశ్వ రాస్త్ర
సంచయమ్ము తీవ్ర సాయ కోత్కరమును
సంగరమ్ములోన సైచి యుండె 1564

వాడి మీరు గోళ్ళతోడి పాదములతో
విహగ సత్తముండు మహిత బలుడు
పలు విధములు గాగ వ్రణముల గావించె
వాని యొడలినిండ తాను నేచి 156

అంత కనలు మీర నా దశగ్రీవుండు
దారుణములు కాలదండ నిభము
లైన పది శరమ్ము లందుకొనియె కేల
శత్రు మర్దనమ్ము సలుప గోరి 156

నిశిత తీక్ష్ణ ఘోర విశిఖమ్ముల నజిహ్మ
గముల పూర్ణ ముక్తకమ్ము లైన
యా శిలీముఖముల నా మహావీర్యుండు
వ్రయ్య నేసె పతగ వర్యు మేన 1567

అశ్రు పూర్ణ నయన యైన జానకి గాంచి
రాక్షసాధినాథు రథమునందు
సరకు గొన కతండు శరముల వానిని
దానవాధినాథు దరియ నురికె 1568

అంత మణుల ముత్తియములు పొల్పారెడి
వాని కార్ముకమ్ము బాణ యుతము
భంజన మ్మొనర్చె పాద యుగ్మమ్ముతో
విపుల తేజుడైన విహగ విభుడు 1569

అంత నొండు ధనువు నాతండు గైకొని
క్రోధ మూర్ఛితు డసు రోద్వహుండు
కురిసె వానిపైన శర వర్షములు నూర్ల
కొలది గాగ వేల కొలది గాగ 1570

సంగరమ్ములోన శరములు వానిని
చుట్టుముట్ట నండజోత్తముండు
గూటిలోన జేర్చ కొమరారు చున్నట్టి
విహగమట్లు మిగుల వెలుగుచుండె 1571

బాణ వర్షము లవి పక్ష విక్షేపమ్ము
తోడ నాత డవల తొలగ ద్రోచి
వాని మహిత ధనువు పాద యుగ్మమ్మున
విపుల తేజు డతడు విరుగ గొట్టె 1572

అగ్ని సన్నిభమ్ము నతి దీప్తిమంతమై
క్రాలు రావణు ఘన కంకటమ్ము
ప్రబల వీరుడైన పతగాధినాథుండు
వ్రక్కలించె పక్షవాత హతిని 1573

కాంచన మయ కవచ కలితములై పిశా
చాననమ్ము లొప్పు జవము మీరు
దివ్యమైన వాని తేరి ఖరమ్ముల
జదిపె బలియు డతడు సమరమందు 1574

చక్కనైన దాని ముక్కామ లమరంగ
వలసినట్టు లెల్ల పారుదాని
పావ కార్చిషమ్ము సౌవర్ణ మణి విచి
త్రాంగమౌ రథమ్ము వ్రక్కలించె 1575

పూర్ణ చంద్ర బింబమును బోలు ఛత్రమ్ము
వ్యజన చయము తోడ పాటు గాగ
పటు రయమ్ము మీర పడవైచె పుడమిని
వాని బట్టు దానవాన్వితముగ 1576

ఇతని సారథి మహనీయ శిరమ్మును
పటు రయమ్ము మీర వాడి ముక్కు
తోడనే తటుకున ద్రుంచె శ్రీమంతుడు
మహిత బల యుంతుడు విహగ విభుడు 1577

భగ్న కార్ముకుండు భగ్న శతాంగుడు
నిహత సారథియును నిహత హయుడు
సీత నంకమందు చేకొని యవనీ త
లమ్ము మీద బడియె రావణుండు 1578

పడిన వాని నేల భగ్న వాహను డైన
వాని రావణు నట పారజూచి
'మేలు మే' లటంచు మెచ్చె భూతమ్ములు
పూజ సల్పె గృధ్ర రాజమునకు 1579

ముదిమి వలన నలసి పోయిన వానిని
పక్షియూథ పతిని వాని గాంచి
మరల రావణుండు మైథిలి జేకొని
హృష్ట చిత్తు డగుచు నెగసి పోయె 1580

అతని సంప్రహృష్టు డౌవాని జానకి
నంకమందు పూని యరుగు వాని
ఖగ గణాధినాథు డెగసి మీదికి దరి
యంగ నరిగి రావణాసురు నరి
కట్టి యా జటాయు ఘన పరాక్రమవంతు
డనియె నిట్టు లంచు నతని తోడ : 1581

"అశని వోలె తాకు నమ్ముల బూనిన
రాము భార్య నీమె రావణా! హ
రించుచున్న వాడ వి ట్లల్ప బుద్ధివై
దానవ ప్రజా వధార్థమె కద! 1582

మిత్ర బంధు జన సమేతము మంత్రి యు
తమ్ము బలపరిచ్చ దాన్వితముగ
త్రావుచున్న వాడ వీ విష పానమ్ము
దప్పి గొన్నవా డుదకము నట్లు 1583

పనిని వెంబడించి వచ్చెడి దెరుగంగ
రేని యా వివేక హీన జనులు
కడు రయమ్ము మీర పడయుదురు వినాశ
మీవు నాశనమ్ము నెసయు నట్లు 1584

కట్టువడితి వీవు కాల పాశమ్మున
విడుపు పడయు దెటకు గడచి దాన
గమిచి యెఱ్ఱతోడి గాలమ్ము మీనమ్ము
చావునకు దొలంగి పోవ నట్లు 1585

రావణా! చెనకగ రాని కాకుత్థ్సులు
రాఘవాన్వవాయు లా యిరువురు
నాశ్రమమ్ము దీని నభిభవించుట యీవు
కాంచి సైచువారు కారు వారు 1586

ఈవు పిరికివాడ విట్టులు నెరపిన
కార్య మిదియు లోక గర్హితమ్ము
దొంగవా రొనర్చు త్రోవ యియ్యది వీర
వరులు పూనుకొనెడి పాటి గాదు 1587

పోరు సల్పు మీవు శూరుండ వైనచో
నుండు రావణా! ముహూర్త మిచట
పండె దీవు చచ్చి పడి యుండి నేలపై
భ్రాత ఖరుడు పడిన పగిది గాగ 1588

తెగెడి కాల మరుగుదెంచిన పురుషుండు
పని యదెట్టిది నెరపంగ బూను
నాత్మ నాశమునకునై యధర్మ్యమ్ము నీ
వట్టి పని యొనర్ప బట్టినావు 1589

పాప ఫల మొదవునా పనికి నెద్దానికి
నట్టి తెరగు కర్మ యది యెవండు
నలుపగా నగునొకో జగ దధీశుడు భగ
వానుడౌ స్వయంభు వైన గాని" 1590

అని వచించి మంగళాస్పదమౌ పల్కు
లా యసురునకున్ జటాయు వంత
నుదుటు మీర నప్పు డురికె దశగ్రీవు
వీర్యవంతు వెడద వీపు మీద 1591

వాడి మీరు గోళ్ళ వానిని బట్టి యె
ల్లెడల పొడిచివైచె నొడలి నింద
మాపటీడు దుష్ట మత్త మాతంగము
మూపు పైకి నెక్కి పొడిచి నట్లు 1592

వాని మూపుమీద నానించి తన ముక్కు
చీరివైచె వాడి మీరు గోళ్ళ
నూడ బెరికె నెత్తి నున్న జుట్టును బట్టి
యాస్య పక్ష నఖ చయాయుధుండు 1593

గృధ్ర రాజు చేత క్లిశ్యమానుం డయి
యట్లు మాటి మాటి కతడు నంత
నలుక గదుర మోవి యదరంగ రావణు
నొడల కంపనమ్ము గడలు కొనియె 1594

పొదివి పట్టి జనక పుత్రిని వామాంక
మం దతండు రావణాసురుండు
క్రోధ మూర్ఛితుండు గోధా తలమ్మున
నడచె నా జటాయు నతి రయమున 1595

వాని చుట్టు తిరిగి వచ్చి జటాయువు
పులుగు రేడు వాడి ముక్కు తోడ
వాని వామ బాహు వర్గ దశక మరిం
దముడు త్రుంచి వైచె తత్క్షణమ్మ 1596

ఆ నిమునమె బాహు లావిర్భవించె సం
ఛిన్న బాహునకును చెచ్చెర నట
విష శిఖావళీ వివేష్టిత భుజగముల్
పుట్టనుండి వెలికి పొడమి నట్లు 1597

* రావణుడు జటాయువును నేల గూల్చుట *

అంత నలుక గొన్న యా దశగ్రీవుండు
రావణుండు సీత పోవ విడిచి
కాళ్ళతోడ ముష్టి ఘాతమ్ములన్ గృధ్ర
లోకనాథు బట్టి క్రుమ్మి వైచె 1598

అంత నొక ముహూర్త మాహవ మాయె నా
యతుల వీర్యవంతు లైన వారి
కఖిల దనుజ జన గణాగ్రేసరునకును
సకల నీడజాత సత్తమునకు 1599

బడలు పడుచు నున్న వాని రాఘవునకై
యా ఖగేంద్రు రావణాసురుండు
పక్ష పార్శ్వ యుగము పాద ద్వయమ్మును
చేత కత్తి నెత్తి చెండి వైచె 1600

రౌద్రకర్ము డైన రాక్షసు డాతండు
త్రుంచివైవ రెక్క దోయి వేగ
మవని మీద బడియె నల్పజీవితు డైన
గృధ్ర సత్తముండు ద్రెటు వడుట 1601

వాని పుడమి బడిన వానిని రక్త సి
క్తాంగుడౌ జటాయు గనుల గాంచి
వనట దోగుచున్న వైదేహి చెంతకు
పరువు వారె స్వీయబంధు వట్లు 1602

నల్ల మబ్బు వెల్గున నుల్లసిల్లు వాని
బోర కడు తెల్లనైన యుదార వీర్యు
నా జటాయువు శాంత దావాగ్ని సదృశు
గాంచె పృథ్వీ తలమున లంకాధిపుండు 1603

పత్రరథమును నేలపై బడిన దాని
రావణాసురు ధాటి నలంగి పడిన
దాని గౌగిలించి శశి ప్రభానన జన
కాత్మజాత యేడిచె సీత యప్పు డచట 1604

## (52వ సర్గ)

కుట్టుసురున కొట్టు మిట్టాడుచున్న యా
గృధ్ర వరుని రఘు కులేశు నాశ్ర
మమ్ము చెంత భూతలమ్ముపై బడియున్న
వాని గాంచె దానవాధిపుండు 1605

అతని రావణ వినిహతు డైన వానిని
గృధ్రరాజు తారకేశ్వర ముఖి
యామె యరసి చూచి యచ్చట విలపించె
విపుల దుఃఖ భార వివశ యగుచు 1606

ప్రబల బల యుతుడగు రావణాసురునిచే
పడిన వాని గృధ్ర వరుని పొదివి
విపుల దుఃఖ మొంది విలపించె శశి నిభ
వదన జనక భూమి పాల తనయ 1607

“శకుని కంఠ రావ సందర్శనమ్ము ని
మిత్తమై యవశ్య మెపుడు గాని
నరుల కెల్ల లక్షణ జ్ఞానమై తోచు
వచ్చెడి సుఖ దుఃఖ వర్గము లెడ 1608

బెట్టిదంపు బెడద చుట్టుకొన్నది నాకు
నిక్కముగ నెరుంగవొక్కొ రామ!
నాకునై పరువిడు కాకుత్థ్సు గూరిచి
నిక్కము మృగ పక్షి నిచయమెల్ల 1609

నన్ను గావ వచ్చి యున్న వా డీతండు
పతగ సత్తముండు పాపచారి
చేత బడిన వాడు భూతలమున బండె
నిట్లు నా యదృష్ట హీనత గద! 1610

కావు మిపుడు నన్ను కాకుత్థ్స!” యంచును
‘లక్ష్మణా!’ యనియు వరాంగన కడు
నడ లెడంద గదుర నాక్రందన మొనర్చె
చేర్వ విను జనులకు చెప్పు నట్లు 1611

### * రావణుడు సీత నెత్తుకొని పోవుట *

నల్గి యున్న నరులు నగలు దాల్చిన దాని
దిక్కు లేని యట్లు వెక్కు దాని
సీత జనకతనయ జేరంగ పర్విడె

పెనగి తీవ వోలె పెనవైచుకొను దాని
పెను తరువుల పొదివికొనెడు దాని
'విడుము విడు' మటంచు పెక్కు తెరగుల గ
ద్దించు చుండి రాక్షసేశ్వరుండు 1613

'రామ! రామ!' యని విలాపించు దానిని
కాన రామ రహిత యైనదాని
పట్టుకొనియె జుట్టు వైవస్వ తోపముం
డాత్మ జీవితాంత మందు కొనగ 1614

చెరగొనంగ నట్లు సీతను సచరాచ
రమ్ముగా జగ మఖిలమ్మును తన
క్రమము తప్పిపోయి కడు తల్లడ మ్మందె
నంధతమము మూగి యలముకొనియె
మలయకుండె నచట మారుతమును దివా
కరుడు నిష్ప్రభుండు గాగ నుండె 1615

సీత దీనురాలి చెరగొని యుండుట
దివ్య దృష్టి పేర్మి తెలియ గాంచి
జరుగ వలసిన పని జరిగి పోయిన దని
పల్కె శ్రీయుతుండు బ్రహ్మ యపుడు 1616

హర్ష పూర్ణు లైరి వ్యధితు లయ్యిరి గూడ
పరమ మౌను లెల్లవారు వారు
దండకా వనమున నుండువా రెల్లరు
చెరను బడిన దాని సీత గాంచి
దాని యంత సదియె దాపురించెను రావ
ణాసురుని వినాశ మనియు తలచి 1617

'రామ! రామ!' యంచు 'లక్ష్మణా!' యంచు బి
ట్టేడ్చుచున్న దాని నీడ్చికొనుచు
వెడలి పోయె నతడు వినువీథి వెంబడి
రాక్షసేశ్వరుండు రావణుండు 1618

అర్ఘ్య తప్త భూషణాభ వర్ణాంగియు
పసవు పట్టు బట్ట నెసగు నదియు
వెలుగు లీనుచుండె విద్యుత్తటిల్లత
వోలె జనక రాజ పుత్రి యామె 1619

పైకి నెగురుచున్న యాకె పచ్చని వన్నె
పట్టుచీర చెరగు ప్రభల వలన
రావణుండు కడు విరాజిల్లు చుండెను
మండు మంటతోడి కొండ వోలె 1620

పరమ మంగళాంగి వైదేహి నెమ్మేని
సరసిజ దళము లవి సురభిళములు
తామ్ర వర్ణ యుక్తి దనరారునవి ప్రీలి
రాలి పోయి పడియె రావణు పయి 1621

ఆకసమ్ము లోన పైకి నెగసిన యామె
స్వర్ణ వర్ణ మైన పట్టు చెరగు
వెలుగుచుండె నెండ వేళ నాదిత్య రా
గమున నెర్రనైన ఘనము వోలె 1622

ఆకసమున రావణాంక గతమ్మైన
యామె సునస మైన యాననమ్ము
రామహీన మౌట రాజిల్ల కుండెను
నాళ హీనమైన నలిన మట్లు 1623

నీలి వన్నె మబ్బు చీలిచి వెలువడి
నట్టి చంద్ర బింబ మట్టు లొప్పె
నెరి కురు లలరారు నెన్నొస లమలిన
సరసి జాత గర్భ సన్నిభమ్ము 1624

ఆకసమున రావణాంక గతమ్మైన
యామె విమలమైన యాననమ్ము
శుక్ల సువిమలములు సురుచిరములు నైన
దంతముల నలంకృత మ్మయినది 1625

ఏడ్చి కంటి నీటి నోడ్చుచు నున్నది
చంద్రు నట్లు చూడ చక్కనిదియు
చారు నాసికమ్ము చారు తామ్రోష్ఠము
గగన వీథి హాటక ప్రభమ్ము 1626

రాక్షసుని కతమున త్రాస కంపిత మైన
యామె యా శుభాస్య దాననమ్ము
రామహీన మగుట రాజిల్ల కుండెను
పగట పొడిచిన శశి పగిది గాగ 1627

హేమవర్ణ యైన యామె మైథిలి నీల
వర్ణ గాత్రు దానవాధినాథు
నెనసి యుండి నీల మణిని బంగరు తీగ
పెనచి నట్టి రీతి వెలుగుచుండె 1628

సరసి జాత పీత సద్వర్ణ హేమాభ
కనక భూషణ జనకాత్మజాత
రావణున్ బెరసి విరాజిల్లు చుండెను
జలద సక్త యైన శంప వోలె 1629

మాని లేజివుళ్ళ మాద్రి వన్నియ యామె
జనక తనయ రాక్షసాధిపునకు
నీల తనునకు రమణీయ శోభను గూర్చె
కరికి కాంచన మయ కక్ష్య వోలె 1630

ఆ విదేహ నరవరాత్మజ భూషణ
ఘోషణమున దైత్య కుంజరుండు
మెరపు తోడ బెరసి యురుముచు నున్నట్టి
నల్లమబ్బు వోలె నుల్లసిల్లె 1631

ఆమె నెత్తుకొనుచు నరుగుచు నుంత నా
సీత యుత్తమాంగ సీమ నుండి
జారిపడియె నపుడు దారిలో నెల్లెడ
భూమి తలము మీద పుష్ప వృష్టి 1632

రావణాసురు నురు రయమున నా పుష్ప
వృష్టి యదియు నెల్ల యెడల చెల్ల
చెదరి పోయిన యది పదపడి దశకంఠు
మరల చుట్టుముట్టి మలయుచుండె 1633

పడెడు పూలజల్లు వైశ్రవణానుజు
నతని చుట్టువారి యలరుచుండె
మిగుల నిడుపు గల్గు మేరు నగమ్ము న
క్షత్రమాల మూగు కరణి గాగ 1634

జారి పడియె సీత చరణమ్ము నందుండి
మెరపు తీగచుట్టు యొరపు గల్గు
మణులు పొదిగి యున్న మవ్వంపు టందియ
యింపు నింపు రవళి యొసగుచుండ 1635

స్వీయ కాంతి పేర్మి వినువీథి వెలుగొందు
దొడ్డ యుల్క వోలె తోచు దాని
నపహరించు కొనుచు నరిగె వైశ్రవణాను
జుండు జనక తనయ జొచ్చి మింట 1636

ఆమె తాల్చియున్న యగ్ని వర్ణమ్ములౌ
భూషణమ్ము లవియు భూతలమున
దొరగు చుండె నులివుతో మింటిపై నుండి
సురిగిపోయి నట్టి చుక్క లట్లు 1637

ఆ విదేహ నరవరాత్మజ చనుదోయి
నడుమ నుండి జారి పడుచు నున్న
హార మమల తారకాధిప ద్యుతి యొప్పె
గగన విచ్యుత యగు గంగ పగిది 1638

ప్రబల వేగ జాత వాతాభిహతములు
వివిధ విహగ జాల విహితములు వి
ధూత శిఖర ధరణి జాతముల్ 'భయపడ
వల' దటంచు పల్కు పగిది నుండె 1639

ధ్వస్త కమలములును త్రస్త మీన జలేచ
రమ్ము లంబుజాకరమ్ము లలమ
టించుచుండె మైధిలేశ తనూజకై
పోయిన చెలి గూర్చి పొగులు నట్లు 1640

ఎల్ల కడల నుండి యేతెంచి సమకూడి
వ్యాఘ్ర సింహ మృగ విహంగమములు
వెంబడించి పరువువెట్టె రోషమ్మున
నపుడు సీతనీడ ననుసరించి 1641

బహు జల ప్రపాత బాష్ప ముఖముల ను
చ్ఛ్రిత సుదీర్ఘ బాహు శృంగములను
పర్వతమ్ము లేడ్చు పగిది దోచెను సీత
నపహరించి కొనుచు నరుగుచుండ 1642

అపహరించి కొనుచు నరుగుచుండగ సీత
నరసి దీనుడై యహస్కరుండు
శ్రీయుతుండు పరగె శ్వేత మండలుడుగా
నాత్మ తేజ మెల్ల నణగిపోవ **1643**

'సున్న ధర్మ మేడ నున్నది సత్య? మా
ర్జవము దబ్బర యనృశంసతయును
రాము భార్య యైన యామె వైదేహిని
రావణుండు గొంచుపోవు చున్న
వా డనంగ' నంచు ప్రాణి లోకమ్మెల్ల
కూడి వగపు నొంది కుందుచుండె **1644**

మొగము వ్రేలవైచి మృగ పోతకమ్ములు
వెరపు గ్రమ్మకొనగ వెక్కి యేడ్చె
కన్ను లెత్తి తేరి కనుగొని కనుగొని
యస్ర పాత కలుషితాక్షు లగుచు **1645**

అట్లు గాఢ దుఃఖము నొంది యార్చుదాని
'రామ! లక్ష్మణ!' యని మధుర స్వరమున
ధరణి తలమును పలుమారు లరయు దాని
కనుల గాంచి సీతను జనకాత్మజ వన
దేవతలు సుప్రవేపిత దేహులైరి **1646**

ఆమె చెదరి యున్న యలకలు గల దాని
బొట్టు చెరిగి పోయినట్టి దాని
నా మనస్విని నటు లాత్మ నాశమునకై
యపహరించె నా దశాననుండు **1647**

అంత సుదతి శుచి స్మితయైన యామె
బంధు జన హీన మిథిలాధి పాత్మజాత
కాన లేమిని రామ లక్ష్మణు లిరువుర
భయ నిపీడితయు వివర్ణ వదన యయ్యె **1648**

## (53 వ సర్గ)

ఆకసమున నెగయు నాతని గని మిథి
లా తనూజ జనక రాజ పుత్రి
యుమ్మలికమున పరమోద్విగ్నయై మహా
భయము క్రమ్ముకొనగ బరగు నదియు 1649

### * సీత రావణు దూషించుట *

సీత రోదన కలుషిత రోష తామ్రాక్షి
భీకరాక్షు దానవేశు గాంచి
యెత్తికొంచు తన్ను నేగుచుండగ జాలి
పుట్ట నేడ్చుచుండి యిట్టు లనియె: 1650

"నీవు సిగ్గుపడవు నీచుడా! రావణా!
చేసియున్న యిట్టి చెట్ట పనికి
నొంటి నుండు టెరిగి యుండి నన్ దొంగిలి
పారిపోవు చున్నవాడ వీవు 1651

నను హరింప గోరినాడవు దుష్టాత్మ
డీవె పిరికివాడ వెడ గలుగగ
నాదు భర్త దొలచినాడవు నిక్కమ్ము
హరిణ రూప మాయ నలవరించి 1652

నన్ను గావ బూను కొన్నవా డియ్యెడ
కూలిపోయె నితడు గూడ నేల
వీడు కూర్మి చెల్మికాడు మా మామకు
కడు ముదుసలి యైన గ్రద్ద రేడు 1653

రాక్షసాధమా! పరాక్రమ మిది నీది
యుత్తమోత్తమముగ నొప్పును గద!
పేరు పెంపు సెప్పి పోరిలోపల నన్ను
గెలువ లేదు నీదు కెలసమునను 1654

ఇట్టి నింద్యమైన యట్టి కార్యమ్ము కా
వించి యెట్టు లీవు బిడియపడవు?
అపహరించి తెచ్చు టాడుదానిని నీచ!
ఒంటిదాని నందు నోరుని యాలి 1655

పలుకువారు లోకముల లోన జను లెల్ల
కుత్సితమ్మను కడు క్రూరతాస్ప
దమ్ము కర్మ మిది యధర్మిష్ఠ మంచు శౌం
డీర్యమాని వీవు నెరపిన యది 1656

ఛత్త్రిదేమి నీదు శౌర్యమ్ము సత్త్వమ్ము
నపుడు చెప్పుకొన్న దదియు నీవు
వంగడమునకు తలవంపు లోకమ్మున
ఛత్త్రిదేమి యిట్టి చరిత నీది? 1657

ఏమి చేయవచ్చు నిట్టులుగా నీవు
పరువు వెట్టు చుంటి వురికి కొనుచు
నుండు మిచట నిలిచి యొక ముహూర్తమ్మైన
బ్రదికి యిచట నుండి బయట పడవు 1658

వారి కంటి చూపు దారిని పడినచో
పార్థివేంద్ర సుతుల బారినుండి
యొక ముహూర్తమైన నుండజాలవు నీవు
బ్రదికి సైన్య మరిమి బలసి యున్న 1659

సైప నీకు శక్తి చాలదు వారల
యమ్ము తాకు లెట్టు లైన గాని
బలితమైన యడవి ప్రజ్వలిత మ్మైన
యగ్ని స్పర్శనము విహంగ మట్లు
నెరపుకొనుము చక్క నీకు హితమ్మును
నను వినుము రావణా! మృదువగ 1660

మత్ర్పధర్ష ణాభ్యమర్షితు డైన నా
భర్త యింక తనదు భ్రాత తోడ
నీ వినాశనమ్ము నెరవేర్ప బూనును
నన్ను నీవు విడువకున్న యెడల 1661

బలిమి నన్ను నెట్టి వ్యవసాయమునకునై
కొంచుబోవ నీవు కోరుచుంటి
నీచ! యట్టి దైన నీ వ్యవసాయము
కాగలదు నిరర్థకమ్మె యింక 1662

భర్త నతని విబుధవర్యోపమానుని
కన్నులార గాంచకున్న నేను
చిరము ప్రాణములను ధరియించి యుండగా
నుత్సహింప శత్రువునకు లోగి 1663

నిక్కువముగ నీవు నీ శ్రేయమున్ హిత
మరసికొనని వాడ వైతివి గద
చావు దాపురించు సమయమున నరుండు
కోరి కాని వాని గొనెడు నట్లు 1664

చావ గోరుచున్న జనుల కెల్లరకును
పథ్యము చవి గాక బరగు చుండు
కాంచుదాన నిన్ను కాల పాశావపా
శితుని గాగ కంఠ సీమ నేడు 1665

భయము గొలుపు నట్టి పట్టున నియ్యెడ
భయము పడ వనంగ పంక్తి వదన!
కాంచుచుంటి వీవు కాంచన మయమైన
క్ష్మారుహమ్ము లంచు స్పష్టమె గద 1666

భయద ఘోరమైన వైతరణీ నది
వచ్చి నెత్తు రొరయ పారు దాని
నతి భయంకరమ్ము నసిపత్ర వనమును
కనుల గాంచుచుంటి గాదె యసుర! 1667

తప్త కనకమయ లతాం తాన్వితమ్మును
ప్రవర రత్న జాల పత్ర సహిత
మశ్మసార కంటకావృత శాల్మలీ
పాదపమ్ము గాంచువాడ వీవు 1668

ఆ మహాత్మకునకు నపకార మిట్టిది
నెరపియున్న నీవు నిర్ఘృణుడవు
చిరము ప్రాణములను ధరియింప జాలవు
ఘోరమైన విషము గ్రోలినట్లు 1669

కాల పాశమునకు కట్టు పడితి దుర్ని
వార మదియు దానవాధమ! యిక
నెచటి కేగి శర్మ మెనయుదు వా మహా
త్మకుడు నాదు భర్త తాకుదేర 1670

కన్ను రెప్ప పాటు కాలమ్మునన్ మహా
వనము లోన వెంట భ్రాత లేక
కదనమం దతండు పదియు నాలుగు వేల
మంది రాక్షసులను మ్రంద జేసె 1671

అట్టి వాడు వీరు డఖిలాస్త్ర కోవిదు
డతుల బలుడు రాఘవాన్వయుండు
చంపకుండు నెట్లు శాత శరమ్ముల
నిన బారం నపహరించి నతని?" 1672

ఇవియు నింక కొన్ని యిట్టివి పరుషము
లార్చి జాలిగొల్పు నట్లు గాగ
రావణాంక సంస్థ యా విదేహాత్మజ
భయము శోక మెడద ప్రబ్బు కొనగ 1673

అట్లు కడు దీనయై పెక్కు లార్చు దాని
నేడ్చుచును జాలిగా పలవించు భామ
మేన వడకొంది యున్నామె మెలి దిరిగెడు
నృప సుతను జాలి బడ హరియించె పాపి 1674

## (54 వ సర్గ)

### * సీత యాభరణములు జారవిడుచుట *

అపహరించి కొనుచు నరుగు చుండగ సీత
యొక్క దిక్కు కానకున్న యామె
కొండ కొమ్మ నందు కూర్చొని యున్న వా
నర వరేణ్యు లైదుగురను గాంచె 1675

కనక కాంతి యుతము కౌశేయ కోత్తరీ
యమ్ము శుభకరమ్ము లాభరణము
లచట వారి నడుమ నా విశాలేక్షణ
జారవిడిచె నపుడు జనక తనయ
'వారలైన చెప్పవచ్చు రాముని కొక్క
యెడల నటకు వచ్చునే' నటంచు 1676

భూషణముల తోడ మూటగా పుట్టమ్ము
వారి నడుమ నట్లు జార విడువ
సంభ్రమమున నా దశగ్రీవు డైన తా
నరయ కుండె నప్పు డట్టి పనిని 1677

అట్టు లార్చు సీత నా విశాలాక్షి పిం
గాక్షులైన వానరర్షభులును
రెప్పపా టొకింత లేకున్న య ట్లున్న
కనుల మింట బరపి గాంచి రపుడు 1678

అతిగమించి పంప నాతండు లంకా పు
రాభిముఖము గాగ నరిగె నప్పు
డేచ్చుచున్న దాని నెత్తుకొని విదేహ
నృప తనూజ రాక్షసేశ్వరుండు 1679

ఆత్మ మృత్యు వైన యా మెను రావణుం
డెత్తికొంచు పరమ హృష్టి నరిగె
తీవ్ర విష సమేత తీక్ష్ణ దంష్ట్రాన్విత
భుజగ కాంత నాడిని పొదివి నట్లు 1680

కొండ లడవు లేర్లు కొలకు లాకసమున
వింట నంపకోల విడిచినట్లు
వేగ దాటిపోయి సాగరమును తిమి
నక్ర నిలయము వరుణాలయమ్ము
హ్రాదినీ శరణ్య మక్షయ మంభోధి
దరియ నరిగి దాని దాటిపోయి 1681

సంభ్రమ మాకులమ్ము సంపరివృత్తోర్మి
స్తబ్ధ మీన మహిత సర్ప మగుచు
పరగు చుండె నపుడు వరుణాలయమ్ము వై
దేహి నపహరించి తెచ్చుచుండ 1682

అంతరిక్ష సీమయం దున్న చారణు
లపుడు మెల్ల పల్కులాడి రిట్టు :
"లిదియె రావణునకు తుది" యని యట్టులే
యనిరి గూడ సిద్ధ జనులు నపుడు 1683

* రావణుడు సీతతో నంతఃపురము జొచ్చుట *

ఆత్మ మృత్యు రూపమై యున్న దాని మై
థిలిని పలు మెలికలు తిరుగు దాని
నంకమందు తాల్చి యా రావణుండు లం
కా పురమ్ము జొచ్చె నా పెతోడ 1684

దరియ నరిగి యతడు పురి లంక సువిభక్త
మహిత విపుల మార్గ సహిత నంత
కొలుచు జనుల బలసి పలు కక్ష్య లొప్పారు
తనదు నంతిపురము దరిసి చొచ్చె 1685

అచట నా యసితాపాంగ యైన దాని
శోక మోహ పరవశయై క్రుస్క్క దాని
జనక పుత్రిని రావణుం డునిచె నపుడు
మయుడు మాయా మయోపేత మహిళనట్లు 1686

దశ గళుండు ఘోర దర్శనల పిశాచు
లను గనుంగొని యిటు లని వచించె:
"నాన లేక పురుషు డైన నాడుది యైన
గాంచకుండ సీత గావ వలయు 1687

ముత్తియములు మణులు పుత్తడి యైన నా
భరణములును మేలి వలువ లైన
నేవి యేని కోరు నీమె యవి యవి మీ
రిందు కూర్మి నేనె యిచ్చు నట్లు 1688

పలుకు నెవతె గాని వైదేహితో నించు
కైన గాని యప్రియంపు బల్కు
నెరుగకుండ నైన నెరిగి యుండియు నైన
నామె బ్రదుకు మీద నాస లేదు" 1689

*** రావణుడు జనస్థానమునకు చారుల బంపుట ***

అట్టు లని వచించి యా రాక్షసులకు ప
రాక్ర మాన్వితుండు రాక్షసేంద్రు
డంతిపురిని వీడి యద్దాని వెల్వడి
చింత సేసి యేమి చేయ నగునా
వీర్య మహితులైన పిశితాశనులను రా
క్షస వరు లెనమండ్ర గాంచె నపుడు 1690

వారి గాంచి యతడు వరదాన మోహితు
డైన మహిత వీర్యు డసుర వరుడు
ప్రస్తుతించి వారి బల వీర్యముల మెయి
వల్కె వారి తోడ వల్కు లిట్లు: 1691

“వేగ మిచట నుండి వివిధాయుధమ్ముల
దాల్చి సత్వరముగ తరలి పొండు
నాశమైన యా జనస్థానమున కింత
మున్ను ఖరుడు వాస మున్న యెడకు 1692

విడచి పుచ్చి వెరపు నెడ గల్గగా జన
స్థానమునను నిహత దానవమున
నిర్జనమున నచట నెలకొని యుండుడు
పౌరుషమ్ము బలము ప్రాపు గాగ 1693

నా బల మ్మదియు జనస్థానమున మున్ను
నిల్పి యున్న ది మహనీయమైన
దాహవమున నిహత మయ్యె దూషణ ఖరా
న్వితము రాము చేత విశిఖములను 1694

అట్టి యెడల నైప నలవి గామిని ధైర్య
మునకు మించి క్రోధ మొప్పుచుండు
పొడమె బెట్టిదముగ కడు దారుణమ్మైన
వైర మదియు రాము వలన నాకు 1695

వైర మదియు తీర్చి వైవగ రిపు నెడ
నిచ్చగించు చుంటి నేను నిపుడు
సమరమందు రిపుని సమయింపకుండ నే
పడయ లేక యున్న వాడ నిద్ర 1696

హత మొనర్చి యిప్పు డా ఖర దూషణ
హంత యైన వాని నతని రాము
పడయువాడ నేను కడలేని సౌఖ్యమ్ము
లిబ్బి యబ్బ పేద యుబ్బు నట్లు 1697

మీరు వాసమున్న వార లై యట జన
స్థానమందు రాము సంగతులగు
వార్తలు కొని తేరవలె నున్న దున్నట్టు
లేమి యత డాచరించు వాడొ 1698

ఏమరకయె మాత్ర మేగంగ నగు నిశా
చరులె యైన గాని సర్వ జనులు
సంతతమ్ము రాము చంపుట కొరకునై
యత్న మాచరింప నగును మీరు 1699

పెక్కు మార్లు మున్ను పెనకువ మొనను మీ
బలము నెరిగియున్న వాడ నేను
దాని వలననే గదా జనస్థానమ్ము
లోన పనికి బూన్చు టేను మిమ్ము 1700

అంతట ప్రశంసలున్ ప్రియమైన పల్కు
లంది యెనమంద్రు మ్రొక్కి దశాననునకు
లంక విడచి యలక్ష్య దర్శనులు కూడి
తరలి చనిరి వారలు జనస్థాన దిశకు 1701

పడసి మైథిలి నంత రావణుడు సీత
స్వీకరించుటచే సంప్రహృష్టు డగుచు
రాముతో దొడ్డ వైరమ్ము ప్రాప్తమైన
మోహమున రాక్షసుడు వాడు మోద మందె 1702

## (55 వ సర్గ)

రావణుండు ఘోర రాక్షసు లెనమంద్ర
బల సమాఢ్యు లైన వారి బంచి
తలచు కొనియె బుద్ధి తక్కువ యగుటచే
తన పని నెరవేర్చు కొనిన యట్లు 1703

*** రావణుడు సీతను లోభ పెట్ట జూచుట ***

తలచుకొనుచు జనక తనయను కామ బా
ణార్పితు డగు నాత డపుడు సీత
గాంచు తమిని మనము కడు సందడింపగా
తాను రమ్య గృహము లోని కరిగె 1704

ఆ గృహమ్ము లోని కతడు ప్రవేశించి
రాక్షసాధిపుండు రావణుండు
చూచె నచట సీత శోక పరాయణ
రాక్ష సాంగనా సమక్ష మందు 1705

పరమ దీన శోక భారాభిపీడిత
నశ్రు పూర్ణ వదన యైన యామె
నర్ణవమ్ము లోన ననిల వేగాక్రాంత
యై మునుంగు నావ యట్టి దాని 1706

హరిణ యూథమునకు నెడయై శునకము
లలముకొన నున్న హరిణమ్ము నట్టి సీత
నామె నట నధోముఖ ముఖి యైన దాని
దరియగా నేగి దానవేశ్వరు డతండు 1707

దీనురాలి కవశయైన యామెకు శోక
పరవశాత్మ కపుడు బల్మి మెయిని
కానుపించె దేవతా నిలయోపమ
మైన గృహము రాక్షసాధిపుండు 1708

హర్మ్యములును ప్రాసాదమ్ము లలమి యుండ
స్త్రీ సహస్ర సేవితమయి చెలగు దాని
వివిధ విహగ గణ సమభివేష్టితమ్ము
వివిధ రత్న నికాయ సంవిలసితమ్ము 1709

స్తంభములను కనక తప్త చామీకర
స్ఫటిక రజత యుక్తి బరగువాన
బహు విచిత్ర వజ్ర వైడూర్య మయముల
దృఙ్మనోహరముల నెసగు దాని 1710

దివ్య దుందుభి నిర్హ్రాద దీప్త మగుచు
తప్త కాంచన తోరణావాప్తి దనరు
వింత కాంచన సోపాన వీథి నెక్కె
నసుర జననాథు డాతండు నామె తోడ 1711

దాంతికములు రాజతమ్ములునౌ గవా
క్షమ్ములు ప్రియ దర్శనమ్ము లగుచు
హేమజాల సమభివృతములై ప్రాసాద
పంక్తు లచట మిగుల వరలు చుండె 1712

తన గృహమ్మునన్ సుధామణి గణ విచి
త్రమ్ములైన భూమి తలము లెల్ల
కడల గురుతు తెలియ కానుపించెను జన
కాత్మజాత కా దశాననుండు 1713

వివిధ వృక్షజాల వేష్టితమై యొప్పు
దివ్య పుష్కరిణులు దీర్ఘికలును
కానుపించె పంక్తి కంఠుండు సీతకు
నలమటించు చున్న యామె కంత 1714

కానుపించి యట్లుగా సౌధ సత్తమ
మదియు నెల్లను జనకాత్మజాత
కనియె పల్కు లిట్టు లంచు పాపాత్ముడు
లోభపెట్ట సీత లో దలంచి : 1715

"దానవ జను లిందు దశ కోటు లిరువది
రెండు కోటు లింక నుండు వారు
వారి కెల్లరకును ప్రభువు నే నో సీత!
భయద కర్మలైన వారలకును 1716

వదలి పెట్టివైచి ముదిమిచే పెద్దల
చిరుతవారి రాత్రి చరుల నింక
నొక్క వెయ్యి మంది యొక్కనికే నాకు
పనుల బూని యుండువారు కలరు 1717

నిలిచి యున్న దింక నీ చేత నాయది
ఇట్టి రాజ్య తంత్ర మిదియు నెల్ల
ఓ విశాలనయన! జీవిత మ్మిదియు ప్రా
ణముల కన్న మిన్న నాకు నీవు 1718

బహు సహస్ర సంఖ్య వనితల కేను ప
రిగ్రహించి యున్న లేమ లెల్ల
రకును సీత! నీవు రాణి వౌదువు ప్రియు
రాల! నాకు భార్య వగుమ యింక 1719

చక్క నీకు నిక మరొక్క బుద్ధేటికి?
చవి గొలుపుము నా వచనము లీవు
ఆదరింపు నన్ను నభితప్తు డైన నా
యెడ ప్రసాద మూను టెసగు నీకు 1720

నూరు యోజనముల మేర లంకను దీని
వేచి కాచువారు వేల కొలది
చెనకుటకును శక్తి యొనగూడ దింద్రుని
తో సురాసురులకు దొడరి దీని 1721

అమరులందు యక్షులం దైన గంధర్వు
లందు గాని పక్షులందు గాని
నాకు గానరాడు లోకమ్ములందు నా
సాటి వచ్చు వాడు శౌర్యమందు 1722

భ్రష్ట రాజ్యుడైన వానితో దీనుతో
నా తపస్వితో గతాయుతోడ
నేమి చేయుదాన వీవు రాముని తోడ
మందతేజు డైన మనుజు తోడ? 1723

చేరి కొల్వు మీవు సీత! నన్నిక మీద
తగినవాడ నీకు మగడ నేనె
అధ్రువమ్ము గాదె యౌవన మో భీరు!
కూడి నను రమింపు మీద నీవు 1724

దర్శన మ్మొనర్చు తలపు నూనకు మీవు
రాఘవాత్మజున్ వరాననా! యిక
నరుగుదేర నిచటి కతని కెయ్యది శక్తి
జానకీ! మనోరథాన నైన? 1725

ప్రబల జవము గల్గు వాయువు మింట పా
శముల గట్టిపెట్ట వలను పడదు
వెల్గుచున్న విమల వీతిహోత్ర జ్వాల
నైన గట్టిపెట్ట నలవి కాదు 1726

చూడలేదు నేను శోభనా! మూడు లో
కముల లోన నైన గాని యట్టి
వాని నస్మదీయ బాహు పాలిత నిన్ను
కడిమి గొంచు బోవ గల్గు వాని 1727

నీవు నిదియు సుమహనీయ రాజ్యము లంక
యందు పాలనమ్ము నాచరింపు
సేయువారు నీకు సేవ నా బోంట్లును
ననిమిషల్ చరాచరాశి యెల్ల
హర్ష మొంది యుండి యభిషేక సలిల సం
క్లిన్న వగుచు నన్ను కేళి దేల్చు 1728

తొలి నొనర్చి యున్న దుష్కృత మది వన
వాసముననె నిన్ను బాసి చనియె
నీవు ధర్మమూని నెరపితి సుకృతమ్ము
పడయు మింక దాని ఫలము నీవు 1729

ఇందు నిల్చి సరుల వెల్లను మైథిలీ!
కడిది దివ్యమైన గంధములును
ముఖ్యమౌ నమూల్య భూషణములు దాల్చి
యనుభవింపు నన్ను నెనసియుండి 1730

వైశ్రవణుడు నాదు భ్రాత యాతని విమా
నమ్ము పుష్పక మ్మనంగ బరగు
సూర్య సన్నిభమ్ము సుశ్రోణి! యద్దాని
గెలుచుకొంటి నేను బలిమి మెరయ 1731

అది విశాలమైన దత్యంత రమణీయ
మా విమానవర సమానమైన
దెందు లేదు సీత! యందు నాతో గూడి
యింపు మీరగ విహరింపు మీవు 1732

పద్మ సన్నిభమ్ము వదనమ్ము విమలమ్ము
చారు దర్శనమ్ము చారు జఘన!
శోకమున మునింగి సౌక్క వరాననా!
కాంతు లీనకుండు గాదె అదియు" 1733

ఇట్టు లం చతడు వచించుచు నుండ చే
లాంచలమున నా వరాంగన జన
కాత్మజాత శశి నిభాననమును గప్పి
కంటి నీటి నెడ తెగక యురల్చె 1734

ఆమె నసవ్వస్థ వలె ధ్యాన మాచరించు
దాని చింతాహత ప్రభ దీనురాలి
గాంచి వచియించె నిట్లని కలుష బుద్ధి
రాక్షస జనాధినాథుండు రావణుండు: 1735

"చాలు బిడియపడుట చాలు నో వైదేహి!
ధర్మలోప మన్న తలపు గూడ
తాప సోదితమ్ము దైవ నిష్యందము
నిన్ను జేర వచ్చుచున్నది యిది 1736

మృదులమైనవాని పదముల వీని నా
యుత్తమాంగ సక్తి నొత్తినాడ
సేయు మీవు కరుణ క్షిప్రమ్ము నా యెడ
నణగి యేను దాసు డైతి నీకు 1737

శూన్య వాక్కు లివ్వి శోషిల్లు వాడనై
పల్కుచున్న వాడ పల్కు లేను
ఆడుదాని కెవతె కైన ప్రమొక్కడడు శీ
ర్షముల తోడ నెపుడు రావణుండు" 1738

పల్కి యిట్టు లంచు పంక్తి కంఠుడు మిథి
లా తనూజ జనక రాజ తనయ
తన దటంచు నెడద దలచుచు నుండెను
యముని బారి బడిన యాత డగుట 1739

## (56 వ సర్గ)

### * సీత రావణుని పరుషము లాడుట *

పల్కి నట్లు విన్న వైదేహియున్ శోక
కర్శితాంగి వెరపు కడకు ద్రోచి
నడుమ గడ్డి పరక పడవైచి యిట్లని
బదులు రావణునకు పల్కె నపుడు: 1740

"ధర్మ సేతు వట్లు తలగ కుండెడు వాడు
దశరథు డను వాడు ధరణి ధవుడు
సత్య సంధు డతడు సంపరిజ్ఞాతుండు
నతని సుతుడు రాము డనెడు వాడు 1741

రాము డనగ బరగు నా మహా ధర్మాత్ము
డఖిల లోక విశ్రుతాఖ్యు డట్టి
యాయతాక్షు డైన యాజానుబాహుండు
నాకు దైవతమ్ము నాకు భర్త 1742

ఇద్ధ తేజసుండు నిక్ష్వాకు కులజాతు
డతడు కేసరి సదృశాంసు డింక
తనదు తమ్ము లక్ష్మణుని గూడి నీ ప్రాణ
వర్గమున్ హరించు వాడు సుమ్ము 1743

నన్ను నీవు వాని కన్నుల యెదుటనే
బల్మి చెనకి యున్న వాడ వేని
పండియుందు వీవు పడి యాలమున జన
స్థానమందు ఖరుని చక్కి గాగ 1744

పేరుకొంటి విపుడు ఘోర రూపులు మహా
బలు రటంచు దానవాళి నీవు
వారు నిర్విషు లగు వారు రాఘవు నెడ
పన్నగుల్ సుపర్ణు పట్ల బోలె 1745

వాని వింటి నారి వలన వెల్వడి వచ్చు
స్వర్ణ భూషితములు శరము లెల్ల
నీ యొడళ్ళ గ్రొచ్చి నిలువున గూల్చును
గంగ యొడ్డు నూర్మికలను వోలె 1746

అసురులకు సురలకు నైనను రావణా!
నిన్ను చంపరాక యున్న గాని
వాని తోడ దొడ్డ వైరమ్ము పుట్టించి
బ్రదికి యుండి బయట పడగ లేవు 1747

తక్కియున్న జీవితమ్ము నీయది ముగి
యించువాడు రఘు కులేశుడు బలి
యూపమొద్ద చేరియున్న పశువు బోలె
బ్రదికియుంట దుర్లభమ్ము నీకు 1748

రోష దీప్తము లగు లోచనముల రాము
డిపుడు నిన్ను గాంచు నేని యసుర!
నీవు తత్క్షణమ్ము నిర్దగ్ధుడై పరా
భవము నొందువాడ వంతలోనె 1749

సోము మింటినుండి భూమిపై పడవైవ
నైన నణచనైన నలవు గల్గు
వా డిగుర్ప గల్గువాడు సాగరము వా
డింక సీతను విడిపించు వాడు 1750

ఆయు వుడిగి పోయె నైశ్వర్య ముడిగె నీ
కుడిగె నింద్రియమ్ము లుడిగె సత్త్వ
మిట్టివాని నిన్ను బట్టి లంకయును వై
ధవ్య యుక్త యగుట తథ్య మింక 1751

ఈ వొనర్చి యున్న యీ పాప కర్మమ్ము
సౌఖ్యదాయి కాగ జాల దింక
వనము లోన నన్ను పతి పార్శ్వమున నుండి
పాపి యొంటి నుండ బరపి తీవు 1752

దైవ తాభియుక్తుడౌ వాడు గద మహః
ద్యుతియుతుండు నాదు పతి యతండు
వెరపు లేక పూని వీర్యమ్ము నిర్జన
దండకా వనమున నుండువాడు 1753

వాడు నీదు దర్ప బలములు వీర్యమ్ము
పొగరు నట్టై వాని బోలు వాని
పాయ ద్రోచువాడు నీ యొడళుల నుండి
బాణ వర్షమునను బవరమందు 1754

ఎపుడు భూతములకు నెల్ల వినాశమ్ము
కాల చోదితముగ కాననగునొ
అపుడు పొరబడుటయు నగు కార్యముల యెడ
గడచువారు నరులు కాల వశత 1755

చెనకియుంట నన్ను చేరువ యయ్యె నీ
కట్టి యదను రాక్షసాధమ! యిదె
ఆత్మ వధకు రాక్షసానీక వధమున
[illegible] 1756

భూమిసుర వర్గ మంత్ర సంపూత మగుచు
స్రుక్స్రువా ద్యుపకర ణోపశోభిత మగు
యజ్ఞ మధ్యస్థ వేది శక్యమ్ము గాదు
కాల దిగద్రొక్క నొక్క చండాలునకును 1757

ఆ విధమున పాపి వీవు పతివ్రతన్
ధర్మ నిత్యు నతని ధర్మపత్ని
నన్ను నంటుకొనుట యన్నదియును రాక్ష
సాధమా! యశక్య మగును గాదె 1758

సంతతమ్ము పద్మ షండమ్ములన్ రాజ
హంస వరము తోడ నాడుకొనెడు
హంసి జమ్మి తుప్పలందు నెక్కొను నీటి
కాకి చక్కి యెట్లు కాంచగలదు? 1759

ఈ యొడలికి తెలివి యింత యైనను లేదు
కట్టి పెట్టు మట్లు గాక తినుము
ఈ యొడ లిది రక్షణీయము కాదు నా
కస్లె జీవితమ్ము నైన నసుర
కాని యోపలేను నే నపదూరు పృ
థ్వీ తలమ్ము మీద విడచి పెట్టి" 1760

అని వచించి క్రోధమున విదేహాత్మజ
పరుష యుక్త మైన పల్కు లివియు
మాటలాడ లేదు మరి యేమియును జన
కాత్మజాత పంక్తికంఠు తోడ 1761

రోమ హర్షణము పరుషము నైనది సీత
యాడినట్టి పల్కు నాలకించి
యంత సీతతోడ నాతండు బదులాడె
భయము గొల్పునట్లు పల్కు లిట్టు: 1762

"మైథిలీ! విను నా పల్కు మానము లొక
పదియు రెండింటి గడువు లోపలను నీవు
చారుహాసినీ! నా దరి జేరవేని
ప్రాత రాశార్థమై నిన్ను వలలు రంత
చెక్కి వైతురు ముక్కలు ముక్కలుగను" 1763

పల్కి యిట్టు లంచు వరుషమౌ వాక్యమ్ము
రావణుండు శత్రు రావణుండు
నలుక గొన్న యాత డంత రాక్షసులతో
నీ విధమ్ముగా వచించె నపుడు 1764

*** సీతను అశోకవనికి పంపుట ***

"వికృత రూప లైన పిశిత రక్తాశనల్
ఘోర దర్శన లగు వారు దాన
వాంగన లిక మీర లతి శీఘ్రముగనె వ
దల్చివేయు డీమె దర్ప మెల్ల" 1765

ఇట్టు లన్న యంతనే యాతని సుఘోర
దానవాంగనా వితాన మెల్ల
ప్రాంజలించి యున్న వారలై మైథిలి
చెంత కేగి చుట్టుముట్టి రపుడు 1766

పల్కె నిట్టు లంచు వారితో నాతండు
దశముఖుండు ఘోర దర్శనుండు
గ్రక్కదల్చు చుండి కాలి తాపుల తోడ
నుర్వితలము వ్రచ్చుచున్న యట్లు: 1767

"ఈమె గొంచు బోవు డీ మైథిలి నశోక
వనము లోని నడిమి పట్టున కట
కడు రహస్యముగను కాచుచు నుండుడీ
ఈమె చుటు ముటి యెల వారు 1768

అచట దారుణమ్ములౌ బెదరింపుల
సాంత్వనముల నీమె జనక తనయ
లొంగ దీయు డెల్లరుం గూడి మీరలు
వన్య కుంజర వధువట్లుగాగ" 1769

ఇట్టు లంచు నానతీయగా రావణుం
డా నిశాచరాంగనా జనములు
చనిరి వా రశోక వనికి విదేహ పృ
థ్వీశ పుత్రిని తమ వెంట గొంచు 1770

సర్వ కాల ఫలభ రోర్వీజాతమ్ముల
వివిధ ఫల లతాంత విలసితమయి
సర్వ కాల మత్త శకున సముపసేవి
త మ్మశోక వనము తనరు చుండు 1771

ఆమె శోక పరిగతాంగియౌ నా మిథి
లా తనూజ జనక రాజ పుత్రి
యసుర కాంతల కటు లగ్గమై పడియుండె
నాడు పులుల నడుమ హరిణి వోలె 1772

ముమ్మరంపు శోకమున దోగినది మిథి
లా తనూజ జనక రాజ పుత్రి
యందకుండె సౌఖ్య మత్యంత భీరువు
ఉరుల దగులు కొన్న హరిణి కరణి 1773

అందు మైథిలి శర్మమ్ము నంద కుండె
వికృత నేత్రలు బెదరింప బెట్టిదముగ
దైవతమగు దయితు పతిన్ దలచుకొనుచు
త్రాస శోక పీడిత విచేతనత నొందె 1774

## (57 వ సర్గ)

### * మరలివచ్చు రాము డశుభ శకునముల గాంచుట *

మృగము రూపమున జరించుచు నున్న రా
క్షసుని కామరూప చారి తాట
కా తనూజు నట్లు కడతేర్చి రాముండు
దారి వేగ నరుగు దేరు చుండె 1775

అట్లు తొందర పడి యరుదెంచు వాని మై
థిలిని గనుగొనంగ వలచువాని
వాని వెనుక తట్టు వర డొక్క టరచెను
క్రూర నిస్వనమ్ము మీరు నట్లు 1776

దాని యా స్వరమ్ము దారుణమును రోమ
హర్షణమ్ము నైన దాలకించి
చింత మున్గియుండె చెలగు శివా రుత
మాలకింప శంక యంకురింప 1777

అశుభమే యగు నని యనుకొందు నే నక్క
యరచుచున్న యట్టి తెరగు బట్టి
జనక తనయ సేమమున నెసంగెడి నాక్కొ?
రక్కసులకు మెసవ దక్కకుండ 1778

హరిణ రూప మూనినాతడు మారీచు
డెరుక మీర నాదు నెలుగు నూని
యరచినట్టి యరపు లయ్యవి యాలించి
యుండునేని లక్ష్మణుండు గాని 1779

ఆలకించి స్వరము నద్దాని సౌమిత్రి
యామె మైథిలి విడనాడి యచట
నామె తొందరపడి యనిచి పుచ్చుటను నా
వద్ద కిటకు వెడలి వచ్చువాడు 1680

నిక్కువమ్ము కూడి రక్కసుల్ సీతను
చంప గోరినారు స్వర్ణ హరిణ
మయి తొలంగ నన్ను మారీచు డాశ్రమ
మునకు నెడగ గొంచుబోయి బాణ
హతిని దైత్యు డగుట 'హా లక్ష్మణ!' యని 'హ
తోఽస్మి' యనియు పల్కు లాడి యుంట 1781

స్వస్తి యొసగు నొక్కొ వా రిర్వురకును కా
రడవి తోడు లేని యట్టి వారి
కెదరు గొల్పినాడ నేను జనస్థాన
కారణమున నసుర గణములకును 1782

తోచుచున్న విపుడు దుర్నిమిత్తమ్ములు
ఘోరమైనవి పలుకొల్ల లంచు
తలచుకొనుచు నుండె తన మది రాముండు
నాలకించి నక్క యరపు లపుడు 1783

హరిణ రూప మూని యసురుండు త న్నట్లు
తొలగ గొంచు జనుట వలన నప్పు
డుల్లమందు శంక నూని జనస్థాన
మునకు రాఘవుండు చనియె మరలి 1784

వాని జేరజనియె పశు పక్షి గణములు
దీన మానసములు దీన గతిని
అప్రదక్షిణముగ నా మహాత్మకునకు
వికృత నిస్వనముల వెలుచుకొంచు 1785

కాంచి రాఘవుండు కడు ఘోరమౌ వాని
నపశకునము లప్పు డవియు నెల్ల
మరలి చనియె నతడు మరియు తొందరగ స్వీ
యాశ్రమమున కప్పు డతి రయమున 1786

అతడు జానకిన్ వరారోహ లక్ష్మణు
మహిత బలుని తనదు మనమునందు
తలచుకొంచు మరలి త జ్జనస్థానమ్ము
చేర రాము డరుగుదేరి నంత 1787

*** మరలి వచ్చు రాముడు లక్ష్మణుని జూచుట ***

అంత నరుగుదెంచు నాతని లక్ష్మణు
కాంతి రహితు నెదుట కనుల గాంచె
నట కదూర దేశమందు కూడుకొనియె
లక్ష్మణుం డతండు రాముతో వి
షణ్ణు డాతడు సువిషణ్ణునితో దుఃఖి
తుండు దుఃఖభాగితోడ నపుడు 1788

దానవ జన సేవిత మ్మైన నిర్జన
విపినమందు సీత విడిచి పెట్టి
యరుగుదెంచి యున్న యాతని లక్ష్మణు
నన్న బిట్టు దిట్టె నంత నచట 1789

లక్ష్మణుం గనుగొని రఘు నందనుడు సవ్య
కరము తనదు కేల నిరియ బట్టి
యుమ్మలించుచు మధు రోదర్కమున్ కడు
పరుషమైన పల్కు పల్కె నిట్లు: 1790

"అయ్యో! లక్ష్మణా! త్వదాచరిత మ్మైన
కార్య మియ్యది కడు గర్హ్య మీవు
విడచి సీత నిటకు వెడలి వచ్చుట సౌమ్య!
ఇంక మేలు గలుగు టెసగునొక్కొ? 1791

నాకు సంశయమ్ము లేకున్న దో వీర!
సర్వ విధముల నిక జనక తనయ
యణగి పోయెనొ మరి యాహార మయ్యెనో
కాననమ్ములోని దానవులకు
నాకు గడు నశుభములే కానుపించుచు
మను వినుడిగటనొకు మొగిన 1792

జనక ధరణి నాథ తనుజాత యౌ సీత
నుసురు లొడల దాల్చియుండ కీడు
పొరయకుండ నుండ పురుష శార్దూల! సౌ
మిత్రి! పడయు వారమే మన మిక? 1793

ఘోర నిస్వనమ్ము గోమాయువుల్ మృగ
సంఘములును మరియు శకునములును
వెలయ జేయు చుండె వెల్గుల నీనుచు
నున్న దిశల లోన నన్ని యెడల
భద్ర మొప్ప నామె బరుగు చుండెడునొక్కొ?
మానవేశ తనయ మహిత బలుడ! 1794

హరిణ రూపము గొన్న వా డసురు డితడు
దవ్వు వెంటాడు నన్నాస దగులు కొల్పి
కడకు హతు డయ్యె నెట్టులో కడు శ్రమమున
వాడు చచ్చుచునే దానవాకృతి గొనె 1795

నాదు మది దీనమై యుండె మోద ముడిగి
యెడమ క న్నదరెడి లే దికెట్టి సంశ
యమ్ము లక్ష్మణా! సీత లే దపహరించి
నారొ కూలెనో ఉన్నదో దారిలోన 1796

## (58 వ సర్గ)

### * రామునకు సీత క్షేమమును గూర్చి శంక పొడముట *

దశర థాత్మజుండు ధర్మాత్ము డతడు ప్ర
శ్నించె నిట్టు లంచు నిర్జన వని
సీత లేక యుండ నేతెంచి నతని ల
క్ష్మణుని దీన వదను గాంచి యపుడు: 1797

"తరలి వచ్చు వాని దండకాటవికి న
న్ననుగమించి వచ్చి నట్టి యామె
యామె యేడ? లక్ష్మణా! విదేహాత్మజ
వచ్చి తీవు విడచి పుచ్చి యామె 1798

దీనునకును రాజ్య హీనునకును దండ
కా వనమ్మున తిరుగాడు నాకు
తోడు దుఃఖ మెడల నేడ నా తనుమధ్య
యా విదేహ ధరణి పాత్మజాత? 1799

ఉత్సహింప బ్రదుక నొక ముహూర్తమ్మైన
నెవతె లేక యున్న నేను వీర!
యామె సీత నాకు ప్రాణ సహాయ ని
ర్జర సుతోపమాన చాన యేడ? 1800

అమర వల్లభత్వ మైనను లక్ష్మణా!
పృథ్వి కీశ్వరత్వ మేని గాని
జాతరూప తుల్య జనకాత్మజాత లే
కుండు నెడల నొల్లకుందు నేను 1801

బ్రతికియున్న దొక్కొ వైదేహి నాకు ప్రా
ణములకన్న గూర్చునట్టి యామె
కాకయుండు నొక్కొ కల్ల నా ప్రవ్రాజ
న మ్మిదెల్ల సౌమ్య! తమ్ముడ! యిక 1802

మరణ మొంద నేను మైథిలి కొరకు సౌ
మిత్రి పురికి నిర్గమింప నీవు
సౌఖ్య మార కోర్కె సమకూర కైకేయి
యామె పెంపు మీర నయ్యెడి నాకొ? 1803

పుత్ర రాజ్య సహిత మున్న సిద్ధార్థను
కేకయాత్మజాత నాకె జేర
కుండు నొక్కొ కోసలోద్భవ మృత పుత్ర
దీనురాలు సౌమ్య! దిక్కు లేక? 1804

బ్రదికి యున్న దేని వైదేహి మరల నా
శ్రమములోని కేను జనెడు వాడ
నా సువృత్త వృత్త యైనచో లక్ష్మణా!
ప్రాణములను విడచువాడ నేను 1805

ఆశ్రమమునకు జనినంతనే వైదేహి
నవ్వు మోము తోడ నన్ను నింక
పలుకరింపదేని చెలిమిని లక్ష్మణా!
నాశ మొందువాడ నయ్యా నేను 1806

చెప్పు నాకు సీత జీవించి యున్నదో
లేదో లక్ష్మణా! యదేదొ యింక
నీవు నేమరంగనే తపస్వినిని భ
క్షించినారె రాక్షసీ జనములు? 1807

చిన్నది సుకుమారి సీత యెల్లప్పుడు
కుములు టన్న దెరుగకున్న యామె
దుఃఖితాత్మ యగుచు దురపిల్లు బావురు
మంచు నన్నెడసిన దగుట వలన 1808

రాక్షసుండు కడు దురాత్ముండు కుటిలుం డ
తండు పేరెలుంగు దనరుచుండ
నార్వ 'లక్ష్మణా!' యటంచును తప్పక
యడలు పుట్టె నీకు నైన గాని 1809

ఆలకించె సీత యంచు శంకింతును
నా యెలుంగు బోలు నా యెలుంగు
భయము నొందినామె పంప న న్నరయంగ
నేగుదెంచి యుంటి వేగ మీవు 1810

అడవిలోన సీత విడనాడుటన్ కష్ట
మెల్ల వెంట నాచరించి యుంటి
క్రూర రాక్షసాళి కొసగి యున్నాడవు
తెరపి యీవు బదులు తీర్చుకొనగ 1811

ఖరుని గూల్చి యుంట కడు దుఃఖితుల్ పిశి
తాశను లగు రాక్షసాళి యెల్ల
కూలియుండు సీత ఘోర రాక్షసులచే
నిం దొకింత లేదు సందియంబు 1812

అయ్యో! యిట్టి వ్యసనమందు మున్గిన వాడ
నెల్లవెంట నింక నేమి చేయు
వాడ నిప్పు డరి నిబర్హణా! రానుండె
నిట్టి పా టటంచు నెంచువాడ" 1813

అంచు నిట్టు లా వరారోహ జింతించు
కొంచు నుండియే రఘూద్వహుండు
కడు రయమ్ము మీరగా జనస్థానము
నకును వచ్చె లక్ష్మణాన్వితముగ 1814

దీన రూపుని తమ్ము నిందించుచుండి
కడు బడలి యాకలిన్ దప్పికను వివర్ణ
శుష్క వదనుండు నిట్టూర్పుచున్న వాడు
శూన్యమౌ నాశ్రమము జేరి చూచి యరసి 1815

స్వీయమౌ నాశ్రమము ప్రవేశించి వీరు
డేగి యచ్చోట మెసలెడు నెడల కెల్ల
నిది యికింతే యటంచు వసించు చోటు
కడు గుబులుగుండె రోమాంచ గాత్రు డగుచు 1816

## (59 వ సర్గ)

అంత నాశ్రమమ్మునం దుండి తన్ జేర
నరుగు దెంచి నతని నంతరమున
మిగుల దుఃఖ తప్త డగు సుమిత్రాత్మజు
రాము డడిగె నిట్లు రఘు తనయుడు 1817

అతని కనియె "నెందు కని జానకిని విడ
నాడి యిట్లు వచ్చినాడ వీవు?
నేను నడవిలోన నీ మీది నమ్మిక
నామె విడచివుచ్చి యరిగి యుండ 1818

నిన్ను గాంచి నంతనే లక్ష్మణా! మిథి
లాత్మజాత విడచి యరుగు దెంచు
వాని నా మనమ్ము వ్యథితమ్ము శంకించె
నేడు దొడ్డ కీడు నిక్క మదియు 1819

ఇదియె అదరుచున్న దెడమ కన్నును కేలు
నెడమ నదరుచున్న దెడద నాకు
సీత లేకయుండ నేతేర లక్ష్మణా!
దారి నిన్ను గాంచి దూరమందు" 1820

* లక్ష్మణుడు తన రాకకు కారణము చెప్పుట *

అని వచింప విన్న యాతడు సౌమిత్రి
లక్ష్మణుండు సుశుభ లక్షణుండు
ముమ్మరంపు దుఃఖమున దోగి దుఃఖితు
డైన రాముతోడ ననియె నిట్లు: 1821

"ఏనె స్వయము గాగ నిచ్చకు వచ్చిన
ట్లామె విడచి యిటకు నరుగుదేర
నామె వాడి పల్కులాడి పుత్తెంచ నీ
సన్నిధి కిట వచ్చి యున్నవాడ 1822

ఆర్యు నట్లుగా పరాక్రుష్ట మైన 'హా!
సీత! లక్ష్మణా! యిదే తడయక
కావుమా!' యటన్న యా వాక్య మది మిథి
లాత్మజాత పీనులందు పడియె 1823

ఆర్తనాద మదియు నాలించి మైథిలి
నీ యెడలను గల్గు స్నేహమునను
'పొమ్ము! పొ' మ్మటంచు పొగులుచు నా తోడ
పల్కె విహ్వాల యయి భయము గదుర 1824

ఆమె యట్లు పొమ్మటంచు పల్మారులు
నన్ను పుచ్చ బూనుకొన్న గాని
పలికి యున్నవాడ బదులు మైథిలికి త్వ
త్ప్రత్య యాన్వితమ్ము వాక్య మిట్లు: 1825

'నాకు కానరాడు గాక రాక్షసు డెవ్వ
డతని కదలు గొల్పునట్టి వాడు
ఉండు నెమ్మది మెయి నులి వతనిది కాదు
వే రెవండొ యిట్లు వెలిచినాడు 1826

నింద్య మైనదియును నీచమ్ము నైనది
పల్కు నార్యు డెట్లు పల్కువాడు
'కావు' మన్న పల్కు నీ వెంచుమా సీత!
యమర వరుల గాచు నట్టివాడు 1827

ఎవడొ రాక్షసు డిటు లేటికో మా యన్న
యెలుగు నలవరించి పలుకువాడు
'కావు కావు' మంచు కల్యాణి! పల్కులు
పల్కిన వివి వేరు స్వరము తోడ
'నన్ను గావు లక్ష్మణా!' యని చింతింప
వలదు నీవును పెర వనితలట్లు 1828

స్వాస్థ్య మూని యుండు చాలును వైక్లబ్య
ముత్సుకత్వ ముడిగి యుండు మీవు
మూడు లోకములను లేడు సూ పురుషు డిం
కెవడు రాఘవేశు నెదిరి పోరి
పుట్టి నతడు గాని పుట్టు నాతడు గాని
యోడ గొట్టు వాడు యుద్ధభూమి 18

అలవి కాదు గెలువ నని రాఘవుని నిర్జ
రులకు వృత్రరిపు పురోగములకు'
పల్కు నిట్టు విన్న వైదేహియును పరి
మోహితాత్మ యైన ముగుద యామె
పల్కె నిట్టులంచు బాష్పముల్ విడుచుచు
నన్ను గూర్చి దారుణంపు బల్కు: 18

'మిక్కుటమ్ము గాగ నెక్కొని యున్నది
పాప బుద్ధి నీకు నా పయిననె
అన్న నాశమైన నన్ను పొందుటకునై
నీవు నన్ను పొందలేవు సుమ్ము! 1

గురు తెరుంగ జెప్పి భరతుండు పంపగా
నీవు రాము ననుసరించుచుంటి
పట్టు బెట్టిదముగ నాక్రోశనము సేయు
నతని చేర నరుగ వందువలన 1

పరమ శత్రు వీవు ప్రచ్ఛన్న చారివి
యనుగమించు చుంటి నను గురించి
రఘు కులేశు నంతరము నొందగా గోరి
యందువలన చేర నరుగ వీవు' 1

పల్కు నిట్టు లంచు వైదేహి కళవళ
పాటు నొంది యెఱ్ఱవార కన్ను
లలుక గదుర పెదవి యదురుచు నుండ నా
శ్రమము నుండి వెడలి చనిన వాడ" 1

### * రాముడు లక్ష్మణుని మందలించుట *

ఇట్టు లంచును వచియించు సౌమిత్రితో
పల్కె రాఘవుండు పరమ శోక
తప్తు డిట్లు: "దుష్కృత మ్మొనర్చితి సౌమ్య!
విడచి పుచ్చి యామె వెడలి వచ్చి 1835

చాలువాడ రక్షసాళి మరల్పగా
నే నటంచు నెరిగి యైన గాని
యలుక గొన్న మైథిలాత్మజ యీ పల్కు
వలన నీవు వెడలి వచ్చినావు 1836

పడయ నీ యెడలను పరితుష్టి మైథిలి
విడచిపుచ్చి యిట్లు వెడలియుంట
నాలకించి పరుషమౌ పల్కు కనలిన
వనిత పల్కు నిటకు వచ్చి తీవు 1837

అన్ని విధముల నిది యపనీతి నీయది
రెచ్చగొట్ట సీత రెచ్చిపోయి
యగ్గలంపు టలుక కగ్గమైనాడవు
సలుపవైతి నాదు శాసనమ్ము 1838

హరిణ రూప మూని యాశ్రమమున నుండి
నన్ను తొలగ దెచ్చి యున్నవాడు
దానవుం డితండు ధరణి బండినవాడు
నాదు నమ్ము నేటు నాటుకొనగ 1839

చాప మెక్కిడి సంధించి సాయకమ్ము
నాట యమ్మున నేనేయ నాటుకొనగ
మృగ తనువు వీడి విక్లబాశ్రిత రవమున
నాయె కేయూర ధారియౌ నసురు డతడు 1840

ఆర్త రవమున నపుడు శరాహతుండు
నా స్వర మ్మ్మని దౌల వినంగ వచ్చు
నట్లు పల్కిన దారుణమైన పల్కు
విని యడియు వచ్చితివి సీత విడచి నీవు" 1841

## (60 వ సర్గ)

### * రాముని దుఃఖాలాపములు *

తిరిగి యాశ్రమమున కరుగుదెంచుచు నున్న
యతని యెడమ కంటి యడుగు రెప్ప
యదరె మిగుల రాము పదములు తొట్రిలె
నొడల కంపనమ్ము నుద్భవించె 1842

అశుభ సూచకమ్ములౌ నిమిత్తమ్ముల
నతడు సారె సారె కరసి చూచి
సేమ మెసగు నొక్కొ సీతకు నిక నని
పలుకు లుచ్చరించివైచె పైకి 1843

తరలి చనియె నంత త్వర మీరగా జన
కాత్మజాత దర్శనాభిలాష
శూన్య గృహము గాంచి సోద్విగ్నమతి యయ్యె
నెగిరి త్వరిత గతుల నేగునట్లు
తిరుగు లాడుచు రఘువరు డట నట పర్ణ
శాలలోన వెదకి సర్వ దిశల 1844

పర్ణశాల గాంచె వైదేహి లేకుండ
నున్న దాని రఘుకులోద్వహుండు
సిరిని గోలుపోయి నురుమైన హేమంత
కాల పద్మిని వలె గ్రాలుదాని 1845

వృక్ష సహిత మేద్చు రీతి దానిని మ్లాన
సుమ మృగ ఖగ యుక్తి సోలు దాని
సిరిని గోలుపోయి నురుమాట వన దేవ
తాళి విడిచివైచి నట్టిదాని 1846

చెల్ల చెద రయిన యజిన కుశములతోడ
తల్లడిలిన బ్రుసి యుతమ్ము నైన
స్వీయ గృహము శూన్యమై యున్న యది గాంచి
మాటి కేడ్చుచుండె మరల మరల 1847

ఎత్తుక చనినారొ మిత్తి పా లాయెనో
నాశ మాయెనొ యశనమ్మె యాయె
నొక్కొ నక్కి యుండెనో కాక భీరువు
కాక పట్టె నేమొ కాననమ్ము 1848

పూలు కోసికొనగ పోయినదో కాక
పండుల కయి పోయి యుండవచ్చు
కాక తమ్మికొలని కైన పోయిన దేమొ
ఏటి కేగె నేమొ నీటి కైన 1849

విసువక పని పూని వెదకుచున్నను గాని
పడయ డయ్యె ప్రియను వనములోన
శోక మలముకొనుట శోక రక్తాక్షుడై
కానవచ్చె పిచ్చివాని వోలె 1850

పరువు వెట్టుచుండి తరువు తరువున కా
తండు గిరి గిరికిని తటిని తటిని
కేడ్చుచుండి రాము డెసగెను శోక పం
కార్ణ వాప్లుతు డయినట్లు గాగ 1851

"కడిమి పూవు లన్న కడు నాసపడు చెలి
యామె యెవతె యైన నగుపడెనొకొ?
కడిమి! ముద్దు నెమ్మొగ మ్మొప్ప దానిని
శీఘ్ర మెరుగుదేని చెప్పు గదవె? 1852

మిగుల మెత్తనైన చిగురు బోలెడు దాని
పసపు పట్టుచీర నెసగు దాని
బిల్వ! తెలుప గదవె బిల్వోపమ స్తని
నీవు కాంచియుంటి వేమొ యిచట? 1853

అర్జునా! వచింప నౌను నీవైన నా
యర్జున ప్రియ ప్రియురాలి గూర్చి
జనక ధరణినాథ తనయ యా భీరువు
బ్రదికి యున్నదాక్కొ? బ్రదికి లేదా? 1854

కకుభ మియ్యదియును కకుభోరు మైథిలి
నామె చక్క నెరుగు నంచు దోచు
నీ వనస్పతి యిది యిగుళుల విరుల పె
ల్లుల్లసిల్లి వెల్గుచుంట వలన 1855

తుమ్మెదల్ ముసరుక ఝుమ్మని మ్రోయుచు
నుంటవలన నిది తరూత్తమమ్ము
తిలక మిదియు నామె తిలక ప్రియను చక్క
నెరిగియుండు నంచు నెంతు నేను 1856

శోక సమపనుద! యశోక! శోకోపహ
తాత్మకుండ నైనయట్టి నన్ను
త్వరిత గతి నొనర్చు త్వన్నాము ప్రేయసీ
దర్శనమ్ము సేయ దారి జూపి 1857

తాళ! నీకు పక్వ తాళ ఫల స్తని
యియ్యెడలను కానుపించె నాక్కొ?
నీకు కరుణ గలిగె నేని నాయెడ వరా
రోహ సీత తెర గెరుంగ జెప్పు 1858

నీవు సీత గాంచినావె నేరేడ! నే
రేడు పండు తోడ నీడు వచ్చు
ప్రియ నెరింగి యుంటివే నీవు చెప్పవే
మదిని సందియంబువదలి నాకు 1859

ఆహ కర్ణికార! యతి శోభమై నుంటి
నేడు మేలిపూల తోడ నీవు
కాంచినావె కర్ణికార ప్రియను సాధ్వి
చెలియ నిచట నీవు చెప్ప నాకు" 1860

ఆమ్ర నీపముల మహా సాలముల పన
సముల కురవముల ధవముల దాడి
మముల నసనములను మహిత యశుడు రాము
డడిగె వాని జేర నరిగి చూచి 1861

మల్లె జొంపములను మాధవీ లతల సం
పగుల మొగలి పొదల వరుస నట్టు
లడుగుచున్ వని దిరుగాడెడు రాముండు
కానవచ్చె పిచ్చివాని వోలె 1862

"మృగమ! యొక వేళ మృగశాబ నేత్ర మై
థిలిని సీత నెరుగు దేమొ నీవు
మృగ విలోల నేత్ర మెలత మృగీ సమూ
హమ్ము గూడి యుండ నగును సుమ్ము! 1863

కరి వరేణ్య! యామె కరికరోరువు నీకు
నొకట కానుపించి యుండవచ్చు
నామె నెరిగియుంటి వని యే దలంతును
తెలియబల్కు మీవు ద్విరద వర్య! 1864

ఒక్కవేళ కాంచి యుంటివే శార్దూల!
శీతకిరణ ముఖిని చెలియ నామె
మైథిలేశ పుత్రి మరి నాకు నమ్మిక
బల్కు మీవు లేదు భయము నీకు 1865

ఏల నురుకు చుంటివే ప్రియా! దౌలకు
కానుపించినావె కమల నయన!
మొరగియుండి నీవు తరువు మరుంగున
బదులు నాకు పలుకవైతి వేల? 1866

ఆగు మాగుమా వరారోహ! నీకు నా
యెడల కరుణ లే దొకింత యైన
నంతగ పరిహాస మాడు దానవు కావు
ఏటి కిట్లు నన్నుపేక్ష సేయ? 1867

పసపు పట్టుచీర వలన నో వరవర్ణి
నీ! యెరుంగ వచ్చి తీవు గురుతు
పరువు వెట్టు దాన వైన నే గంటినే
నిలుము నీకు చెలిమి గలద యేని 1868

ఆమె కాదు నిక్క మది చారుహాసిని
యామె హింస కగ్గమయ్యె నేమొ
యురక వెరవు మాలి యుండరా నంతటి
సంకటమ్ము నాకు సంభవించె 1869

స్పష్ట మామె బాల భక్షించినారు మాం
సాశను లగువార లసుర జనులు
ఒడలి కీలు లెల్ల విడగొట్టి పంచుక
నన్ను నెడసి యున్న నాదు చెలిని 1870

ఆ శుభోష్ఠ దంతమై సునాస మై్మన
చారు కుండల యుగ సహిత ముఖము
నిష్ప్రభత్వ మొందె నిక్కమ్ము గ్రహణమ్ము
నొందియున్న నిండు చందురు వలె 1871

శుభ తరమ్మును గ్రైవేయ శోభితమ్ము
హేమ పుష్పక వర్ణమ్ము కోమలమ్ము
కంబు నిభ విలప దబలా కంధరమ్ము
భక్షణ మొనర్చి యుండెడు వారు నేడు 1872

కంక ణాంగ దాభికలితమ్ము లైనవి
వడకు వ్రేళ్ళ తోడ మిడిసి పడెడు
బాహువు లవి రెండు పల్లవ మృదులముల్
మెక్కి యుండు వారు నిక్కువముగ 1873

పాసియుండ నయ్యె బాల నన్నట్టులు
భక్షణమ్ము సేయ రాక్షసాళి
అశన మయ్యె నామె యా బహు బాంధవ
చనప విడిచి చన్న చాన వోలె 1874

హా! మహాబాహు! లక్ష్మణా! యామెను ప్రియు
రాలి గంటివె యెచ్చట నైన నీవు
హా! ప్రియా! యెచ్చటికి నేగినావు నీవు?
భద్ర! హా! సీత! యంచును పాట పాట" 1875

ఇట్టు లంచును విలపించుచు రాముండు
నురుకుచుండి యడవి నుండి యడవి
కొక్క యెడల వేగ నుద్భ్రాంతు డగుచుండె
నొకట విభ్రమించుచుండె బల్మి
నొకట మెలగుచుండె నున్మత్తు నట్లుగా
తరుణి వెదకులాడ దగిలి నతడు 1876

వనులు నదులు గిరులు పర్వత ప్రస్రవ
ణములు సాంద్ర కాననమ్ము లెల్ల
కలయ దిరుగుచుండె నిలుకడ లేకుండ
కడు రయమ్ము మీరగా నతండు 1877

అట్టు లత డేగి విపుల మహద్వన మ్మ
దెల్ల కలయంగ దిరిగి వైదేహి కొరకు
నాస లేకున్న ప్రియురాలి నరయుట కయి
వాడు మిక్కుటముగ పాటు పడుచు నుండె 1878

## (61 వ సర్గ)

### * రామ లక్ష్మణులు సీతను వెదకుట *

అరసి శూన్యమైన యాశ్రమ వాటియు
వట్టిపోయి యున్న పర్ణశాల
నాశమైన యాసనమ్ముల రాముండు
దశర థావనీశ తనయు డపుడు 1879

అరసి కానలేక నచ్చట వైదేహి
చక్క నెమకి యెల్ల చక్క నంత
నిట్టు లనియె రాము డెల్గు చెలంగగా
పూని పట్టి రుచిర భుజయుగమ్ము: 1880

"ఏ దికేడ నయ్య వైదేహి? లక్ష్మణా!
యేగె నాక్కొ యింక నెచటి కైన
నెవ్వరైన నపహరించిరే సౌమిత్రి!
యెవ్వరైన మెసవి రేమొ ప్రియను? 1881

నక్క చెట్టు వెనుక నాతోడ పరిహాస
మాడ సీత! నీకు నాస యేని
నేడు చాలు నింక నీ పరిహాసమ్ము
నన్ను జేరు వసరుచున్నవాని 1882

నీవు జనక తనయ! నిత్యమ్ము క్రీడించు
చనవు గల్గు హరిణ శాబకమ్ము
లివియె సౌమ్య! త్వ ద్విహీనమ్ము లస్రావి
లేక్షణమ్ములై స్మరించుచుండె 1883

సీత లేక నేను జీవింప లక్ష్మణా!
జానకీ హరణజమౌ నహీన
శోకమున మృతు నను జూచును నిక్కమ్ము
నాదు తండ్రి రేడు నాకమందు 1884

ఎట్లు వచ్చియుంటి విటకు నా చెంతకు
గడపి పుచ్చుకుండ కాల మదియు
ప్రతిన బూనియున్న వాడనై నేను నిన్
గడప బనిచియున్న కాల మీవు? 1885

ఇచ్చ వచ్చినట్లు లెల్ల ప్రవర్తించు
నన్నృతవాది నే ననార్యుడ నని
నన్ను ధిక్కరించి నా తండ్రి పరలోక
మందు కలయ తూలనాడువాడు 1886

పరవశాత్ము దీను భగ్న మనోరథు
ఘోర శోక తప్తి కుములు నన్ను
విడచి పుచ్చి యిచట కడు జాలి బడునట్టు
లన్నృజు డైన నరుని యశము వోలె 1887

ఎచటి కేగు దానవే వరారోహా! నన్
విడువ బోకె సొగసు నడుముదాన!
నీవు లేక యున్న నేనును నా ప్రాణ
ములను గూడ విడచి పుచ్చువాడ" 1888

ఇట్టు లంచును విలపించుచు రాముండు
సీత గాంచ లాలసించు వాడు
కాంచ లేక పోయె కాకుత్థ్సు డా సుదుః
ఖార్తు డాతడు జనకాత్మజాత 1889

వాని జనక తనయ బడయంగ లేకున్న
వాని దశరథ నృప సూను విపుల
పంక లగ్న మగుట వలన కొట్టాడెడు
మత్త కుంజరమ్ము మాడ్కి దివాని
రాము గని కడు హితకామన యొప్పార
నిట్లు లక్ష్మణుడు వచించె నపుడు: 1890

"వలదు సంతపింప వలదు మహాబాహూ!
నన్ను గూడుక జతన మ్మొనర్పు
పెక్కు గుహలతోడ విలసిల్లు చున్నది
ఘోర కానన మిది శూరవర్య! 1891

వని జరింప మక్కువ గలామె యా వనో
న్మత్త చిత్త యైన మైథిల సుత
చొచ్చియుండ వచ్చు నిచ్చోట వని నైన
నలరు లొప్పు తమ్మి కొలన నైన 1892

మీన వంజుళ సేవిత మైన దాని
తటిని జేరంగ జని యుండు తానమాడ
గోరి దాగికొనగ నోపు చేరి యిచట
నడవి నెటనైన నా పరిహాస కామ 393

వెరపు గొల్ప గోరి మొరగి యుండగ నోపు
నడవిలోన నెచట నైన గాని
యెరుగ గోరినామె పురుషర్షభా! నిన్ను
నన్ను నా విదేహ నాథ తనయ
యత్న మాచరింత మామె నన్వేషింప
శీఘ్రముగనె మనము శ్రీ మహితుడ! 1894

వన మిదెల్ల వెదకు వారము గాక యె
య్యెడల జనక తనయ బడయ నగునా
కావలయున యేని కాకుత్స్థ! శోకమ్ము
పొంత నీ మనమ్ము బోవ నీకు" 1895

సౌహృదమ్ము మీర సౌమిత్రి యప్పు డి
ట్లంచు పల్క విని సమాహితు డయి
రాఘ వాత్మజుండు లక్ష్మణుతో గూడి
వెదక మొదలు పెట్టె విపిన మెల్ల 1896

దశర థావనీశు తనయు లిర్వురు వారు
కాననము లహార్య గణము లెల్ల
ఏఱ్ఱు పెన్ కొలకులు నెల్ల విదేహ రా
జాత్మజాత వెదకు లాడువారు 1897

ఆ నగోత్తమమ్ము సానువు లన్నియు
కందరమ్ములున్ శిఖర చయమ్ము
విడువ కెల్ల యెడల వెదకాడు వార లా
యమను పడయ రెచట నైన గాని 1898

పర్వతమ్ము నెల్ల పట్టుల వెదకాడి
రాము డిట్టు లనియె లక్ష్మణునకు:
"పర్వతమున నిట శుభాకార వైదేహి
నాకు లక్ష్మణ! కనరాక పోయె" 1899

అంత పల్కు లిట్టులంచు దుఃఖాభిసం
తప్తుడౌ సుమిత్ర తనయు డాడె
కలయ దిరిగి దండకారణ్య మది యెల్ల
నన్న దీప్తతేజు నతని గాంచి 1900

"పడయువాడ వీవు వైదేహి జనక రా
జాత్మజాత ప్రాజ్ఞ సత్తమ! యిక
బలిని మహిత భుజుడు వైకుంఠు దరికట్టి
పుడమి దీని మరల బడసినట్లు" 1901

చెలిమి యుట్టిపడగ చెప్పంగ నిట్లని
లక్ష్మణుండు విన్న రాఘవుండు
తోడ నిట్టు లంచు దుఃఖాభిహత చేత
నుండు దీనమైన నుడుల బల్కె: 1902

"వెదకినార మయ్య విపిన మియ్యది యెల్ల
విరిసి యున్న తమ్మి విరుల కొలకు
లద్రి యియ్యదియు మహాప్రాజ్ఞ! బహు కంద
రాపగా సమేత మైన యదియు
ప్రాణములకు మిన్న యైన వైదేహిని
గాంచకున్న వాడ గాదె నేను" 1903

ఇట్టు లంచును విలపించి రాముండు సీ
తాపహరణ కర్శితాంగు డార్తి
బ్రుంగి శోకమున మునింగి యొక్క ముహూర్త
మపుడు విహ్వలత్వ మంది యుండె 1904

కడు తపించి యుంట బడలిన మేనితో
నుడిగి పోవ బుద్ధి యొడల తెలివి
కూల బడియె జాలి గొల్పు నాతురు డయి
నిడుద వేడి యూర్పు నిగుడ జేసి 1905

వాడు మిక్కుటముగ బరపి నిట్టూర్పులు
రాము డంబుజాత రమ్య దృశుడు
బాష్ప గద్గదుండు పలుమారు లెల్గెత్తి
యార్చుచుండె 'హా! ప్రియా!' యటంచు 1906

అంతట ప్రియ బంధువౌ వాడు సౌమిత్రి
ధర్మవేత్త దశరథాగ్ర తనయు
నూరడించె పెక్కు తీరుల తెన్నుల
ప్రశ్రితాంజలి యయి ప్రశ్రితముగ 1907

నుడువు లవియు లక్ష్మణోష్ఠ పుట చ్యుత
మైనవాని నత డనాదరించి
ప్రియను సీత నామె వీక్షింప లేకుంట
నతడు మాటి మాటి కార్చుచుండె 1908

## (62 వ సర్గ)

### * రాముని దుఃఖాలాపములు *

కాంచలేమి సీత కామోపహత చిత్తు
డప్పుడు విలపించె నలమటమున
నలఘు బాహు యుగళు డతడు ధర్మాత్ముడు
రాము డంబుజాత రమ్య దృశుడు 1909

కానరాక యున్నగాని సీతను మద
నార్దితుండు కాంచినట్లు దోప
రాఘవుం డటులు విలాపాశ్రయము దుర్వ
చమ్మునై యెసగు వచనము పల్కె: 1910

"విరుల వలచు దాన వీవోట నో ప్రియా!
నీ వశోక శాఖ లావరింప
దాచియుంచుచున్న దానవు నీ మేను
నాకు పెంపు సేయ శోక మిట్లు 1911

కదళికా వనీజ కాండ సన్నిభములు
సరస కదళి కాభిసంవృతములు
నీదు తొడలు రెండు నే గాంచితిన్ దేవి!
దాచుకొనగ లేని దాన వైతి 1912

భద్ర! కర్ణికార వన మాశ్రయించితి
వీవు దేవి! పరిహసింప బూని
నన్ను బాధపెట్టుచున్న నీ పరిహాస
మింక చాలు చాలు నింతవట్టు 1913

బడలి యున్న నాకు పరిహాసముల జోలి
యేలనే ప్రియా! యిదేల సీత!
అట్టిది పరిహాస మైన నియ్యదియును
చవి గొలుపదు నాకు చక్క దేవి! 1914

అంత మెప్పు వడయ దాశ్రమ స్థానమ్ము
నందు నిట్టి యెడల హాస్య మిదియు
నరసి యెరుగును పరిహాస ప్రియమ్ము నీ
శీల మంచును ప్రియురాల! నేను
అరుగుదెమ్ము నీవు ఆయత లోచనా!
నెగడు శూన్యమగుచు నీ కుటి యిది 1915

చక్క స్పష్ట మిదియు రక్కసుల్ సీత భ
క్షించినారొ అపహరించినారొ
ఏడ్చుచున్నవాని నేమైన లక్ష్మణా!
ఇట్లుపేక్ష సేయదేగద నను 1916

సాశ్రు లోచనమ్ములై సుమిత్రాత్మజా!
హరిణ యూథము లివి యన్ని యిపుడు
మెక్కి వైచినారు రక్కసుల్ వైదేహి
నంచు చెప్పుచున్న యట్లు తోచు 1917

హా! మదార్య! యెచటి కరిగిన దానవే?
అయ్యో! సాధ్వి! వన్నెలాడి! నీవు
హా! సకామ యగుట యలవడు! నీవల్ల
నామె దేవి కేకయాత్మజాత 1918

నేను సీత గూడి నిర్గమించిన వాడ
సీత లేకయుండ చేర వచ్చి
శూన్యమైన దాని శుద్ధాంతమున్ బ్రవే
శించు టెట్టు లొక్కొ యేను మరల? 1919

ఎన్ను లోక మెల్ల నన్ను నిర్వీర్యుడ
నంచు నిర్దయుండ నంచు గూడ
పిరికితనము నాది వెల్లడి యయ్యె గా
జనక తనయ తొలగ గొనుట కతన 1920

గడపి పుచ్చినాడ కాననావాసమ్ము
నన్ను కుశల మడుగుచున్న వాని
మైథిలేశు జనక మానవ నాథుని
నేను తేరి చూడ నేర్తు నెట్లు? 1921

ఆమె లేకయుండ నరిగిన నను గాంచి
యా విదేహ మానవాధిపుండు
కూతు నెడల చెలిమి గుములుచు నిక్కమ్ము
మోహమునకు లోగిపోవు వాడు 1922

అట్లు కాకయున్న నరుగనే యరుగను
భరత పాలిత మగు పురికి నేను
స్వర్గమైన గాని వైదేహి లేకున్న
శూన్య మనియె తోచుచుండు నాకు 1923

నన్ను నిచట కాననమ్మున విడనాడి
యరుగుము శుభమైన పురి కయోధ్య
కేను నామె లేదయేని వైదేహి జీ
వించి యుండను గద యెట్టులైన 1924

గాటముగను భరతు గౌగిట గదియించి
పల్కదగును నాదు పల్కు గాగ
పాలన మ్మొనర్పు వసుధ యంచును రాము
డనుమ తిచ్చె నీ కటంచు నీవు 1925

అమ్మ నాకు కేకయాత్మజయును సుమి
త్రయును కోసలేంద్ర తనయయు విభు!
అర్హమైన రీతి నభివాదనీయలు
నే నొసంగు నాజ్ఞ నీకు నైన
ప్రోవ దగిన యామె పూనిక మెయి నామె
చెప్పినట్టు లెల్ల చేయు నీవు 1926

సీత యీ కరణి నశించుట యీ నా వి
నాశ మిది యమిత్ర నాశ కారి!
విస్తరమ్ము గాగ వినివేదనము సేయ
జనును నీవు నాదు జనని కింక" 1927

ఇట్లు కడు దీనుడై రాము డేడ్చు చుండ
నా సుకేశి లేని వనిలో నరిగి చేరి
త్రాస వికల ముఖుడు సుమిత్రాత్మజుండు
నాతురుం డయ్యె కడు వ్యథితాత్ము డగుచు 1928

ఆ నృపాల సుతుండు ప్రియా విహీను
డౌట కామ శోకముల పీడకు గురి యయి
తమ్ము నార్తరూపుడు విషాదమున ముంచి
తద్దయును తీవ్రమౌ విషాదమున మున్గె 1929

అతడు లక్ష్మణు శోక వశాభిపన్ను
గాంచి రాముండు విపుల శోకమున మున్గి
యూర్చి వెచ్చన నేడ్చుచు నుమ్మలమున
పల్కె వ్యసనానురూపమౌ పల్కు లిట్లు: 1930

"పుడమి నింకొక్కరుడు నన్ను బోలు వాడు
లేడు దుష్కృత కర్మకారి యని తలతు
వనట వెంబడి వనటయు వరుస మీర
మనము హృదయమ్ము నగలించి పెనచు నన్ను 1931

తొల్లి నే నిచ్చవచ్చిన దుష్కృతములు
నిక్క మెడతెగకుండగా నెరపి యుంటి
వాని ఫల మిది నే డిట్లు వచ్చిపడియె
వనట వెంబడి వనట నే బడితి దాన 1932

రాజ్య నాశమ్ము స్వజన విరహిత వసతి
పితృ వినాశమ్ము జననీ విగతియు నిట్లు
నా కివెల్లను లక్ష్మణా! శోక వేగ
మినుమడింప జేయు తలంచుకొనిన కొలది 1933

లక్ష్మణా! దుఃఖ మదియు నెల్లయును నాది
యొడల నణగెను శూన్యమౌ నడవి జేర
చెలగె సీతా వియోగమ్ము వలన మరల
కట్టియల నగ్నివే చెలగారు నట్లు 1934

నిక్కముగ నామె నా యార్య రక్కసుండు
బల్మి మింటికి గొంపోవ భయము నొంది
పే రెలుంగున నేడ్చుచు మారెలుగున
వెరపు దొరకొన కడు దురపిల్లి యుండు 1935

కన్నులకు నించు నెర్రని వన్నె మేలి
చందనపు బూత కెప్పుడు చాలినట్టి
నాదు ప్రియురాలి వృత్త స్తన ద్వయమ్ము
రక్త పంక మంటగ నలరారదు గద! 1936

శ్లక్ష్ణ సువ్యక్త మృదుల ప్రలాప మాయె
వదన మదియు కుంచిత కేశ భార యుతము
రక్కసుల పాల బడినంత నిక్కము వెలు
గుడుగు గద! రాహు ముఖమున నుడుపతి వలె 1937

సువ్రతయు నాకు ప్రియ యైన సుందరి మెడ
సంతతము హార మాలికా సముచితమ్ము
చీల్చి నిక్కము నిర్జన సీమ రుధిర
పానము నిశాచర జనమ్ము లానువారు 1938

నన్నెడసినది విజన వనమ్ము లోన
రాక్షసుల్ తన్ను గొంపోయి లాగుచుండ
వెడ యెలుగు నిక్క మార్తయై వెలిచి యుండు
క్రౌంచి వలె నామె యాయత కాంతనేత్ర 1939

మున్నిచటి శిలా తలమున నన్ను గూడి
చేరి కూర్చుండి యుదార శీల సీత
కాంత మంద హసిత నిన్ను గాంచి జాత
హాసయై లక్ష్మణా! పల్కు లాడె పెక్కు 1940

ఈ నదీ శ్రేష్ఠ గోదావరీ నది కడు
ప్రియము గూరుచు నెపుడు నా ప్రియతమ కట
కరిగి యుండంగ వచ్చునో యని తలంతు
నేగ దొంటరిగా నామె యెపుడు గాని 1941

పద్మముఖి యామె యాయత పద్మనయన
పద్మముల నిట గొంచురా బయలు వెడలె
నదియు సరికాదు గద యెప్పుడైన నామె
బయలు దేరదు నే లేక పద్మములకు 1942

వివిధ విహగ నిచయ సముపేత మగుచు
పుష్పిత ద్రుమ షండమై పొలుచు వనికి
నొకట చనియుండునో యదియు సరికాదు
వెరచు మిక్కిలి యెక్కటి భీరు వామె 1943

అర్క! లోక కృతాకృతజ్ఞా! జగముల
సత్య మిథ్యా వచన కర్మ సాక్షి! నాదు
ప్రియ యెటకు జనియె నపహరించినారొ
ఆమె నెరిగింపు నిత్యమ్ము నడలు నాకు 1944

నిఖిల జగముల నిత్యమ్ము నీ వెరుంగ
కున్న దేదియు నించుక యుండకుండు
వాయువూ! చెప్పుమా! కులవతి హరించి
నారొ కూలెనొ ఉన్నదో దారివెంట" 1945

ఇట్టు లని యీ కరణి విలపించువాని
తెలివి దప్పిన శోక విధేయ దేహు
రాము గని ధైర్యముగ సుమిత్రాత్మజుండు
న్యాయ సంస్థితు డదనున కనువు మీరు
పల్కు లిట్లని యతనితో పల్కె నపుడు: 1946

"విడుము శోకమ్ము దైన్యమ్ము పడయు మార్య!
యామె వెదుకంగ నుత్సాహ మలవడుతను
జగతి నుత్సాహ వంతులౌ జనులె గాదె
కడచెదరు కడు దుష్కర కర్మ లెడల" 1947

అను నుదగ్ర పౌరుష సుమిత్రాత్మజాతు
నార్తుడౌ వాడు వర రాఘవాన్వయుండు
సరకు గొనకుండె ధృతి పీడబరచి నతడు
పడసె మహనీయ దుఃఖమ్ము వాడు మరల 1948

## (64 వ సర్గ)

వాడు దీనుడైన వాడు సౌమిత్రితో
పల్కె దీనమైన పల్కు లిట్లు:
"పోయె నేమొ తమ్మి పూవులు తేర గో
దావరికిని సీత తా నొకతియె
యెరిగి రమ్ము వేగ మేగి గోదావరీ
నదికి నీవు లక్ష్మణా!" యటంచు 1949

రాఘవుండు నిట్టు లని పల్క విని పర
వీరహననుడు లఘు విక్రముండు
లక్ష్మణుండు చనియె రమ్యమౌ గోదావ
రీ నదీ తటమున రేవులకును 1950

రేవులున్న యేటిలో వెదకాడి యి
ట్లనియె రాముతోడ లక్ష్మణుండు:
"లేదు కానపడదు రేవులలో నామె
వినదు బిగ్గ నేను పిలుచుచున్న 1951

*** రామ లక్ష్మణులు సీతను వెదకుట ***

చొచ్చియున్నదో గద యెచ్చోట నాయమ
క్లేశ నాశిని మిథిలేశ పుత్రి
అరసి యెరుగనేర నైతి నే నచ్చోటు
జనక రాజపుత్రి చన్న చోటు" 1952

లక్ష్మణు వచనమ్ము లాలించి దీనుండు
దుఃఖ తాప మోహితుండు రాఘ
వాన్వయుండు చేర నరిగె గోదావరీ
తటిని తీరమునకు తాను గూడ
చేర నరిగి దాని 'సీత యేది?' యటంచు
రాముడున్ వచించె నామెతోడ 1953

దానవేశ్వరుడు యథార్థ డామెను హరి
యించె నంచును వచియింపకుండె
ప్రాణి కోటి యెల్ల రాముని కష్టె గో
దావరీ నది యది తాను నుండె 1954

అంతట పురికొల్పు ప్రాణు లామెను ప్రియు
రాలి వలను దెల్పు మతని కంచు
నామె సీత గూర్చి యననెలే దేమియు
నలమటించు రాము డడుగుచున్న 1955

భావమున దలంచి రావణు నా రూపు
నా దురాత్ము నెరపు నట్టి పనులు
భయము గ్రమ్మ కొనగ వైదేహి గూర్చి మా
టాడనైన లేద ఆ నదియును 1956

ఆ తటిని వలనను సీత దర్శనమున
నాశ లుడిగిపోయి నట్టివాడు
సీత దర్శనమునకై తపించెడి రాము
డనియె నిట్లు లక్ష్మణునకు నపుడు: 1957

"బదులు పలుకకున్న దిదియు గోదావరి
యేమి యైన సౌమ్య! యించుకంత
పల్కకేమి పల్కువాడను లక్ష్మణా!
దరియ నరిగి జనక ధరణి నాథు
నైన సీత తల్లి నైనను గాని నే
నామె లేకయుండ నప్రియమ్ము 1958

అవని రాజ్యహీను డైన వానికి నాకు
వనిని వన్యములను బ్రదుకు వాని
కెల్ల యుమ్మలికము నెడపి పుచ్చగ జాలు
నామె సీత యెచటి కరిగె నొక్కొ? 1959

ఇట్లు జ్ఞాతి పక్ష హీనుడౌ వానికి
రాజపుత్రి కానరాక యున్న
నిదుర రాని నాకు నిడుపులై రాత్రులు
బరగునంచు తలచువాడ నింక 1960

తటిని మందాకినిన్ జనస్థానము నిట
ప్రస్రవణ మన బరగు నీ పర్వతమ్ము
ననుచరించెదనే వీని నన్నిటి నిక
జానకియె కానవచ్చున యేని నాకు 1961

మాటి మాటికి నను మహిత వీర్యములైన
ఈ మృగమ్ములు వరికించుచున్న
వేదొ నాకు జెప్ప నెంచుచునున్నట్లు
వాలకమ్ము కానవచ్చు నాకు" 1962

వాని గాంచినంత మానవ వ్యాఘ్రు డి
క్ష్వాకు కులుడు బాష్ప వారి రుద్ధ
వీక్షణములతో నిరీక్షించుచున్ 'సీత
యే?' దటంచు ప్రతివచించె నతడు 1963

పార్థివేంద్రు డిట్లు పల్కనాలించిన
యంత వేగ లేచి యా మృగమ్ము
లన్ని గూడి దక్షిణాభిముఖమ్ముగా
వింటి చక్కి కానుపించు చుండి 1964

అపహరించి కొంచు నరుగ నా మైథిలి
చేరుకొన్న దిక్కు దారి బట్టి
పరువువెట్టు చుండి పారజూచుచు నుండె
నా నృపాలు రాఘువాన్వవాయు 1965

నింగి దారి వంక నేల వంకను మృగో
త్కరము తేరిపార గాంచుచుంట
నరుగ వలయు ననెడి నా దారి మృగము ల
టంచు లక్ష్మణుండు నరసి యెరిగి 1966

అవి పలుకుచు నున్న యర్థ మ్మదంతయు
నెఱిగికొనియె వాని యింగితమ్మ
నన్నతోడ ధీ సమన్వితు డా సుమి
త్రాత్మజాతు డార్తి ననియె నిట్లు: 1967

"అడుగ 'సీత యేది?' దటం చీవు నీ మృగ
గణము వేగ లేచి కానుపించు
చున్న విట్లుగాగ నుర్వీ తలమ్మను
దక్షిణంపు దిశను తా మొక మొగి 1968

అందు వలన చక్క నరుగుద మో దేవ!
నైరృతి దిశ దీని చేరుకొనగ
వల నెదైన నాకట పనుపడు నంతట
నగుపడంగ వచ్చు నార్య యామె" 1969

'మంచి దట్టులే' యటంచు కాకుత్థ్సుండు
దక్షిణంపు దిశకు తరలిపోయె
లక్ష్మణానుగతుడు లక్ష్మి సమన్వితు
డరసి చూచుకొనుచు నవని తలము 1970

అన్నదమ్ము లిర్వు రట్లు మాట్లాడుకొం
చొండొరువులతో వసుంధర పయి
దొరగి యున్న పూల తెరువును గాంచిరి
పడిన పూల జల్లు పుడమి గాంచి
యనియె నిట్లు లక్ష్మణునకు రాముడు వీరు
డార్త వచనము కడు నార్తు డగుచు: 1971

"గురు తెఱింగి నాడ కుసుమముల్ లక్ష్మణా!
ఈ సుమమ్ము లవియె యిట పడినవి
నే నొసంగినయవి కాననమున మున్ను
జనక తనయ ముడుచుకొనిన వివియె 1972

భాస్కరుండు మరియు వాయు దేవుండును
తత యశస్విని యగు ధారుణియును
ప్రోచుచున్నవారు పుష్పమ్ములన్ ప్రియ
మాచరింప నాకు నని తలంతు" 1973

పల్కి యిట్లు మహిత బాహునితో సుమి
త్రా తనూజు తోడ ధర్మ చిత్తు
డైన రాముడు పురుషాగ్రణి ప్రస్రవ
ణాకులాద్రి తోడ ననియె నిట్లు: 1974

"భూమిభృద్వరేణ్య! పొడసూపె నాకొ స
ర్వాంగ సుందరి యగు రామ యిచట
నాకు బాసియుండి నీకు నీ కాననో
ద్దేశమందు రమ్య దేశమందు? 1975

అలుక ననియె నద్రి కచ్చట సింహమ్ము
క్షుద్ర మృగమున కను మాద్రి గాగ
"నామె హేమవర్ణ హేమాభ సీతను
నాకు కానుపింపు నగవరేణ్య!
నేను కడగి నీదు సానువు లన్నింటి
కూల నడచి వేయకుండ మున్నె" 1976

అట్టు లనగ రాము డాలించి శైలమ్ము
జనక మానవేశ తనయ గూర్చి
పలికి నట్లు కానవచ్చె నంత విదేహ
సుతను రాఘవునకు జూప లేద 1977

అంత దశరథ నృపు నాత్మజాతుడు రాము
డిట్లు లనియె పర్వతేంద్రునకును:
"నాదు సాయక దహనార్చి నిర్దగ్ధుడై
బూది ప్రోవు వోలె నౌదు వీవు
గడ్డి మ్రాకు చివురు గాని లేకుండనై
ప్రాణులకును కొలువరాక యుండి 1978

ఈ సరిత్తునైన నే సుమిత్రాత్మజా!
నే డిగిర్చి వేయువాడ నింక
చెప్పదేని నాకు సీత గూర్చి శశి ని
భానన యగు నార్యురాలి గూర్చి" 1979

* సీత నపహరించిన జాడలు గాంచుట *

అలుక యిట్లు గొన్న యాతడు రాముండు
కనుల గాల్చుచున్న కరణి నుండి
పుడమిమీద గాంచె పొడసూపి యున్న రా
క్షసుని విపులమైన చరణ ముద్ర 1980

కడు భయమున రామకాంక్షిణియై యిటు
నటును పరువు వెట్టు నసురు డనుస
రించి నట్టి మైథిలేశ తనూజాత
పదము లవియు గాంచె పదపడి యట 1981

దానవుండు జనక తనయయు గడచిన
గురుతు లచట నాత డరసి చూచి
భగ్నమైన ధనువు భగ్న తూణీరముల్
పెక్కు ముక్కలుగ నవిసిన తేరు
గాంచి రాముడు కడు కళవళించి యెడంద
ననుగు దమ్ముతోడ నాడె నిట్లు: 1982

"అరయు మవియె లక్ష్మణా! విదేహాత్మజ
భూషణముల డుల్లిపోయి పడిన
జాతరూప బిందు సంతతి సౌమిత్రి!
నరుల గములు పెక్కు తెరగుల యవి 1983

తప్త బిందు లట్లు తనరారు చిత్రమౌ
క్షతజ బిందు సమితి జాలువారి
యావరించి యుండె నరయుమా సౌమిత్రి!
యవని తలము మీద నన్ని యెడల 1984

లక్ష్మణా! విదేహరా జాత్మజాతను
కామరూపు లసుర గణము గూడి
త్రుంచి త్రుంచి పెట్టి పంచిపెట్టుకొని భ
క్షించి యుండువా రటంచు నెంతు 1985

ఆమెకై విదేహ భూమీశ పుత్రికై
వాదులాడు కొన్న వారి కిర్వు
రసుర జనుల కిచట లక్ష్మణా! ఘోరమౌ
సంగరమ్ము మున్ను జరిగి యుండు 1986

ముత్తియముల మణుల పొలుపారు చున్నదై
తప్త కనక భూషితమ్ము నైన
ఈ మహద్ధను స్సి దెవ్వానిదో సౌమ్య!
ధరణి తలము మీద విరిగి పడియె 1987

బాల భాను సన్నిభమ్మును వైడూర్య
మణి గణాభిఖచితమైన కనక
కవచ మిది యెవనిదొ గాని ధాత్రీస్థలి
కడు విశీర్ణ మగుచు పడియె నిచట 1988

కమ్మ లొక్క నూరు గల్గు ఛత్రము దివ్య
మాల్య శోభమాన మాతని దిది
కామ విరిగి పోవగా చక్క గూల్చినా
రవని తలము మీద నదియె చూడు 1989

ఒప్పు మీరు కాంచనోరశ్ఛదమ్ములు
గల పిశాచ వదన ఖరము లివియు
భీమ రూపములును విపుల కాయమ్ము లె
వ్వనివొ కలన చచ్చి పడియె నేల 1990

దీప్త పావకునకు దీటైనదియు కాంతు
లొలయుచున్న యదియు యుద్ధ కేతు
సహితమైన యదియు సాంగ్రామిక రథమ్మి
దిచట విరిగి యొరిగె నెవని దొక్కొ? 1991

స్యందనాక్ష మాత్రమైనవి విశిఖముల్
తప్త కనక భూషితమ్ము లెల్ల
కడల చెదరి విరిగి పడిన నారాచము
లివియు ఘోరకర్మ డెవని వొక్కొ? 1992

అమ్ము పొదుల జోడు అమ్ముల నిండిన
దదియు లక్ష్మణ! నురుమయ్యె చూడు
చచ్చి పడియె నెవని సారథియో వీడు
తరటు పగ్గములును దాల్చి కేల?? 1993

మస్తకమున పాగ మణి కుండలమ్ములు
దాల్చి చామరములు దాల్చు వారు
సమర రంగమందు సౌమ్యుడా! నిహతులై
పండినారు యెవరి వారొ వీరు? 1994

పురుషు డరిగినట్టి తెరు విది స్పష్ట మె
వ్వనిదొ దానవునిదె యనియె తోచు
జీవితాంతక మగు నా వైర మియ్యది
పంద రెట్లు గాగ బరగు జాడు 1995

కామరూప ధరులు కడు ఘోర హృదయులౌ
రాక్షసాళి సౌమ్య! రమణి సీత
నపహరించినారొ అపమృత్యు వొందెనో
వారు మెసవినారొ పాప మామె
ప్రోవలేదు ధర్మమును మహా వనమున
నెత్తుకొంచు సీత నేగుచుండ 1996

### * రాముని కోపావేశము *

లక్ష్మణా! యిట మిథిలాత్మజ భక్షించి
యున్న నపహరించి యున్న నైన
నాకు నప్రియమ్ము లోకములో సౌమ్య!
నెరపజాలు నంత దొర లెవరొకొ? 1997

అఖిల లోక కర్త యైనను శూరుడే
యైన కరుణ వేదియైన యెడల
సర్వ భూతములును సౌమిత్రి! వానిని
పరిభవించు గాదె యెరుక లేమి 1998

మృదు మనస్కు లోకహిత యుక్తు దాంతుని
కరుణవేది యగుచు బరగు నన్ను
నిక్కమమ్ము గాగ నిర్వీర్యు డంచు నా
కౌకసులు తలంచుచుండు వారు 1999

కూడియుంట నన్ను గుణము దోషముగ సౌ
మిత్రి! పనుపడియె సుమీ కనుగొను
మఖిల భూతములకు నసుర వర్గమునకు
నేడె నాశనమ్ము మూడుట కయి 2000

క్రుంగజేసి రేవెలుంగు వెన్నెలలను
దొడ్డ వేడి వెల్గు తోచినట్లు
క్రుంగజేసి యెల్ల గుణముల నా పరా
క్రమము మేరమీరి కడు వెలుంగు 2001

యక్షులైన గాని రాక్షసులైన గం
ధర్వులున్ పిశాచ తతులు కిన్న
రాళి యైన మానవాళియేన్ లక్ష్మణా!
కుశల మింక బడయ కుండువారు 2002

అరయు మింక లక్ష్మణా! యస్మదీ యాస్త్ర
బాణ పూర్ణమగును బయలు మెదల
రాక యుండునట్లు త్రైలోక్య చారులు
నెరపువాడ నింక నేడు నేను 2003

గ్రహ గణమ్మదెల్ల గట్టు వడంగ క్ష
పాకరుండు మాటువడి యణంగ
నగ్ని వాయువు లణగారి పోవంగ భా
స్కరుని కాంతి యెల్ల మరుగు వడగ
గిరి శిఖర చయమ్ము తిరుగుడు వడిపోవ
నెండిపోవ కొలకు లెల్ల యెడల 2004

ధ్వంస మంద నఖిల తరు లతా గుల్మము
లణగి పోవగ విపులార్ణవమ్ము
నెరపు వాడ నింక నే మూడు లోకముల్
కాలధర్మ మెనయ బోలునట్లు 2005

ఈ ముహూర్తమునన సౌమిత్రి! కుశలమ్ము
మెయి నెసంగుచున్న మెలత సీత
నీయకున్న నాకు నీశ్వరుల్ కాంతురు
మామకీన విక్రమ క్రమమ్ము 2006

అస్మదీయ సాయకాసన గుణ సము
న్ముక్త బాణ జాల పూర్ణ మైన
నభమునందు లక్ష్మణా! సర్వ భూత సం
చయము తిరుగులాడ జాలకుండు 2007

నాడు సాయకముల నలుగుడు వడి మృగ
పక్షి గణము లెల్ల భ్రాంతి జెంద
తలగిపోవ నియతి చలించు వడిన జ
గమ్ము లక్ష్మణా! యిదె కాంచు నేడు 2008

అడ్డగింప రాని యాకర్ణ పూర్ణ వి
శిఖ చయమ్ముతోడ జీవలోక
మే నొనర్చువాడ నిక నపిశాచ మ
రాక్షసమ్ముగ మిథిలాత్మజ కయి 2009

అలుక మీర బరపినవి యతి దూరాతి
గాములైన వేను కార్ముకమున
విడిచినట్టి శాత విశిఖమ్ముల బలమ్ము
నేడు చూచువారు నిర్జరాళి 2010

దైవతములు గాని దైతేయులైన పి
శాచులైన రాక్షసాలి యైన
లేకపోవు వారు నా కోపమున జగ
త్త్రియము రూపుమాసి రాలిపోవ 2011

నాక దైత్య యక్ష లోకమ్ములును రాక్ష
సులు వసించు లోకములును గూడ
బాణ జాలములను పలు తున్కలుగ శక
లీ కృతమ్ము లగుట లేకపోవు 2012

సాయకముల తోడ జగముల వీని మ
ర్యాద మీరి నడచునట్లొనర్తు
నీయకుందు రేని ఈశ్వరుల్ సౌమిత్రి!
హృతను గాని సీత మృతను గాని 2013

అట్టిరూపు దాని నా విదేహాత్మజ
ప్రియ నొసంగకుందు రేనియు సచ
రాచరమ్ము గాగ త్రైలోక్యము జగ మ్మి
వెల్ల రూపుమాపు దేను నింక" 2014

అని వచించి రాము డలుక గెంపారిన
కనుల వాడు కార్ముకమ్ము కేల
నడచి పట్టి యంది యాశీ విషోప మో
ద్దీప్త మైన యట్టి తీవ్ర శరము 2015

సాయ కాసనమున సంధించి శ్రీశాలి
రాఘవుండు పర పురంజయుండు
కనలు గొన్న తడు యుగాంతాగ్ని యట్టులు
పలుకు లిట్టు లటంచు పలికె నపుడు: 2016

"ముదిమి యదియు నెట్లొ యది యెట్లొ మృత్యువు
కాలమెట్టులొ విధి గతియు నెట్లొ
సర్వ భూతము లెడ సౌమిత్రి! నిత్యమ్ము
బరగు తిరుగు లేని పగిది గాగ
నట్లె క్రోధ యుక్తుడైన నే ననివార్యు
డౌదు నెట్టి యెడల నైన గాని 2017

చారుదతి ననిందిత సీత జనక తనయ
వెనుక టట్టులు నాకు చూపింపరేని
యమర గంధర్వ నర పన్నగాన్వితమ్ము
శైల సహితమ్ము తెగజూతు జగము నేను" 2018

## (65 వ సర్గ)

అట్లు తప్యమానుడౌ రాము సీతాప
హరణ కర్శితాంగుడైన వాని
జగము లేక యుండ సలుప బూనిన వాని
ప్రళయ కాల వహ్ని పగిదివాని 2019

సజ్యమైన ధనువు చక్కగ గన్గొను వాని
పాటపాట నూర్పు బరపు వాని
యుగము ముగియు వేళ జగము సర్వమ్మును
కాల్పగోరు హరుని కరణివాని 2020

మునుపు గాంచనంత కనలు గొన్నాతని
రాము నరసి చూచి లక్ష్మణుండు
మోము వాడుబారి పోవగా ప్రాంజలి
యగుచు పల్కు లిట్టు లంచు పల్కె: 1021

*** లక్ష్మణుడు రాము నోదార్చుట ***

"మున్ను దమము గల్గి పూని మృదుత్వము
నిఖిల భూత హితము నెరపుచుండి
యల్క కిప్పు డగ్గమై నైజ గుణమును
తలగ ద్రోయ నీకు తగదు సుమ్ము! 2022

చంద్రునకును లక్ష్మి సవితృనకును ప్రభ
వాయువునకు గతియు వసుధకు క్షమ
ఇవియు నెల్ల యిట్టు లేర్పడి యున్నవి
అట్లె యుత్తమంపు యశము నీకు 2023

ఒకడు తప్పు చేసి యున్నంత లోకముల్
ధ్వంస మాచరింప దగదు నీకు
చదిసి పడిన దెవని సాంగ్రామిక రథమ్మొ
సవరణల్ చెలంగ సాయుధముగ
నేమి కారణమున నెవనిచే బడియెనో
యెరుగరాక యున్న దిదియు నాకు 2024

నేల యియ్యది ఖుర నేమి క్షత మ్మయ్యె
చిందియుండె రుధిర బిందువులును
నడచి యుండె నిచట కడు ఘోరమౌ పోరు
భూతలాధినాథ పుత్ర! చూడు 2025

ఈ విమర్ద మొకనిదే యిర్వురిది కాదు
పలుకు లాడుచుండు వారి మేటి!
కానరాక యుండె కడు దొడ్డ సైన్యమ్మొ
గడచి చనిన యట్టి యడుగు జాడ 2026

ఒకని మూలముననుసకల లోకమ్ముల
ధ్వంస మాచరింప దగదు నీకు
మృదుల మతులు మేదినీశుల్ ప్రశాంతులు
యుక్త దండ సంప్రయోక్తలు గద! 2027

పరమమైన గతియు శరణమ్ము నీవె కా
సర్వ భూతములకు సంతతమ్ము
తలచునొక్కొ నీదు దార ప్రణాశమ్ము
బాగటంచు నిక నెవండు గాని? 2028

సాగరములు నదులు శైలముల్ దేవ గం
ధర్వులైన గాని దైత్యులైన
చాలకుండ్రు నీకు సలుప విప్రియము సా
ధువులు దీక్షితునకు దొడరనట్లు 2029

ఎవడు రాజ! సీత నెత్తుక పోయెనో
వాని నీవు వెదక నౌను గాదె
వెంట రాగ నేను విలు కేల దాలిచి
సంయమీంద్రు లెల్ల సాయపడగ 2030

వెదకు వార మింక విపుల సాగరమును
పర్వతమ్ము లెల్ల వనము లెల్ల
ఘోరమైన వివిధ గుహల నెల్లెడలను
వాహినులును పద్మ వనులు గూడ 2031

కడగి దేవలోక గంధర్వ లోకముల్
నెమకువార మింక నెమ్మది మెయి
పడయకుండు నంతవరకు నీ భార్యాప
హరణ మాచరించి నతని మనము 2032

సామ మార్గమునను సతి నీకు నా త్రిద
శేశ్వరాశి తెచ్చి యీయ రేని
నందుమీద కోసలాధీశ! యదన నీ
వాచరించు వాడ వనువయినది 2033

నృపవరా! సీత బడయవ యేని శీల
సామ నయ వినయమ్ముల సరణి నీవు
నంతట మహేంద్ర వజ్రాభమైన హేమ
పుంఖ శర జాలముల చక్క పొడమ జేయు" 2034

## (66 వ సర్గ)

అట్లు శోక తప్తు డైనవాని ననాథు
వోలె నడలి యేడ్చుచున్న వాని
విపుల మోహ సమభివిష్ట పరిద్యూను
నొడల చేష్ట లెల్ల నుడిగి నతని 2035

అంత నొక ముహూర్త మట్లూరడించి సౌ
మిత్రి లక్ష్మణుండు మెలపు మీర
సంగ్రహించి యతని చరణ యుగ్మమ్ము ని
ట్లంచు రాము పల్కరించె నపుడు: 2036

### * లక్ష్మణుడు కర్తవ్యమును గరపుట *

"మహిత తపముచేత మహనీయ కర్మల
రామ! దశరథుండు రాజు నిన్ను
బడసె త్రిదశ లోక వాసులు దేవత
లమృత మందుకొన్న యట్టి రీతి 2037

నీ గుణముల వలన నిర్బద్ధుడౌ వాడు
పార్థివుండు నిన్ను బాయు కతన
భూవరాగ్రసరుడు దేవత్వ మందెను
మును భరతుడు మనకు వినిచినట్లు 2038

ఒదవి యున్న దుఃఖ మిది నీవు కాకుత్థ్స!
యోరిచి కొని యుండనేర వేని
యార్తులైన ప్రజల కందర కో నర
వ్యాఘ్ర! యెచట విడుపు పడయ నగునొ? 2039

ఇదియు లోక సహజమే యగుగాదె య
యాతి నహుష ధరణిపాత్మజుండు
శక్రువలన నందె సాలోక్య మాతని
కంటుకొనియె గాదె యనయ తమము 2040

మన పితరు పురోహితునకు వసిష్ఠ మ
హర్షి సత్తమునకు నాత్మజాత
శతక మొక్కపెట్ట జనియించె నట్టులే
నిహత మయ్యె మరల నిమిషమందె 2041

లోకములకు తల్లి లోక నమస్కృత
యైన యామె దేవి యగును భూమి
చలన మప్పు డపుడు సత్య ప్రతిజ్ఞుడా!
యట్టి భూమికైన నగుపడియెడి 2042

లోకములకు ధర్మ లోచనములు సర్వ
మెట ప్రతిష్ఠితమయి యెసగు నట్టి
యలఘుసత్త్వులైన యాదిత్య చంద్రులు
గ్రహణ మొందువారు గాదె వారు? 2043

సుమహనీయ భూత సమితి యైనను దేవ
తాళియైన మానవాగ్ర గణ్య!
తలగ ద్రోయ లేదు దైవమ్ము సర్వ భూ
తాది దేహులైన యట్టి రైన 2044

శక్రు డాదియైన సర్వ దేవతలకు
నయ మనయము రెండు నడచుచుండు
ననగ నరవరేణ్య! వినబడు చుండును
దాన చింత నొంద దగదు నీవు 2045

జనక తనయ నెత్తుకొని పోయినను గాని
యామె నాశ మంద నైన ననఘ!
తగదు నీకు వీర! బుగులుకొనంగను
తక్కు పామర జను చక్కి గాగ 2046

పొగుల బోరు నిన్ను బోలినవారు ని
రతము సత్య ధర్ములైన వారు
సుమహనీయ కష్ట సమయమ్ములన్ రామ!
మొక్కవోని బుద్ధి బొదలు వారు 2047

ఉన్న దున్నయట్టు లో నరసత్తమా!
పరపి బుద్ధి చింత నెరపు చక్క
నమల బుద్ధి యుక్తులైన మహాప్రాజ్ఞు
లరసి మంచి చెడ్డ లెరుగ గలరు 2048

గుణము దోష మెరిగికొన రాక యున్నవై
యిట్టి వనుచు గురుతు పట్ట రాని
పనుల వలన నిష్ట ఫలితము క్రియ యొన
ర్చుటను బట్టి కాక చొప్పు వడదు 2049

ఈవె గాదె రామ! యిట్లంచు పలు మార్లు
నాకు నానతిచ్చినావు మునుపు
చాలువా డెవండొ సాక్షా ద్బృహస్పతి
యైనగాని నీకు నానతీయ 2050

అమర వరులకును దురన్వయ నీ బుద్ధి
ప్రాజ్ఞవర్య! రాఘవాన్వవాయ!
దుఃఖముననను నిదుర దోగిన నీ జ్ఞాన
మేను మేలుకొల్ప పూనుకొంటి 2051

దివ్య మైనదియును భవ్య మానుషమైన
యదియు నైన నీ పరాక్రమమ్ము
నీవు నెంచి చూచి యిక్ష్వాకు పుంగవా!
కడగు మీవు శత్రు నడచు పనికి 2052

పూనుకొనగ నేల పురుషర్షభా! నీవు
సర్వ నాశనమ్ము సలుపు పనికి
ఈవు పాపి నతనినే శత్రువు నెరింగి
యతని గీటడంప నగును నీకు" 2053

## (67 వ సర్గ)

అన్న యైన గాని యన్నంత మాత్రమే
భ్రాత లక్ష్మణుని సుభాషితమ్ము
సార మహిత మపుడు సారజ్ఞుడగు రాఘ
వేశ్వరుం డతండు స్వీకరించె 2054

చక్క నిగ్రహించి నెక్కొన్న స్వీయ కో
పమ్ము నపుడు మహితబాహు డతడు
చిత్రమైన ధనువు చేయూతగా గొని
రాము డిట్టు లనియె లక్ష్మణునకు: 2055

"వత్స! యేమి చేయు వారము లక్ష్మణా!
యెచటి కేగువార మింక మనము?
ఏ యుపాయ మూని యిక సీత గాంచగా
నగు నటంచు నెంచుమా! యెడంద" 2056

అట్లుగా పరితాపార్తు డైనతనికి
రామునకు నిట్టు లనియెను లక్ష్మణుండు:
"తగును వెదుకంగ నీ జనస్థాన మీవు
బహుళ రాక్షసాకీర్ణమై పరగు దాని
వివిధ భూమీరుహ లతాభివేష్టితమును 2057

ప్రబలియున్న వికట పర్వత దుర్గముల్
కలవు నిర్ఝరములు కందరములు
ఘోరమైన వివిధ గుహ లున్న విచ్చోట
వివిధ జంతు జాల వేష్టితములు 2058

కిన్నరులకు నెలవు లున్నవి గంధర్వ
భవనములును గలవు వాని నెల్ల
నన్ను గూడియుండి సన్నాహ యుక్తుడై
నీవు నింక కలయ నెమక నగును 2059

బుద్ధియుతులు నిన్ను బోలిన వారలు
మానవాగ్రగణ్య! మహిత మతులు
కంప మొంద బోరు కడగండ్లలో నైన
ననిల వేగమునకు నచలము లటు" 2060

అంచు నిట్లు పల్క నాలించి లక్ష్మణు
గూడి యెల్ల కడల గ్రుమ్మరియెను
ఘోర శరము క్షురము గొని వింట సంధించి
యలుక గొన్న రాఘవాన్వయుండు 2061

* జటాయువు గాంచుట *

అట్లు చనుచు నుండ నద్రి కూటాభుని
మహిత భాగధేయు విహగ వరుని
వసుధ మీద బడిన వానిని క్షతజార్ద్ర
గాత్రుడౌ జటాయు గాంచె నచట 2362

వానిని పరికించి పర్వత శృంగాభు
రాము డిట్టు లనియె లక్ష్మణునకు:
"సీతడె తినియుండు సీతను వైదేహి
నిందు లే దొకింత సందియంబు 2063

కాననమ్ము లోన గ్రద్ధ రూపమ్మున
బరగు రక్కసి యిది స్పష్ట మగును
ఆయతాక్షి సీత నాహారముగ గొని
సుఖము మీర గూరుచున్న దిచట
దీని జంపువాడ దీప్తాస్యముల ఘోర
మౌ నజిహ్మగముల నాశుగముల" 2064

అని వచించి యురికె నా గ్రద్ధ మీదికి
ధనువునందు క్షురము దగులు కొల్పి
యలుక గొన్న రాము డాసముద్రమ్మైన
యవని వడక జేయు నట్టి రీతి 2065

నురుగు తోడి నెత్తు నోటి వెంబడి గ్రక్కి
దీన వచనములను తెలియ బల్కె
పక్షి దీనుడైన వానితో రాముతో
దశర థావనీశు తనయు తోడ : 2066

"ఓ చిరంజీవి! యెవ్వతె నోషధి వలె
వెదకు చున్నా డవో మహా విపినమందు
దేవి నామెను మరియు నా జీవములను
ఉభయము హరించె రావణుం డొక్క పెట్ట 2067

దేవి నెత్తికొంచు నీవును లక్ష్మణుం
డైన గాని లేనియట్టి యెడల
నరుగు చుండ రావణాసురుండు బలీయు
డేను గంటి రఘుకులేశ! యామె 2068

ఏగుదెంచి సీత కెదురుగా యుద్ధమ్ము
సందు రథము ధ్వంస మాచరించి
యేను విక్రమించి యిచ్చోట రావణు
గూల ద్రోసినాడ నేలమీద 2069

ఇదియె వాని విల్లు చిదురుప లైనది
ఇదియె వాని యమ్ము పొదుల జోడు
చదిపివైవ నేను సాంగ్రామిక రథమ్ము
భగ్నమయ్యె రామ! వాని దిదియె
సమరమందు వాని సారథి మత్పక్ష
నిహతు డయ్యె నితడె నేల గూలె 2070

బడలుపడిన నాదు పక్షముల్ ఖడ్గమ్ము
తోడ రావణుండు త్రుంచి వైచి
సీత నా విదేహ జాతను చేకొని
మొగిలు దారివెంట నెగసి చనియె
మున్ను దైత్యు దెబ్బ తిన్న వానిని నన్ను
చంప దగదు నీకు సాయకమున" 2071

అతడు సీత గూర్చి యాడిన పల్కులు
ప్రియము గూర్చునవి యెరింగికొన్న
వాడు బాష్ప పూర్ణ వదనుండు ద్విగుణిత
తాప తప్తుడైన దాశరథియు 2072

గ్రద్ధ రేని తనదు కౌగిట గదియించి
విడచి పుచ్చి దొడ్డ వింటి నాత
డొడల తెలివి దప్పి పుడమిపైన దొరంగె
నడరి యేడ్చె లక్ష్మణాన్వితముగ 2073

చేరరాని యొంటి దారి నొంటరి వాని
నూర్పు లెట్లొ బరపుచున్న వాని
నరసి మిగుల దుఃఖమంది సౌమిత్రితో
రాము డప్పు డిట్టు లంచు పల్కె: 2074

"పోయె రాజ్యము కానన మాయె నెలవు
జానకియు పోయె పక్షియు చచ్చిపోయె
నిత్తెరంగున నున్న నా నెత్తి రాత
పావకుని నైన దహియించి వైచు గాదె 2075

నిండియున్న నైన నేడు మహోదధి
నేను నీది దాటి యేగవలయు
నా నదీశు డైన నా నెత్తి రాతచే
చక్క నిగిరిపోవు నిక్కువముగ 2076

నిఖిల లోకమందు నిర్భాగ్యు డెవ్వాడు
నాకు మించి నతడు లేకయుండు
కొలది మీరినట్టి యలమటపున్ వల
జిక్కియుండి యిట్లు సొక్కుచుంట 2077

ఈత డీ ద్విజుండు నా తండ్రి నెచ్చెలి
గ్రద్దరేడు ముదిమి గ్రమ్మినతడు
పండినాడు నేలపై నేటువడి నా య
దృష్ట మిట్టులు తలక్రిందు లగుట" 2078

అంచు నిట్లు పెక్కులౌ పల్కు లాడుచు
లక్ష్మణాన్వితుండు రాఘవుండు
తాకె నా జటాయు తనువును తన తండ్రి
తోడి చెలిమి వెలికి తోచుచుండ 2079

తునుగ రెక్కలు నెత్తుట దోగినతని
గ్రద్దరాయని రాముండు కౌగిలించి
'మైథిలి యికేది ప్రాణ సమాన నాకు'
నంచు పల్కు విడచిపుచ్చి యవని బడియె 2080

(68 వ సర్గ)

రాము దరసి గ్రద్ధరాయని కడు నల్క
గొన్నవాడు నేల గూల్చినతని
సహజుడైన మిత్ర సంపన్ను సౌమిత్రి
గాంచి పల్కు లిట్లుగా వచించె: 2081

* జటాయువునకు మోక్ష మిచ్చుట *

"నిక్కవమ్ము గాగ నెరవేర్ప నా పనుల్
పూనుకొన్న వాడు పులుగు రేడు
యుద్ధమందు రాక్షసోపహతుం డయి
విడువరాని యుసురు విడుచువాడు 2082

ఇదియె వీని దేహ మిద్దాన లక్ష్మణా!
ఉసురు లింక నిచట నున్నవయ్య
దాన స్వర విహీను డైన నీతడు విక్ల
బత్వ మొంది తేరిపార జూచు" 2083

"మాట మాటలాడ మరల జటాయువూ!
ఓపువాడ వేని ఒక్క యింత
పల్కు సీత గూర్చి భద్రమ్ము నీ కగు
నాత్మవధము గూర్చి యాడు మయ్య 2084

ఎత్తుకొంచు బోయె నేటికి సీత రా
వణుడు? నను గురించి వాని కేమి
యే యపకృతి యెడద నెంచుట రావణుం
డపహరించెను ప్రియురాలి నామె? 2085

ఇందు బింబమునకు నెనయౌ మనోహర
మైన జనక తనయ యాననమ్ము
నెట్టు లుండెనొక్కొ యేమి పల్కులు పల్కె
నట్టియెడల నో ద్విజాగ్రగణ్య! 2086

ఎట్టి వీర్యవంతు? డెట్టి రూపమువా? డి
కెట్టి పనులవాడు వాడు రాక్ష
సుండు? వాని భవన ముండు నెచ్చట తండ్రి!
కలయ నడుగుచుండ తెలియబల్కు 2087

తేరి చూచి యంత దీనాత్ము డాతని
నెడయు తెరపి లేక యేడ్చు రాము
నతనితో జటాయు వతి సన్న వచనము
లొప్ప నిట్టు లంచు చెప్పె నపుడు: 2088

"రాక్ష సేంద్రు డైన రావణుం డా మెను
వింట నెత్తుకొంచు వెడలి పోయె
తురగలించు వాత దుర్దిన సంకుల
మైన విపుల మాయ నూనియుండి 2089

బడలియున్న నాదు పక్షముల్ రాక్షసుం
డతడు త్రుంచివైచి యంత తండ్రి!
సీత నా విదేహ జాతను చేకొని
దక్షిణంపు దిశకు తరలి పోయె 2090

నలిపి వైచుచుండె నాదు ప్రాణమ్ములు
చూపు రఘుకుమార! సుడియుచుండె
కాంచుచున్నవాడ కాంచన వృక్షముల్
వట్టి వేళ్ళ గూర్చినట్టి జుట్టు 2091

సీత రావణుండు చేకొని తన వెంట
నే ముహూర్త వేళ నేగినాడొ
దాన విప్రణష్ట ధనమును తత్స్వామి
సంతరించు కొనును సత్వరమ్మ 2092

వింద మనెడు పేర వెలయును కాకుత్థ్స!
యా ముహూర్త మాత దరయదయ్యె
నవహరించి నీ ప్రియాంగన జానకి
రాక్షసేశ్వరుండు రావణుండు
చెందు నాశనమ్ము చెచ్చెర గాలమ్ము
మ్రింగి నాశమొందు మీన మట్లు 2093

జనక మానవేశ తనయను గూరిచి
వ్యథపడంగ నీకు వలదు సుమ్ము
శీఘ్రముననె నీవు సీతతో విహరింతు
వసురు నతని కలన హతమొనర్చి 2094

ఒడల తెలివి దప్పకున్న యా గ్రద్దకు
బదులు రామునకును పల్కు నతని
కాననమున రుధిర మామిష యుక్తమై
కార దొడగె చావు చేరరాగ 2095

వాడు సుతుడు విశ్రవసునకు సాక్షాత్తు
భ్రాత యగు నతండు వైశ్రవణున"
కని వచించి యసురులను దుర్లభమ్ముల
విహగ వల్లభుండు విడచిపుచ్చె 2096

'చెప్పు చెప్పు' మంచు చెప్పుచు నుండంగ
దశరథాత్మజుడు కృతాంజలి యయి
విడచి పుచ్చి గ్రద్ద యొడలు ప్రాణమ్ములు
వెడలి పోయె గగనవీథి వెంట 2097

అతడు నేలమీద నానిచి తన తల
నపుడు కాళ్ళు రెండు నట్టె సాచి
స్వీయ గాత్రయష్టి విదలించి యంతట
పడె జటాయు వచట పుడమి మీద 2098

ఎఱ్ఱ కనులవాని నీక్షించి గ్రద్దను
విగతజీవు నతని నగ సమాను
పెక్కు దుఃఖములకు జిక్కి దీనుండైన
రాము డిట్టు లనియె లక్ష్మణునకు: 2099

"పెక్కు వత్సరములు రక్కసులకు నెల
వైన యెడను సౌఖ్యమార వాస
ముండి పక్షివరుడు దండకారణ్యమ్ము
నం దితండు శీర్ణమయ్యె నిచట 2100

ప్రాయమం దితండు బహువార్షికుం డయి
పెద్దకాల మట్టు పెంపుమీరె
నట్టివాడు నేడు హతుడై శయించెను
కాల మెవరి కైన గడవరాదు 2101

నాకు మే లొనర్చినట్టి యీ గ్రద్దయు
త్రుంగె లక్ష్మణా! కనుంగొను మిదె
ఈత డెదురుకొనియె సీతను గూరిచి
యలవు మీరు రావణాసురునకు 2102

తాత తండ్రుల యది తన గృధ్ర రాజ్యమ్ము
కడిది మీరిన యది విడచి పుచ్చి
నా ప్రయోజనమ్మునకు గాను ప్రాణముల్
పాయ విడచె నితడు పతగ విభుడు 2103

కానుపించు వారు గద యెల్ల యెడలను
సాధువులును ధర్మచారి జనులు
శరణ మొసగువారు సౌమిత్రి! శూరులు
జంతుజాల విహగ జాతులందు 2104

జనక తనయ నెత్తుకొని పోవగా సౌమ్య!
అంతగాగ దుఃఖ మంద నేను
నాకుగాను గ్రద్ధ నాశన మగుటచే
సంభవించి నంత శత్రుతపన! 2105

రాజు దశరథుండు ప్రథిత యశుడు శ్రీ స
మేతు డతడు నాకు నెంతగాగ
మాననీయు డగునో మరి పూజనీయుడో
అట్లె యీ విహంగమాధిపుడును 2106

పట్టుకొంచు రమ్ము కట్టెలు సౌమిత్రి!
నిప్పు సేయువాడ నేను చిలికి
గ్రద్దరేని నేను కాల్పు నెంచుచు నుంటి
వాడు నాకుగాను పడసె చావు 2107

రౌద్రకర్ము డైన రాక్షసుచే హతు
డైన వాని రాఘవా! యితనిని
పతగలోక నాథు చితిమీద నెక్కించి
దహన మాచరింతు తమ్ముడ! యిక 2108

గతియు నేదొ యజ్ఞకర్మ శీలురకును
ఆహితాగ్ని కేది యగునొ గతియు
యేది గతియొ వెనుక కేగని వారికి
నిల నొసంగువాని కేది గతియొ 2109

అట్టి లోకములకు నత్యుత్తమమ్ముల
కీవు నా యనుజ్ఞ నేగుమింక
కడిది బల్మికాడ! గ్రద్దలరేడ! నా
చేత సంస్కృతుండవై తరలుము" 2110

ఇట్టు లంచు పల్కి యెక్కించి మండెడు
చితి పయికిని వాని పతగనాథు
తగులబెట్టి వాని ధర్మాత్ముడౌ రాము
డాత్మబంధు వట్టు లలమటించి 2111

రాము డాత డంత సౌమిత్రితో గూడి
వీర్యవంతు డేగి విపినమునకు
క్రొవ్వియున్న గొప్ప రోహుల సమయించి
పరచి యుంచెను ద్విజవరుని కొరకు 2112

వెలికి దీసి రోహి పిశితముల్ పేశీకృ
త మ్మొనర్చి వాని తత యశుండు
రాఘవుం డొసంగె రమ్యమౌ హరిత శా
ద్వలమునందు వాని పక్షులకును 2113

మర్త్యుడైన వాడు మరణించినపు డేది
యుర్విసురులు చెప్పుచుండు వారొ
పితరు లెల్లవారు విబుధ లోకము జేర
నది జపించె రాము డతనికొరకు 2114

నరవ రాత్మజాతు లరిగి గోదావరీ
నదిని దాన నంత నుదకములను
గ్రద్ధరాయనికిని గావించి రతనికి
నుదక కర్మ వార లుభయు లపుడు 2115

శాస్త్ర దృష్టమైన సరణిని గ్రద్ధకై
రాఘవాత్మజులు జలమ్ములందు
స్నాన మాచరించి సలిపిరి గృధ్ర రా
జోత్తమునకు నప్పు డుదక కర్మ 2116

గ్రద్దరే డాతడు యశస్కరమ్ము దుష్క-
రమ్ము కర్మ నెరపి కూలి రణమునందు
దహన మొనరింప నాతని తపసి సముడు
తనదు శుభ పుణ్య గతికిని తరలిపోయె 2117

వారి కర్మల నొనరించి వారు విహగ
వరుని యెడ స్థిరబుద్ధిని పాదుకొల్పి
చనిరి సీతాధిగమమున మనము జొన్పి
వనమున సురేంద్రులో విష్ణు వాసవు లటు 2118

## (69 వ సర్గ)

ఉదక కర్మ యిట్టు లొనరించి వానికి
బయలు దేరినట్టి వారు రామ
లక్ష్మణులు వని మిథిలాత్మజాత వెదకు
వారు పడమటి దిశవైపు చనిరి 2119

బాణ చాప ఖడ్గ పాణులౌ వారలు
దక్షిణంపు దిశకు తరలిపోయి
యప్రహతము నైన యధ్వమ్ము నైక్ష్వాకు
వంశజాతు లచట పడసి రపుడు 2120

బహు విధమ్ములైన పాదపములు పొదల్
వివిధ రీతి లతలు పెనచియుండ
క్రమ్మియుండ నెల్ల కడలను దుర్గమ్ము
ఘోర దర్శనమగు కారడవిని 2121

దాటిపోయి వారు త్వరమీర వ్యాళ కే
సరి నిషేవితమ్ము పరమ భీమ
మౌ మహా వనమ్ము మహిత సత్త్వులు వారు
కాననమ్ములోన గడచి చనిరి 2122

ఆ పయి రఘుకులజు లా జనస్థానమ్ము
వీడి క్రోసు లొక్క మూడు గడచి
గహనమైన యట్టి క్రౌంచ వనమ్మున
జొచ్చి రా మహౌజసు లిరువురును 2123

వివిధ వర్ణ మేఘ విసర సంకాశమై
యుల్లసిల్లు నట్టు లెల్ల కడల
వివిధ పక్షిజాల వేష్టితమై బహు
వ్యాళ మృగ యుత మగు వనములోన 2124

జనకరాజ తనయ గనుగొన గోరెడి
వారు వెదకి రపుడు వన మదెల్ల
నచట నచట నిల్చి యలసట ద్రోచి సీ
తాపహరణ కర్శితాత్మ లందు 2125

అంత తూర్పు దిశకు నన్నయు దమ్ముండు
నరిగి మూడు క్రోసు లపుడు వారు
క్రౌంచవనము దాటి కడచి మతం గాశ్ర
మమ్ము చేరబోవు మార్గమందు 2126

కాంచి వారు ఘోర కానన మయ్యది
బహు భయంకర మృగ పక్షి యుతము
వివిధ సత్త్వ జాల వేష్టితమై యెల్ల
పట్టులందు గహన పాదపమ్ము 2127

కాంచి రప్పు డచట కందర మొండు పా
తాళ సమ గభీరతాస్పదమ్ము
సంతతమ్ము గాఢ సంతమ సావృత
మా యిరువురు దశరథాత్మజులును 2128

### * అయోముఖీ విరూపణము *

అట్లు చేరనరిగి యా నర వ్యాఘ్రులు
వార లా దరికి నదూరమందు
కాంచి రచట విపుల కాయమ్ముదానిని
వికృత ముఖిని దానవిన్ వనితను 2129

అడలు గొల్పు దాని నల్ప సత్త్వలకు బీ
భత్స రూప రౌద్ర భయద రూప
శాత దంష్ట్రి లంబ జఠరను కడు దీర్ఘ
గాత్రి మొరటు తోలు గల్గుదాని 2130

భయద మృగ గణమ్ము భక్షించు దానిని
వికట గాత్రి ముక్త విపుల కేశి
దాని నచట నన్నదమ్ములు రామ ల
క్ష్మణులు వా రిరువురు గాంచి రంత 2131

ఆమె చేరవచ్చి యా వీరు లిర్వురి
నన్నముంద రరుగు చున్నవాని
"రమ్ము మనము నిర్వురము కేళి దేలుద"
మని వచించి లక్ష్మణు నొడిచికొనె
పల్కు లిట్టు లంచు పల్కె సౌమిత్రిని
గట్టిగాగ నామె కౌగిలించి 2132

"ఏ నయోముఖి యన నెసగెడు దానను
నీకు దక్కితీవు నాకు ప్రియుడ
వద్రి శిఖర జాతమందు నదీ పులి
నమ్ములందు నాథ! నన్ను గూడి
జీవితమ్మునందు శేష మియ్యది యెల్ల
వీర! తేలుచుందు వీవు కేళి" 2133

అని వచింప విన్న యాతండు సౌమిత్రి
కనలు గొన్నవాడు ఖడ్గ మెత్తి
దాని ముక్కు చెవులు స్తన యుగ్మమును గోసి
వైచె నపుడు రిపు నిబర్హణుండు 2134

చెక్కివైచి నంత ముక్కును చెవులును
విస్వరముగ బొబ్బ వెలిచి యామె
పారిపోయె తిరిగి వచ్చిన దారినే
దనుజ కాంత భీమ దర్శనాంగి 2135

ఆమె యరిగినంత నతి గహనమ్మైన
వనములోన జొచ్చువారు కడిమి
నరి విమర్దనులగు నన్న దమ్ములు రామ
లక్ష్మణు లచట నుపలక్షణముల 2136

అరసినంతనే మహాతేజుడౌ లక్ష్మ
ణుండు నలఘు బల యుతుండు శుచియు
శీలవంతు డిట్లు చెప్పె దోయిలి యొగ్గి
ప్రబల దీప్త తేజు భ్రాత గాంచి: 2137

"కడు నదరుచునున్న దెడమ బాహువు నాది
మనము కంపమొందు మాడ్కి నుండె
కాంచుచుంటి పెక్కుగా ననిష్ట నిమిత్త
తతిని నేను నిచట తరచుగాగ 2138

అందువలన నీవు నార్య! సన్నద్ధుడ
వగుము హిత వచనము నాచరింపు
మివియు నాకు దోచు నీ నిమిత్తమ్ములు
పల్కు 'తత్క్షణమ్మె భయ' మటంచు 2139

పరమ దారుణ మగు వంచులక మ్మను
పేరు గల్గినట్టి విహగ మిదియె
సమరమందు మనకు సమకూరు విజయ మం
చనెడు నట్లుగాగ నరచుచుండె 2140

### * దను కబంధ శాప విమోచనము *

ఆ వనమ్ము నెల్ల నన్వేషణ మ్మిట్టు
లొనర మొప్ప చేయుచున్న వారి
కెరుగవచ్చె నప్పు డురుతర శబ్దమ్ము
ధ్వంసమైన యట్లు తద్వనమ్ము 2141

వాయు వేచి వీచి వడి మిక్కుటమ్ముగా
గగన భాగ మెల్ల గ్రమ్మినట్టు
లా వనమ్ము చప్పు డయ్యె నయ్యెడలను
నింపి వేయు నట్లు నింగి యెల్ల 2142

ధ్వని యదేమొ యెరుగ దలచుకొన్నా తడు
లక్ష్మణాన్వితు డగు రాఘవుండు
పొదలలోన నెదుట పొడగాంచె రాక్షసు
విపుల వక్షు మహిత విపుల కాయు 2143

అరసి రంత వార లిరువురు నచ్చట
కట్టెదుటను నిల్చి గ్రాలువాని
పొడవువాని తలయు మెడయును లేకుండ
కడుపులోన నోరు గల కబంధు 2144

దట్టమైన వాడి జుట్టుతో పెనుగొండ
వోలె కొలది మీరు పొడవువాని
సాంద్ర నీలమేఘ సన్నిభు రౌద్రుని
జలద నినదమట్టి స్వరమువాని 2145

అగ్ని శిఖను బోలె నలిక భాగమ్మున
మహిత పక్ష్మ మగుచు మండుచుండి
పింగ మాయతమ్ము విపులమ్ము ఘోరమ్ము
నాశుదర్శి యొక్క యక్షి యెడద
నొనర దీర్ఘదంష్ట్రి లొప్ప సతము నాకు
వాని నతని కెడద వాయివాని 2146

మెసవుచున్న వాని మృగరాజ భల్ల మా
తంగ హరిణములను దారుణముల
యోజనాయతముగ నొప్పెడు ఘోర బా
హువుల రెంటి జాపుచున్న వాని 2147

వివిధ భల్ల హరిణ విహగ గణమ్ముల
నొడిచిపట్టి హస్త యుగము తోడ
నెన్నరాక యున్న మృగ యూథ పతులను
పట్టి లాగి యడచి పట్టువాని
నా ప్రసన్నులైన యన్న దమ్ముల దారి
నాక్రమించి నిలిచినట్టి వాని 2148

అంత వారలు ముందటి కరిగి క్రోసు
నెడ గనుంగొనిరి భుజ సంవృతుని ఘోర
భీమ రూపు కబంధుని విపుల కాయు
నొడలి యున్కి కబంధమ ట్లున్న వాని 2149

అతడు మహితబాహు డాయత బాహువుల్
మేర మీరు నట్లు బారసాచి
పట్టుకొనియె కూడగట్టి రాఘవులను
బల్మిమీర నొత్తిపట్టి యుంచి 2150

ఖడ్గ ధారులు పటు కార్ముక హస్తులు
తిగ్మ కాంతి యుక్త దేహ ధరులు
సొక్కు వడసి రపుడు సోదరు లా మహా
బలురు కడు నలుగుడు వడెడు వారు 2151

అట్టి యెడల శూరుడైన రాఘవుడు ధై
ర్యమ్ము నూని బాధ నందకుండె
చిన్నతనము వలన దన్ను లేకుండుట
మిగుల బాధపడె సుమిత్ర సూతి
కడు విషణ్ణు డగుచు నుడివె నిట్లంచును
రాఘవానుజుండు రాఘవునకు; 2152

"దానవునకు జిక్కి దక్కిన వానిని
వివశుడైన నన్ను వీర! చూడు
మొంటిగాగ విడచి పుచ్చి నన్ రాఘవా!
ఈవు నైనను విడిపించు కొనుము 2153

భూతబలి యొసంగి పుచ్చి న స్నివైన
పారిపొమ్ము సుఖము బడయు నట్లు
పడయువాడ వీవు వైదేహి నచిర కా
లమ్ములోన నని తలంతు నేను 2154

తాత తండ్రులయది ధరణి నో కాకుత్స్థ!
నీవు మరల పడసి నెగడుచుండి
రామ! అట్టి యెడల రాజ్యస్థుడై నీవు
నెల్లవేళ తలచు టెసగు నన్ను" 2155

లక్ష్మణుండు నిట్టు లని పల్కి సౌమిత్రి
తోడ రాము డిట్టు లాడె నపుడు :
"వలదు నీకు భయము పడయంగ వీరుడా!
పొగులబోడు నిన్ను బోలువాడు" 2156

అంతలోన క్రూరుడైన దానవుడు క
బంధు డురుము బోలు స్వరమువాడు
అన్న దమ్ములైన యా రామ లక్ష్మణు
లిర్వుర నపు డడిగె నిట్టు లంచు: 2157

"ఎవరు మీ రిరువురు వృషభ ఘన స్కంధు
లలఘు ఖడ్గ కార్ముకాభియుతులు?
ఘోర దేశ మిదియు చేరంగ వచ్చిరి
వచ్చినారు నాకు భక్షణముగ 2158

పలుకు డీరు మీకు పని యేమొ యిచ్చోట?
నేగుదెంచినార లేటి కీరు?
చేర వచ్చినార లీర లీ దేశ మా
కొన్నవాడ నిల్చియున్న యెడకు 2159

బాణ చాప ఖడ్గ పాణులౌ మీరలు
వాడి కొమ్ము లున్న కోడె లట్లు
చేర నరుగు దెంచినారు నా నోటిని
బ్రదుకు మరల దుర్లభమ్ము సుమ్ము" 2160

ఆలకించి పల్కు లయ్యవి వానివి
ఆ కబంధునివి దురాత్మకునివి
రాము డిట్టు లనియె లక్ష్మణు తోడుత
మోమున గడు వాడిపోవు చుండ: 2161

"కష్టమునకు మించి కష్టమ్ము సత్య ప
రాక్రమా! సుఘోర మందియుండ
బ్రదుకు ముగియ వచ్చిపడె వ్యసన మ్మిది
కూర్మికత్తె పడయకుండ నామె 2162

కాలమునకు కడిమి కడుగొప్ప లక్ష్మణా!
యెల్ల భూత సమితి యెడల గూడ
మనుజ పుంగవ! కనుగొనుము నిన్ను నన్ను
వ్యసన మోహితులగువారి నీవు 2163

లేదు దైవమునకు నేదియు లక్ష్మణా!
బహుళ భార మెల్ల ప్రాణు లెడల
పరమ శూరు లైన బలవంతు లైన కృ
తాస్త్రు లైనను సమరాంగణమున
డీలుపడెడు వారు కాలాభిపన్నులై
ఇసుక యడ్డుకట్ట దుసికినట్లు" 2164

అని పలుకు దృఢ సత్య పరాక్రముండు
దాశరథి మహా యశుడు ప్రతాపవంతు
డారసి యుదగ్ర పౌరుషుడౌ సుమిత్ర
తనయు డిటవూనె తన మది తనకు దానె 2165

## (70 వ సర్గ)

వారి నచట నిలిచి నట్టి వారిని గాంచి
భ్రాతృ వరుల రామ లక్ష్మణులను
బాహు యుగళ పాశ పరివేష్టితులను క
బంధు డిట్టు లంచు పల్కె నపుడు: 2166

“క్షత్రియర్షభు లిటు గాంచుచు నన్ను నా
కొన్నవాని నిల్చియున్న వారు
మతి విహీనులైన మనుజుల దైవమ్మ
మిమ్ము పంపినాడు మేత కొరకు” 2167

ఆలకించి పల్కు లవి లక్ష్మణుండును
ఆ యదనునకు ననువైన హితము
పలికె నిట్టు లార్తి బడసి నాతండు వి
క్రమము సేయు పనికి గడగినతడు: 2168

“మున్ను తూర్ణముగను నిన్ను నన్నును గూడ
నాహరించు రాక్షసాధముండు
కాన త్రుంత మిపుడు కరవాలముల వీని
విపుల బాహువులను వేగముగను 2169

వెరపు గొల్పువాడు విపుల కాయుడు వీడు
రాక్షసుండు భుజ పరాక్రముండు
లొంగదీసి పేర్చి లోక మెల్లను గెల్చి
ఇంక మనల జంప నిచ్చ పడెడు 2170

చేయలేని వారి క్షితిపతీ! చంపుట
నిందితమ్ము మేదినీశ్వరులకు
రాఘవాన్వవాయ! క్రతు మధ్యమున గొంచు
వచ్చినట్టి పసుల వధము వోలె" 2171

అంచు నిట్లు మాటలాడుట నాలించి
యసుర వారి యెడల నలుక గదుర
కనలి నతడు వాయి కడు విచ్చి యప్పుడు
వార లిరువుర మెసవంగ దొడగె 2172

పిదప దేశ కాల విదులైన రాఘవుల్
వార లిరువురు కరవాలములను
నరకి రతని రెండు కరముల కడు నుర
వైన వాని భుజమువరకు నపుడు 2173

దక్షిణుండు వేగ దక్షిణ బాహువు
వాలుతోడ నేల వ్రీలి పడగ
దునియ నేసె రాము దనుజుండు సౌమిత్రి
వీరు డెడమ కేలు వ్రీలనేసె 2174

విపుల బాహు డతడు విచ్ఛిన్న బాహుడై
పుడమి బడియె బిట్టు బొబ్బవెట్టి
మిన్ను మన్ను నట్లె యన్ని దిక్కులు గూడ
మారుమ్రోగు నట్లు మబ్బు నట్లు 2175

కాంచి యతడు తనదు ఖండిత బాహువుల్
దొరగు నెత్తుటేట దోగి నతడు
దీను డగుచు నడిగె దానవు డా వీర
వరుల "నెవరు మీర లిరువు?" రంచు 2176

ఈ విధమ్ముగా వచించెడు వానికి
లక్ష్మణుండు సుశుభ లక్షణుండు
నెరుగజెప్పె రఘుకులేశు మహాత్మున
కా కబంధునకు మహాసురునకు: 2177

"ఎరిగికొనుము వీని నిక్ష్వాకు దాయాదు
జనము లెల్ల రాము డనెడి వాని
నితని యవరజుండ నే నెరుంగుము నన్ను
భ్రాత నితని కేను లక్ష్మణుడను 2178

నిర్జనంపు వనిని నివసించు దేవ ప్ర
భావ యుక్తుడైన వాని యితని
పత్ని రాక్షసుం డపహరించె నిచటికి
నరుగు దెంచినార మామె కొరకు 2179

ఈవు నెవడ వొక్కొ యేమిటి కిట్లు క
బంధ సదృశముగను వనమునందు
వక్షమందు వెలుగు వాయితోడుత నీవు
భగ్న జంఘుడ వయి పడితి విట్లు?" 2180

లక్ష్మణుండు నిట్టు లంచు వచింపగా
బదులు పల్కె లా కబంధునకును
పలికె నిట్టు లతడు పరమ సంప్రీతుడై
తలచుకొనుచు నింద్రు పలుకు లవియు 2181

"స్వాగతమ్ము మానవ వ్యాఘ్రములార! మీ
కేను గంటి మి మ్మదృష్ట వశత
భాగ్య వశత నాదు బాహు బంధము లివి
త్రుంగిపోయె మీరు త్రుంచివైవ 2182

ఎట్టు లవినయమున నీ విరూపమ్మైన
నాదు రూప మొందినానొ నేను
అదియు నేను చెప్పునది యో నరవ్యాఘ్రు!
వినుము వాస్తవమ్ము వినుతు నీకు 2183

## (71 వ సర్గ)

రాఘవా! మహా బల పరాక్రమా! మహా
బాహు! మున్ను నాకు బరగు రూపు
తలపరాని యట్టిదై యుండి మూడు లో
కములలో ప్రసిద్ధి గాంచియుండె
సోము దేహమట్లు సూర్యుని దేహమ్ము
పగిది శక్రు తనువు పగిదిగాగ 2184

అట్టి వాడ నేను నిట్టి రూపము దాల్చి
భయము జగముల గడు బర పెడునది
విపిన గతుల మునుల బెదరించుచుండుదు
నచట నచట రాఘవాన్వవాయ! 2185

అంత స్థూల శిరసు డను ముని పలు తెరం
గులవి వన్యము లవి కూడ బెట్టి
వాని నిట్టి రూప మూని కొల్లగొనంగ
నాకు మిగుల గనలినట్టి వాడు 2186

ఇట్టి రూపువాని నీక్షించి నన్ను శా
పాభిధాయి యాత డనియె నిట్టు:
'లిట్టి క్రూరమైన యీ రూపె లోక వి
గర్హితమ్మె నీకు గావుత మిక!' 2187

అలుక గొన్నవాని నాతని నే నభి
శాప కృతమునకును శాప పరిస
మాప్తి యుండవలయు నని యడిగి కొనంగ
నతడు పల్కె లిట్టు లంచు పల్కె: 2188

'బాహువులను రెంటి ఖండించి నిను రాము
డెపుడు విజన వని దహించువాడొ
అపుడు విపులము శుభమౌ స్వీయ రూపమ్ము
నే పడసెడివాడ వీవు మరల' 2189

ఎరిగికొనుము నన్ను నీవు లక్ష్మణ! సిరి
దనరువాడ దనుని తనయుడ నని
ప్రాప్తమయ్యె సంగరాంగణమున నిట్టి
రూపు నాకు నింద్రు కోపముచను 2190

ఉగ్ర తపము వలన నొనగూర్చితిని పరి
తోషణమ్ము నేను ద్రుహిణునకును
అతడు దీర్ఘమైన యాయువు నా కిచ్చె
దాన విభ్రమమ్ము తాకె నన్ను 2191

'పడసినాడ నేను కడు దీర్ఘ మాయువు
ఇంద్రు డింక నన్ను నేమి సేయు?'
నిట్టు లంచు బుద్ధి నే నూని రణమున
దేవవిభుని తాకుదెంచినాడ 2192

అతని బాహు ముక్తమౌ శతపర్వ స
మన్వితమ్మగు కులిశాయుధమ్ము
నా శరీరమున బ్రవేశించె నూరు యు
గ్మమ్ము నుండి మస్తకమ్ము నుండి 2193

అతని నేను బ్రతిమిలాడు కొన్నను గాని
యమ నిలయము జేర నంపడయ్యె
నగునుగాక సత్య మా పితామహు పలు
కదియు నని వచించె నతడు నాకు 2194

'ఎట్లు చాలువాడ నే ననాహారుండ
నై సుదీర్ఘ కాలమైన బ్రదుక
భగ్న సక్థిశీర్షవదనుండనై యుండి
ప్రబల వజ్రఘాత పాతితుండ?' 2195

ఇట్టు లనగ విన్న యింద్రుండు బాహువుల్
యోజనాయతముగ నొసగె నాకు
కుక్షిలోన వాడి కోరలతో నున్న
వాయి యమరజేసె వాడు నాకు 2196

అట్టి నేను దీర్ఘమైన బాహువులతో
పట్టి లాగి యిచటి వనచరముల
హరిణ మత్త నాగ హర్యక్ష శార్దూల
ములను తినుచునుంటి నలు గడలను 2197

ఇంద్రు డతడు నాకు నిట్లని వచియించె:
'లక్ష్మణాన్వితు డయి రాము డెపుడు
కలన నీదు బాహువులను ఛేదించునో
అపుడు స్వర్గమునకు నరుగు దీవు' 2198

ఈ యొడళ్ళతోడ నీ మహారణ్యమ్ము
లోన రామ! రాజలోక వర్య!
యేది యేది కనుల కెదురైన నది యెల్ల
గైకొనుటయె చక్కగా రుచించు 2199

తలచినాడ నేను తప్పక రాముండు
పట్టుపీడగ చేరవచ్చు నంచు
నిట్టి బుద్ధి మాని యే నుండి యీ యొడల్
విడచి పెట్టుటకయి బడలుచుంటి 2200

అట్టి రాము డీవు నగు నీకు భద్రమ్ము
ఈవు గాక నను మరెవడు రామ!
ఓపకుండు చంప నున్న దున్నట్లుగా
ముని వరేణ్యు డిట్టు లని వచించె 2201

సలుపువాడ బుద్ధి సాచివ్యమును నేను
మానవాగ్రగణ్య! పూని నీకు
తో డెరుంగ జెప్పువాడను మీ చేత
నగ్ని సంస్కృతుండ నైన పిదప" 2202

దను డతండు నిట్టు లని పల్కనాలించి
ధర్మచిత్తు డైన దాశరథియు
పల్కె నిట్టులంచు పల్కులు లక్ష్మణుం
డాలకించు చుండ నండ నుండి: 2203

"అపహరించెను రావణుం డనెడి వాడు
సీత నా భార్య కడు యశస్విని సౌఖ్య
మొప్పగా జనస్థానమ్ము నుండి యచట
నేను నా తమ్ము డైనను లేని యపుడు 2204

వాని పేరు మాత్ర మే నెరుంగుదు గాని
యా యసురుని రూప మదియు గాని
వాని నెలవు గాని వాని యలవు గాని
యెరుగకున్న వార మేము నింక 2205

దిక్కు లేక యున్న దీనులౌ వారల
నిట్లు కలయ పరువు లిడెడు వారి
నుపకృతి యొనరించు చుండెడు వారిని
తగిన రీతి సేయదగును కరుణ 2206

వెనుక నెపుడొ కరులు విరిచినయవి యెండు
కట్టియలను తెచ్చిపెట్టి మేము
వీర! నిన్ను తగులబెట్టుదు మిచ్చోట
సంతరించి దొడ్డ శ్వభ్రమొండు 2207

చెప్పు మందువలన సీత గూరిచి నీవు
ఎవ్వ డపహరించె? నెచటి కేగె?
నెరపు మీవు మేలు నిరవధికమ్ముగా
కల తెరంగు నీకు తెలియునేని" 2208

పల్కు లిట్టు లంచు పల్కగా రాముండు
పల్కనేర్చినట్టి వాడు దనుడు
నాలకించి యిట్టు లంచు వచించెను
వక్తయైన రాఘువాన్వయునకు: 2209

"లేనె లేదు దివ్యమైన జ్ఞానము నాకు
నేను సీతను గురుతెరుగకుంటి
నామె నెరుగగల్గు నతని దెల్పుదు దహి
యింప స్స్వీయ రూప మెనసి నేను 2210

నన్ను గాల్చివైవకున్నచో నో ప్రభూ!
నాకు నెరుగ శక్తి లేక యుండు
నలఘు వీర్యుడైన యసురుని నీ సీత
నపహరించి కొంచు నరిగినతని 2211

భ్రష్టమయ్యె నాకు రాఘవా! విజ్ఞాన
మెల్ల శాప దోష మెనసియుంట
నందినాడ నే స్వయంకృత కర్మచే
లోక గర్హిత మగు రూప మిదియు 2212

కాని భాస్కరుండు కడు పరిశ్రాంత వా
హనుడు గాగ నస్త మందకుండ
మున్నె రామ! యవటమున నన్ను బడవైచి
దహన మొనరుపుము యథా విధిగను 2213

నేను న్యాయ సరణి నీచేత రాఘవా!
యవటమందు దగ్ధుడైన మీద
అసురు నతని నెరుగు నాతని నో వీర!
యెరుగ జెప్పువాడ నింక నీకు 2214

న్యాయమైన రీతి నాతని తోడుత
నెరప నగును మైత్రి నీవు రామ!
సలుపజాలు వాడు సాహాయ్యము న్నీకు
ప్రీతి నొందిన లఘు విక్రముండు 2215

మూడు లోకములను గూడను రాఘవా!
అతని కెరుగరాని యదియు లేదు
కలయ దిరిగినాడు కారణాంతరమున
మున్ను సర్వ లోకముల నతండు" 2216

## (72వ సర్గ)

ఈ విధమ్ముగా వచింప కబంధుండు.
వీరులౌ నృపతులు వా రిరువురు
దరియ నరిగి పర్వత ప్రదరమ్మును
వెలువరించి రపుడు పీతిహోత్రు 2217

రగులుకొన్న నిప్పు రవ్వలతో లక్ష్మ
ణుండు చుట్టుపట్ల మండచేసి
చితిని రగులుకొనగ జేసె నయ్యదియును
ప్రజ్వలించె నన్ని వైపులందు 2218

ఆ కబంధు కాయ మయ్యది కడు దొడ్డ
నేతి ముద్దవోలె నెగడెడునది
యెరచితోడ మిగుల పెరిగిన వానిది
తగులబెట్టె మెల్ల దహను డపుడు 2219

చితిని చీల్చుకొనుచు చెచ్చెర లేచె నా
తండు ధూమ రహిత దహను నట్లు
దుమ్ము లేకయున్న దువ్వలువలు దాల్చి
మహిత బలుడు దివ్య మాల తోడ 2220

అంత నెగసివచ్చె నా చితిలోనుండి
భ్రాజితుండు నిర్మలాంబరుండు
మేన నెల్ల కడల మేలి భూషలు దాల్చి
నతడు వేగమ కడు హర్షమొంది 2221

ఉజ్జ్వలమ్ము హంస యుతము యశస్కర
మైనయట్టి ఘన విమానమందు
విపుల తేజు డతడు స్వీయ ప్రభన్ దశ
దిశలు వెలుగు లీన దేర్చుచుండి 2222

* కబంధుడు సుగ్రీవుని చెలిమి చేసికొమ్మని చెప్పుట *

అతడు నంతరిక్ష గతుడౌ కబంధుండు
వల్కె రాముతోడ పల్కు లిట్టు:
"లాలకింపు రాఘవా! వాస్తవమ్ముగా
నీవు సీత బడయ నెట్టు లగునొ 2223

ఆరు యుక్తు లున్నవయ్య రామా! లోక
మందు సర్వమున్ విమర్శ సేయ
నలముకొన దశాంత మద్దాననే దశా
భాగ మదియు పట్టువరచు మనుజు 2224

లక్ష్మణాన్వితముగ రామా! దశా భాగ
గతుడ వీవు హీనగతి బడసితి
దానివలన నీవు దార ప్రధర్షణ
వ్యసన మందియున్న వాడవయ్య 2225

కాన నీవు తప్పకయ సేయనౌ చెల్మి
కాంద్ర మేటి చెలిని గాగ వాని
చేయకుండ కార్య సిద్ధియౌ టది నీకు
నాకు దలప కానరాక యుండు 2226

వినుము రామ! నేను వివరింతు సుగ్రీవు
డనెడి వాడు వానరాగ్రగణ్యు
డలుక గొన్న యట్టి యన్న వాలి సురేంద్ర
నందనుండు వెడల నడచినతడు 2227

ఋశ్యమూక గిరి వరేణ్యమ్మునందు పం
పా సమీపమందు పరలు నెడల
వాసముండు నాత్మవంతుండు వీరుండు
నలువురను వనౌకసులను గూడి 2228

వానరేంద్రు డతడు ప్రబల వీర్యుడు తేజ
సాన్వితుం డమేయ సత్త్వభుండు
వినయశాలి యత డవితథ సంధుండును
ధృతి యుతుండు మహిత మతి యుతుండు 2229

మహిత బల పరాక్రమాన్వితుడు ప్రగల్భు
డతడు చాలువాడు ద్యుతి యుతుండు
వాని వెడల నడచె భ్రాత మహాబలు
డవని రాజ్యమునకునై రఘువర! 2230

అగును గాదె నీకు నాతండు తోడును
చెల్మికాడు నీవు సీతకొరకు
వెదకికొనగ రాఘవేశ్వరా! శోకమ్ము
నందవలదు నీదు డెందమందు 2231

ఏది యైన గాని యెట్టులు జరుగంగ
నుండె దాని శక్యమొక్కొ సేయ
నింక నొక్క రీతి నిక్ష్వాకు శార్దూల!
కాల మెవరికైన గడవరాదు 2232

ఏగు మీవు వేగ మిటనుండి రాఘవా!
నేడె యిచటినుండి నీవు నేగి
సుహృదు చేసికొనుము సుగ్రీవు నాతని
మహిత బలుని రఘుకుమార! వేగ
మనగి పెనగి యుండ నద్రోహ బుద్ధితో
వీతిహోత్రు డెదుట వెలుగుచుండ 2233

వానరాధిపుండు వాడు సుగ్రీవుడు
వాని చిన్నబుచ్చ వలదు నీవు
కృత మెరుంగు వాడు ధృత కామ రూపుడు
వీర్యశాలి తోడు వేడువాడు 2234

అత డొనర్ప గోరునట్టి కార్యము నెర
వేరుపంగ జాలువారు మీర
లిక కృతార్థుడైన నకృతార్థు డైనను
నీదు కార్య మతడు నెరపువాడు 2235

అతడు ఋక్షరజసు నాత్మజు డఘకుచు
మలయుచుండు పంప కెలకులందు
అతడు భాస్కరునకు నౌరస పుత్రుండు
వాలివలన కీడు పడినవాడు 2236

సాక్షిగా నొనర్చి యాయుధమును బుఖ్య
మూక నిలయుడైన యా కపి వన
చరు నొనర్చికొనుము సన్మిత్రుగా రామ!
శపథ మాచరించి సత్వరముగ 2237

వానరేంద్రు డతడు మానవ మాంస భ
క్షకుల లోకమందు కడగి యెల్ల
కడలు గూడ కడమ యిడకుండగా తాను
నేర్పు మీర నెరుగ నేర్చువాడు 2238

ఎరుక లేని దతని కించుక రాఘవా!
లేకయుండె నెదియు లోకమందు
యెంతదాక నైన నినుడు సహస్రాంశు
డరి విమర్దన! కడు నదరి వెల్గు 2239

వానరులను గూడి వాడు నిమ్నగలను
విపుల శైలములను వివిధ గుహల
భూధరేంద్ర దుర్గముల నెల్ల వెదకాడి
పడయు వాడు నీదు పత్ని నింక 2240

ప్రబల కాయు లైన వానరులను తాను
పంపువాడు రాఘవా! యతండు
వెదక నెల్ల దిశల వెంట నా సీతను
నిన్ను నెడసి కుములుచున్న దాని
నమలినాంగి నా వరారోహ రావణ
నిలయమం దెరుంగ గల డతండు 2241

అత దనిందిత మేరు శృంగాగ్ర గతను
సుదతి పాతాళ తలమున జొచ్చియున్న
ప్లవగ వర్యుడు దునుమాడి రాక్షసులను
నీ ప్రియాంగన మరలంగ నీ కొసంగు" 2242

## (73 వ సర్గ)

చెప్పి చూసి మరల సీతను బడయనౌ
తెరువు రాఘవునకు తెలియ జేసి
యర్థవిత్తముండు నన్వర్థ వాక్యమ్ము
నా కబంధు డిట్టు లాడె మరల: 2243

### * కబంధుడు ఋశ్యమూక మార్గమును సూచించుట *

"ఇదియె దారి రాఘవేశ్వరా! మంగళా
స్పద మిచట కుసుమిత పాదములు
కడు మనోహరముగ గ్రాలుచున్నవి
పశ్చిమంపు దిక్కు వైపుగాగ 2244

పనస జంబూ ప్రియాళ పిప్పల రసాల
ప్లక్ష తిందుక కర్ణికార వట నాగ
వృక్ష నక్తమాలక కరవీర తిలక
ధవ కదం బాగ్నిముఖ్యా చందన మహీజ
పారిభద్ర నీలాశోక పాదపములు 2245

వాని పైకి నెక్కి యైనను కానిచో
బల్మి నేలను బడవైచి యైన
నమృత కల్పమైన యా వృక్ష ఫలముల
మెసవుచుండి చనుడు మీ రిరువురు 2246

పుష్పి తావనీజ పూర్ణమౌ వనము కా
కుత్థ్స! దాని దాటుకొనుచు నేగి
యొండు వనము నందనోపమ ముత్తర
కురు ధరిత్రి సాటి దరియు వారు 2247

అఖిల కామ ఫల సమన్విత వృక్షముల్
బహు మధు స్రవములు పాదపమ్ము
లచట నెల్ల ఋతువు లలరారు చుండును
చైత్రరథ వనమ్ము చంద మొప్ప 2248

స్వాదు ఫల భరానతావనీజాతము
లలఘు విటప ధారులైన వెల్ల
కదల శోభ లొలయ గ్రాలు నచ్చోటను
మేఘ పర్వతమ్ము మెలపు మీరి 2249

వానిపైకి నెక్కి యైనను కానిచో
నేలను బడవైచి నెమ్మదిగమ
ఫలము లమృత కల్పములు సుమిత్రా తనూ
జాతు డితడు నీ కొసంగువాడు 2250

తిరుగులాడు చుండి వర దేశముల్ గిరి
నుండి గిరికి వనమునుండి వనికి
పిదప మీ రిరువురు వీరులు పంపాఖ్య
పుష్కరిణిని చేరబోవు వారు 2251

ఇసుక నాచు లేక దునికిలి పోవక
రేవు లొడిదుడుకులు లేకయుండ
సరసు గ్రాలు రామ! సంజాత వాలూక
యంబుజాత కువల యాన్విత యయి 2252

అందు తేలియాడు హంసలు క్రౌంచముల్
కురర జాతములు రఘూత్తమ! రమ
ణీయ రవము చెలగ కూయుచు నుండును
పంప నీళులందు పారెడునవి 2253

చంపు చెరుగకున్న సాధువులౌ పక్షు
లళుకకుండు నరుల నరసి యైన
నేతి ముద్ద లట్లు నెగడెడి లావైన
యండజముల తినుచునుండు డీరు 2254

పంపలోన నున్న వక్ర తుండమ్ముల
రోహిత నడమీన లోకములను
మేలి మత్స్యములను గూలిచి సాయకో
త్కరము తోడ నచట దశరథ సుత! 2255

పోవ ద్రోచివైచి పొలుసులు రెక్కలు
సన్ననైన ముండు లెన్ని యేని
నినుప యూచ గాల్చి యిచ్చును భక్తి దొ
లంకుచుండ నీకు లక్ష్మణుండు 2256

మిగుల మత్స్యములను మెసవుచుండెడి నీకు
పంపలోని పుష్పవార మధ్య
జలజ గంధి శివ సలిల మనామయమును
సేవ్య సుఖ విధాయి శీతలమ్ము 2257

స్ఫటిక రౌప్య సన్నిభము సంత తాక్లిష్ట
మంబుజాత పర్ణమందు గొంచు
వచ్చి లక్ష్మణుండు భక్తియుక్తుడితండు
త్రావ జేయు వాడు దప్పి దీర 2258

బలసియున్న వాని పర్వత గుహలలో
పండుకొనెడి వాని వనచరముల
నీళ్ళ కాసపడుట మళ్ళిన పందుల
నెద్దు లట్లు రంకె వేయు వాని
రూపు గల్గు వాని నా పంప చెంగట
నరయువాడ వీవు నర వరేణ్య! 2259

సంచరించి నీవు సాయాహ్నముల పుష్ప
మాల్య ధారులైన మ్రాకుల గమి
పంపలోని శీత వారియు గనుగొని
యుజ్జగించు వాడ వుమ్మలికము 2260

అచట కుసుమ నిచితమౌ నక్తమాలక
ములను పుష్పితముల తిలకములను
వికచ కువలయముల విస్ఫార పంకజా
తముల గాంతు దశరథాత్మజాత! 2261

మానవుం డెవండు గాని యా మాల్యము
లట నమర్ప లేద యట్టి రీతి
వాడుబారి పోక వరలెడు నయ్యవి
రాలిపోక యుండు రాఘవ! యవి 2262

నిలిచి యున్నవారు నెమ్మది నచ్చోట
గురు మతంగు శిష్యవరులు మునులు
వన్య భోజనులును భారాభితప్తులై
నట్టివార లా మహర్షి వరుల 2263

మేనినుండి జారి మేదినీ తలముపై
వేగ బడిన స్వేద బిందు సమితి
యవియు నెల్ల నప్పు డాయెను మాల్యముల్
మౌని జనుల తపము మహిమ వలన
స్వేద బిందు సమితిచే నుద్భవించిన
వవి నశింపకుండు నయ్య రామ! 2264

కానవచ్చు నేటికైన నచ్చోటనే
వార లెల్లర పరిచారిణి యగు
శబరి యనెడు నామె శ్రమణి కాకుత్థ్సుడా!
చిరము జీవితమ్ము నెరపు నామె 2265

సంతతమ్ము ధర్మ సంస్థిత యాయమ
కనుల గాంచి దేవకల్పు డైన
నిన్ను రఘుకుమార! నిఖిలభూతారాధ్య
స్వర్గ లోకమునకు చనెడు నింక 2266

పంప పశ్చిమంపు వైపు తీరమ్మునే
ఆశ్రయించి యుండు నచట రామ!
యామె యాశ్రమమ్ము నరయుదు కాకుత్స్థ!
యతుల గుహ్యమైన దంత సీవు 2267

ఆక్రమింప నచట నా యాశ్రమమ్మును
వారణముల కైన వలనుపడదు
పలు తెరంగులైన వారణములు గల
వచట నా వనమున నద్రిమీద
నచట నా యరణ్య మట్టు లుండె మతంగ
తాపసోత్తముని విధానముననె 2268

దాన నంద నోపమానమౌ వనమున
దేవ విపినమునకు దీటగు నెడ
వివిధ విహగ జాల వేష్టితమౌ నెడ
ముదితు డౌదు దుఃఖ ముడిగి రామ! 2269

పంప కెదురు కడనె పరగును ఋశ్యమూ
కమ్ము పుష్పిత ద్రుమమ్ము దాని
నెక్కు టనగ కష్ట మెంతయు శిశునాగ
సమభిరక్షిత మయి చనుచు నుంట
పూర్వ కాలమందు మొదటి వేలు పుదార
ధరణిధరము నిర్మిత మ్మొనర్చె 2270

శైల శిఖరమందు శయనించి నాతండు
కలను లిబ్బి పడసి తెలివి నొంది
దాని పడయువాడు దాని నెక్కక యుండు
పాప చారి విషమ వర్తనుండు 2271

ఎక్కనేని దాని నెవ్వ డైనను గాని
పాపచారి విషమ వర్తనుండు
వాని బట్టి కొట్టువార లచ్చోటనే
అత్తమిల్లి యుండ నసుర జనులు 2272

అట మతంగ వనమునం దుండు శిశునాగ
యూథ మాడుకొనుచు నుండ పంప
యందు వెలుచు నా మహాక్రందన మ్మది
యాలకింప వచ్చు నచటి కైన 2273

క్రుమ్మకొనుట నొండొరువుల మహా కరుల్
రక్త ధారల నభిషిక్త మగుచు
నొంటి దిరుగులాడు చుండు తరస్వులౌ
మబ్బు వన్నె నెసగు మద గజములు 2274

అవియు నచట నాని యంబువు శీతమ్మ
నవ్యయమ్మ విమల మైన యదియు
వనములోన జొచ్చి వన గోచరమ్ములు
పరమ మోద మొప్ప దిరుగులాడు 2275

భల్లుకముల మరియు వ్యాఘ్రమ్ములన్ నీల
రమ్య కాంతుల నలరారు వాని
నోట మన్న దెరుగ కున్నట్టి రురువుల
గాంచి శోక మీవు కడకు ద్రోతు 2276

ఆ ధరాధరమ్మునందు రఘూత్తమా!
వెడద గుహ యొకండు వెలయుచుండు
మూతివద్ద రాతి మూతతో కాకుత్థ్స!
అందు జొచ్చు టన్న నంగలార్పు 2277

ఆ గుహకును తూర్పునం దున్న వాకిట
శీత జలముల పెను చెరు వొకండు
ఇంపుమీర పండ్లు దుంపలతో నిండి
పలు తెరంగు మెకము లలమినయది 2278

వాస మచట నున్నవాడు సుగ్రీవుడు
కలసి వానరులను నలువుర నెపు
డైన గాని యాత డా మేదినీధర
శిఖర దేశమందు చేరి నిలుచు" 2279

ఈ కరణి వచించి యా కబంధుడు రామ
లక్ష్మణులకు నిర్వ్యరకును వారి
కర్క వర్ణ తుల్యుడౌ స్రగ్వి వినువీధి
వెలుగు లీనుచుండె వీర్యయుతుడు 2280

అకసమున నున్న యాతండు నా మహా
భాగుడౌ కబంధువద్ద కేగి
ప్రస్థితులగు వారు రామ లక్ష్మణులును
పల్కి రపుడు 'నీవు పద' మటంచు 2281

'చనుడు మీరు కార్య సంసిద్ధికై' యని
పల్కె వారితోడ వాడు నంత
పరమ ముదితులైన వారి ననిపి పుచ్చి
బయలుదేరె నా కబంధు డపుడు 2282

అట్లు లా కబందుడు రూప మదియు బడసి
తేలి సిరుల భాస్కర తుల్య దేహు డంబ
రముననుండి కాన్పించుచు రాము గాంచి
చెలిమి గావించుకొను మని చెప్పె నపుడు 2283

## (74 వ సర్గ)

ఆ నృపాత్మజాతు లా యరణ్యమున క
బంధ దర్శితమగు పంప కేగు
దారి బట్టుకొంచు తరలి పోయిరి తాము
పశ్చిమంపు దిక్కు బట్టి యపుడు 2284

అద్రి జాత భూరుహమ్ముల పెక్కింటి
క్షౌద్ర కల్ప ఫల విసర యుతముల
జూచు చేగినారు సుగ్రీవుని గనుగొ
నుటకు రామ లక్ష్మణు లిరువురును 2285

అద్రి పృష్ఠముపయి నా రామ లక్ష్మణుల్
వాస మాచరించి వా రిరువురు
దశరథాత్మజులును దరియంగ నేగిరి
పంప పశ్చిమంపు పజ్జ దరికి 2286

### * శబరి యాతిథ్యము *

వారు చేర నరిగి పంపా సరస్సున
పశ్చిమంపు తీర భాగమునకు
నంత నచట శబరి యాశ్రమమును రమ్య
మైన దాని గాంచి రపుడు వారు 2287

వా రిరువురు నంత బహు పాదపావృత
మౌ సురమ్య మైన యాశ్రమమ్ము
చేర నరిగి దాని నారసి కొంచును
శబరి చెంత జేర జనిరి వారు 2288

అరసి యపుడు వార లిరువుర నా సిద్ధ
లేచి వచ్చి దోయిలించి యుండి
సంగ్రహించె రాము చరణముల్ ధీయుతుం
డౌ సుమిత్ర సూతి యడుగు దోయి
యా మె యొసగె పాద్య మాచమనీయమ్ము
సర్వ మిరువురకును శాస్త్ర సరణి 2289

సంశిత వ్రత యగు శ్రమణికి నామెకు
నంత రాము డిట్టు లని వచించె:
"నీవు విఘ్నములను నిర్జించితొక్కొ? నీ
తపము వృద్ధినొంది తనరునొక్కొ?
నిగ్రహించి తొక్కొ నీవు తపోధనా!
ఆగ్రహమ్ము నశన మదియు గూడ? 2290

ఈవు నొందియుంటివే నియమమ్ముల?
నెగడెనొక్కొ సుఖము నీదు మదికి?
నిష్ఠుర వ్రతమ్ము నీ గురు శుశ్రూష
చారు భాషిణి! యది సఫలమె కద?" 2291

అడుగ రాము డిట్టు లంచును తాపసి
సిద్ధసమ్మత యగు సిద్ధ యామె
ముదుక శబరి పల్కె బదు లిట్లు రాముని
యంతికమ్ము జేర నరిగి యపుడు: 2292

"నేడుగా వడసితి నేను నీ సందర్శ
నమ్ము వలననే తపమ్ము ఫలము
నేడు తపమున కొనగూడె సాఫల్యము
గురులు చక్క పూజ గొనినవారు 2293

సఫలమయ్యె నాదు జన్మమ్ము నీ నాడె
స్వర్గలోక మదియు సంచలించు
నీవు రఘు కుమార! దేవ వరుండవు
పూజ లందుకొనగ పురుష వృషభ! 2294

సౌమ్యమైన నీదు చక్షువులను రఘు
నందనా! పవిత్ర నైతి నేను
చనెద త్వత్ప్రసాదమున నే నరిందమా!
క్షయము లేని యట్టి జగములకును 2295

చిత్రకూటమునకు చేరగనే నీవు
నతుల కాంతి యుతములౌ విమాన
ములను వార లెక్కి పోయి రియ్యెడనుండి
యేను మున్ను పరిచరించినారు 2296

ధర్మవేత్త లలఘు తాపసు లా మహా
భాగు లరసి నన్ను పల్కి రిట్లు:
'రాగలాడు నీదు రాముడు కడుపుణ్య
మునకు న్నాశ్రమ పదమున కిచటికి 2297

సంప్రతిగ్రహింప జనును సౌమిత్రితో
నరుగుదెంచినట్టి యతిథి నతని
నతని గాంచి యక్షయములైన పుణ్యలో
కముల కంత నేగ గాంతు వీవు' 2298

వన్య వస్తువులను పంపా సర స్తీర
సంభవమ్ముల పురుషర్షభ! వివి
ధముల ప్రోగుజేసి దాచియుంచిన దాన
పురుషసింహ! నీదుకొరకుగాను" 2299

అని వచింప శబరి యాలించి ధర్మాత్ము
డతడు రాఘవుండు ననియె నిట్లు
వృద్ధ శబరి నిత్య విజ్ఞాన విష యాబ
హిష్కృత యగు నట్టి యింతి గాంచి: 2300

"దనునివలన నేను వినియున్నవాడ మ
హాత్మకుని ప్రభావ మదియు నెల్ల
కన్నులార నిపుడు కనుగొన గోరుచు
నుంటి నీవు నొప్పుకొంటి వేని" 2301

ఆలకించి రాము నాననముననుండి
వెలికి వచ్చినట్టి పలుకు లివియు
కానుపించె శబరి తాను వా రిర్వుర
కా మహావనమ్ము ననుచు నిట్లు: 2302

"కాంచు మిదియె రామ! ఘన మేఘ సదృశమ్ము
విహగ మృగ గణాభివేష్టితమ్ము
దశరథాత్మజా! మతంగ వన మ్మన
వెలయుచుండు నిదియు పేరుగాంచి 2303

భావితాత్ము లైనవారు నా గురువులు
వార లిచట మహిత వనములోన
మంత్రవ న్మహాత్మ మంత్ర పూజితమగు
తీర్థ మాహ్వాయించి తెచ్చి రిటకు 2304

పరగు నిదియె వేది ప్రత్యక్స్థలిన్ వారు
నాదు పూజ లందినట్టి వారు
బడలుపాటు వలన వడకెడు కేల పు
ష్పోపహారము లెపు డొసగువారు 2305

వారి యా తపః ప్రభావమ్ము వలననే
చూడు రఘువరేణ్య! నేడు గూడ
వెలుగజేయు దిశల వెల్లను సిరులచే
వేదు లతుల కాంతి విలసితములు 2306

ఓపకున్న వార లుపవాసమున నైన
బడలు పాట నలిగి నడువ లేక
తలచుకొన్న యంత తరలి వచ్చిన వివె
సప్త సాగరములు సహితముగను 2307

వారు తానమాడి యారవేసినయవి
వల్కలములు పాదపముల నిచట
నెండిపోవ కున్న వీ నాటి కైన ని
య్యెడల రఘుకుమార! యీవు గనుము 2308

దేవ కార్యము కడతేరుచు వారలు
కలువ పూలతోడ కడమపూల
గూర్చి యున్న యట్టి కుసుమ మాల్యము లివి
వాడు మొగ మొకింత పడకయుండె 2309

వన మిదెల్ల నీవు కనుగొన్న వాడవు
వినవలసిన దెల్ల వింటి వీవు
అందువలన నింక నభ్యనుజ్ఞాతనై
ఈ యొడళ్ళు విడువ నిచ్చగింతు 2310

ఏ మునీశ్వరులకు నీ యాశ్రమమ్మున
నేను మున్ను పరిచరించినానొ
భావితాత్ములైన వారల చెంతకు
నేగ నిచ్చగింతు నింక నేను" 2311

తాను నాలకించి ధర్మిష్ఠమౌ పల్కు
లక్ష్మణాన్వితుండు రాఘవుండు
'నబ్బుర' మ్మటంచు నతుల ప్రహర్షమ్ము
వడసె నపుడు వాస్తవమ్ము గాగ 2312

* శబరి మోక్షము *

సంశితవ్రత యగు శ్రమణి గనుంగొని
రాము డిట్టు లనియె నామెతోడ ;
"నతుల భక్తితోడ నర్చించితివి నన్ను
నేగు సుఖము మీర నిచ్చకొలది" 2313

ఇట్టు లనగ చీర కృష్ణాజి నాంబర
జటిల వృద్ధయైన శబరి యామె
ఆ ముహూర్తమందె అత్యంత జీర్ణమౌ
నొడలి విడువ గోరుచున్న యామె 2314

ఆమె రాముచేత ననుమతి గొన్నదై
యగ్నిలోన తాను నాహుతయయి
ప్రజ్వల త్సుతీవ్ర పావక సంకాశ
స్వర్గ లోకమునకె చనియె నామె 2315

మహిత నవ్య దివ్య మాల్యానులేపన
యతుల దివ్య భూషణాభియుక్త
వర మనోజ్ఞ దివ్య వాసోధరయు ప్రియ
దర్శన యయి యందు తనరు చుండె
వెలుగజేయుచుండి విద్యు త్తటిల్లత
మాడ్కి నా ప్రదేశ మదియు నెల్ల 2316

పుణ్య చిత్తు లైన ముని వతంసులు వార
లెచ్చట విహరింతు రెల్ల వేళ
నట్టి పుణ్యపదము నాత్మ సమాధిచే
చేరజనియె శబరి క్షిప్ర గతిని 2317

## (75 వ సర్గ)

దివమునకును స్వీయ తేజమ్మునన్ జేర
నరిగినంత శబరి యామె యట్లు
రాఘవుండు భ్రాత లక్ష్మణుతో గూడి
తాను చింతసేయ దలకొనియెను 2318

ధర్మచిత్తు డతడు తలపోసి యా మహా
త్మకుల యా ప్రభావ మదియు నెల్ల
హిత మొనర్చు వాని కేకాగ్రమతి కనె
లక్ష్మణునకు నిట్లు రాఘవుండు: 2319

"కాంచినార మయ్య కడు నబ్బురమ్మైన
యాశ్రమము కృతాత్ములదియు సౌమ్య!
మెలగు నమ్మికమెయి మృగములు పులులును

సప్త సాగరములు సమకూడి లక్ష్మణా!
మెలగు నిచటి తీర్థములను మనము
స్నాన మాడినాము సల్పినారము యథా
విధిగ తర్పణములు పితరులకును 2321

అణగిపోయె నశుభ మయ్యది యెల్ల క
ల్యాణ మదియు చేర నరుగుదెంచె
నందువలన హర్ష మందిన దీ వేళ
నా మనమ్ము లక్ష్మణా! నిజముగ
నొాదవబోవు గాదె యో నరశార్దూల!
ఇంక మంగళమ్ము హృదయమందు 2322

అందువలన నడువు మరిగెడువార మా
యింపు లొల్కుచుండు పంప కడకు
నచటి కనతి దూరమందు వెల్గొందెడు
భూధరమ్ము ఋశ్యమూక మదియు 2323

అంశుమంతు పుత్రు డైన సుగ్రీవుడు
ధర్మచిత్తు డుండు దానిమీద
ననవరతము వాలి కడలెడి వాడు న
ల్వురను వానరులను బెరసి యుండి 2324

వానరర్షభు డగు వాని నా సుగ్రీవు
నేగి గాంచ వేగిరింత మయ్య
అతనిచేత నున్న దాయె నా సీతకై
కలయ వెదకు టన్న గాదె సౌమ్య!" 2325

అని వచించు ధీరు నాతని రాముని
గాంచి లక్ష్మణుడు వచించె నిట్టు:
"అరుగువార మయ్య యచటికి వేగమే
తొందరించు నాదు డెంద మైన" 2326

అంత నాశ్రమమ్ము నద్దానినుండి వె
ల్వడిన వాడు మానవాధిపతియు
వచ్చి చేరె నంత పంపను లక్ష్మణు
గూడి యుండి రిపుల గూల్చు వాడు 2327

* రాముడు పంప కేగుట *

అతడు కనుల గాంచె నంత పవిత్ర ను
దార జన నిషేవిత యగు దాని
వివిధ తరు లతాభివేష్టిత యౌ దాని
పంప పానయోగ్య వారివహను 2328

రాగ మెసగ పద్మ సౌగంధికమ్ముల
తెల్ల కలువ గముల తెల్లనగుచు
నీలి కలువ గముల నీలమై చిత్ర కం
బళము వోలె పెక్కు వన్నె లొప్ప 2329

దాని దూరముననె దాశరథి యతండు
పారజూచి యుదక వాహిని యగు
సరసులో మతంగ సరసను దానిలో
నపుడు చక్క స్నాన మాచరించె 2330

తెల్ల కలువ పూల తెలిదమ్మి పూవుల
నెర్ర కలువ పూల నెర్రతమ్మి
పూల నిండియుండి పుష్పి తామ్రవణాన్వి
తమ్ము బర్హి నాదితమ్ము నగుచు 2331

దాడిమములు తిలక ధవములు నర్జున
వృక్షము లలరు కరవీరములును
పూచియున్న మేలి పున్నాగములు మాల
తులును కుంద గుల్మములును నట్లె 2332

వంజుళములు సప్తపర్ణములును వట
వృక్షములు నశోక వృక్షములును
మొగలిపొద లవి యతిముక్తకమ్ములును పెం
పారి యెల్ల కడల నలముకొనగ 2333

పెక్కు తెరగులైన పెర తరువులతోడ
తరుణి వలె నలంకృత యగు దాని
నెల్ల కడల విపుల వృక్షాన్వితమ్ము పు
ష్పాఢ్యమైన వనము నరసికొంచు 2334

అర్జునకముల తోడ కోయష్టికముల
తోడ శతపత్ర శుకముల తోడ నిండి
ఇట్టి తీరువే విహగము లింక కొన్ని
కూత లిడుచున్నయట్టి యా గొప్ప యడవి 2335

సరసమైన వనము శకున సంకీర్ణమై
వరలుచున్న దాని నరసికొంచు
నంత జనిరి రాఘవాత్మజు లవ్యగ్రు
లై సమాహితాత్ము లగుచు వారు 2336

అతడు కనుల గాంచె నంతట పంపను
సతత శుభను శీత సలిల నిధిని
సంప్రహృష్ట వివిధ శకున సంకీర్ణను
తరు గణోపశోభిత యగు దాని 2337

రాము డతడు పలు తెరంగు వృక్షమ్ములు
పలు తెరంగులైన కొలకు లవియు
గాంచుచుంట నంత కామాభిసంతప్తు
డరిగె పరమమైన హ్రదము జేర 2338

స్ఫార పుష్పితోపవన సముపేతను
సాల చంపక తరు సంపదాఢ్య
మత్త షట్పదౌఘ మాలా సమావిష్ట
శ్రీ సమేత నతుల భాసమాన 2339

స్ఫటిక సన్నిభ మగు జలముల పెంపారి
మెత్తనైన యిసుక మొత్త మొప్పు
పంప రమ్య సరసు పద్మ సౌగంధికా
న్వితను దాని మరల నతడు గాంచి
సత్య విక్రముండు సౌమిత్రి గన్గొని
పల్కె నిట్టులంచు పల్కె నపుడు: 2340

"ఈ సరస్సు నొడ్డునే మున్ను చెప్పిన
భూధరమ్ము ఋశ్యమూక మనగ
ఖ్యాతి గన్న దెల్ల కడలను ధాతు మం
డితము పుణ్యము కుసుమిత కుజమ్ము 2341

హరికి ఋక్షరజసు డను పేరు గల మహా
త్మకున కాతనికిని తనయు డైన
శూర సత్త్వముండు సుగ్రీవు డనగ పెం
పారువాడు దాన నధివసించు 2342

చేర నరుగు మీవు చెచ్చెర సుగ్రీవు
వానరేంద్రు మానవాగ్రగణ్య!"
అని వచించి మరల నా సత్యవిక్రము
డైన లక్ష్మణునకు ననియె నిట్లు : 2343

"పృథ్వి రాజ్యమునకు వెలియైన దీనుండ
నెడద దాన తగులువడిన వాడ
బ్రదుక నెట్టు లనువు పడునయ్య లక్ష్మణా!
నాకు నామె సీత లేకయుండ" 2344

చెప్పి పల్కు లివి యనన్య చిత్తుడౌ సు
మిత్ర సూతికి మదన సంపీడితుండు
చొరియె పంపా హ్రదము మనోహరము రాఘ
వాన్వయుండు శోక విషాద యంత్రితుండు 2345

అంతట సుదూర విక్రమమౌ మహత్ప
థము క్రమముగ గడచి శుభదర్శ కాన
నయు ననేక విధ ఖగ గణాన్విత యగు
పంప ప్రతికూలధన్వను వాడు గాంచె 2346

మౌనికులావతంసు డసమాన వచో విభవుండు లోకక
ల్యాణ చికీర్ష చిల్కినది రామకథా సుధ తత్సుధాంశ మీ
కానన కాండ మాదికవి క్రమపద ప్రతిరావకమ్ము రా
మానుజ నామక గ్రథిత మాంధ్ర వచో మధు గంధిలంబుగాన్

